సెప్టెంబరు 2015

రూ. 15/-

# చతుర

* సింహప్రసాద్

# చిలుకా క్షేమమా!




చిలుకా క్షేమమా!
కులుకా కుశలమా!
అంటోందీ ప్రకృతి
కవచం!
'ఆకులో ఆకునై'
అన్నట్లుగా
హాయిగా
ఈ పచ్చదనంలో
సేదదీరుతున్న
చిలుకరాజావారు
ఎక్కడున్నారో
కనిపెట్టండి మరి!

# భామనే.. సత్యభామనే..!



★ నెంబర్ వన్ స్థానాన్ని చేరుకోవాలనే తపనతో ఎపుడూ ఆటల్లో మునిగిపోయి చెమటలు కక్కుతూ కనిపించే మన క్రీడాకారిణులను భారతీయ సంప్రదాయ కట్టులో చూడాలనుకుంటున్నారా?

★ మనం రోజూ తీసుకునే ఆహార పదార్థాలు స్వచ్ఛమైనవా? కల్తీవా? తెలుసుకోవడమెలా?

★ క్యారెట్ తో క్షణాల్లో చేయగలిగే, పిల్లలకు నచ్చే పసందైన వంటకాలు..!

చలో పేజీ నెం. 122.

– సంపాదకులు

## త్వరలో చతురలో..!

హోతా పద్మినీదేవి

**గుట్టు**

..................................

అక్కినపల్లి సుబ్బారావు

**ఆవలి అంచు**

..................................

బి.వి.ఎస్. రామారావు

**సీతారామాంజనేయ లాంచి సర్వీసు**

# మనసున ఉన్నదీ...

★ ఆగస్టు సంచికలో ప్రచురితమైన నవల 'అరణ్యపర్వం' ఆద్యంతం ఏకబిగిన చదివించింది. పర్దితెగ ఆచార వ్యవహారాలు, పులుల స్వభావాలు, వేట విషయాలు.. మొత్తంగా అడవి జీవనసరళికి అద్భుత అక్షరరూపం ఇచ్చారు. చతురసమ్'గతులు ద్వారా ఎన్నో విషయాలు తెలుసుకోగలిగాం. చమత్'కారం' వినోదంగా ఉంది. 'నవలావలోకనం'లో ప్రత్యేక శిల్ప నైపుణ్యంతో ప్రౌఢశైలిలో ప్రసాదరావుగారి నవల 'మినువాక'పై సమీక్ష ఆలోచనాత్మకంగా ఉంది. చతురకతలు రెండూ బాగున్నాయి.

**– డి. శ్రీనివాసదీక్షితులు,**
నరసరావు పేట, గుంటూరు జిల్లా

★ స్వాతంత్ర్యం పొందిన తర్వాత దేశాన్ని పట్టిపీడిస్తున్న సమస్యల్లో ఒకటి ఆదివాసీల సమస్య. అరణ్యపర్వం నవలలో రచయిత సలీం ఈ సమస్యకు పరిష్కారం చూపుతూ సమాజాన్ని హెచ్చరించారు. చివరలో ఓ రాజకీయనాయకుడు, అటవీఅధికారి అడవుల ను, వన్య ప్రాణులను నాశనం చేయడానికి చేతులు కలుపుతారు. అంటే ఈ విధ్వంసం ఇలాగే కొనసాగాలా? అని పాఠకులు ఆలోచించాలని వదిలినట్లుంది. రచయితకు అభినందనలు.

**– ధవ్ఫూరి శ్రీధరాచార్యులు,**
సీతారాంబాగ్, హైదరాబాద్

★ సయ్యద్ సలీం నవల అరణ్యపర్వానికి సలాం! వేట గురించి, పర్దితెగ జీవనవిధానం గురించి చాలా విషయాలు తెలుసుకోగలిగాం. ఆది నుంచి నవల ఎంతో ఉత్కంఠగా పరుగులు తీసింది. గుంజన్ రాక్షస ప్రవృత్తి నుంచి ఉన్నత మానవతావాదిగా మారిన ఇతివృత్తం ఎంతో బాగుంది.

**– పక్కి బాలకృష్ణ,** విశాఖపట్నం

★ చతుర నాకు ప్రియనేస్తం! నవల 'అరణ్యపర్వం' ఆద్యంతం మనసును దోచుకుంది. దీని ద్వారా వన్యమృగాలను రక్షించుకోవాలి అనే సందేశం ఇచ్చారు.. అభినందనలు! పెద్దకథ 'ప్రతీకారం' ద్వారా అమ్మాయిలు జాగ్రత్తగా ఉండాలనే ఆలోచన కలిగించిన డా. ఆర్. రాజ్యలక్ష్మికి కృతజ్ఞతలు. 'కొత్తగాలి, అక్షరం' బాగుంటున్నాయి. చతురసమ్'గతులు ఆకట్టుకున్నాయి. ఇలా చతుర ఆద్యంతం చాలా బాగుంది.

**– ఎస్. సంతోష్‌కుమార్,**
కొడిమ్యాల, కరీంనగర్ జిల్లా

★ ఆగస్టు నవల ఆద్యంతం రసవత్తరంగా సాగింది. అరణ్యాలలో ఎదురయ్యే అద్భుత, భయానక రసాలను పాఠకులు ఆస్వాదించేలా చేసింది. 'నవలావలోకనం'లో 'మినువాక'పై సమీక్ష బాగుంది. 'కొత్తగాలి' కవితలు కాలాను గుణంగా ఉంటున్నాయి. చతురసమ్'గతులు విలువైన సమాచారాన్ని అందిస్తున్నాయి. చమత్'కారం'లో తలబిరుసుతనానికి చెంపదెబ్బ లాంటి బదులివ్వడం బాగుంది. 'ప్రతీకారం' కథకు ఆ పేరు చక్కగా అమరింది.

**– డాక్టర్ శివభూషణం,** కర్నూలు.

★ ఫాంటసీ , కాలక్షేపం పెరిగిపోతున్న ఈ రోజుల్లో ఒక సామాజిక ప్రయోజనం ఉన్న 'అరణ్యపర్వం' లాంటి నవలని అందించినందుకు సంపాదకవర్గానికి, రచయిత సలీంకు కృతజ్ఞతలు. నవలావలోకనం శీర్షిక ద్వారా పాత నవలల పరిచయం చతురకే హైలైట్.

**– హైమాకె. శ్యామ్,**
మందమర్రి, ఆదిలాబాద్ జిల్లా

★ సలీం నవల 'అరణ్యపర్వం' సూపర్బ్! 'కొత్తగాలి' కవితలు కనువిప్పు కలిగించేవిగా ఉంటున్నాయి. 'నవలావలోకనం'లో ప్రతినెలా అలనాటి ఓ మంచి నవలను పరిచయం చేస్తున్నారు. ధన్యవాదాలు.

**– ఎ. లక్ష్మినారాయణ,** పొన్నూరు

★ ఆగస్టు 'చతుర' ముఖచిత్రం చూడముచ్చటగా ఉంది. సలీం నవల 'అరణ్యపర్వం' ఒళ్లు గగుర్పొడిచే అనుభూతి కలిగించింది. పులుల గురించి, వాటి వేట, ప్రవర్తన గురించి చక్కగా వివరించారు రచయిత.

**– కరణం శివానందరావు,** కర్నూలు

సంపుటి -38
సంచిక - 8
452వ సంచిక
పేజీలు : 132, సెప్టెంబరు 2015

# చతుర

**గౌ**తమి పుల్లతో చిన్నగొయ్యి తవ్వి అందులో చిల్లర డబ్బులు పాతుతూ ఉంది.

'అదేం పిచ్చిపని గౌతమీ?' మందలించాడు బాబాయి వేణుగోపాల్.

'గుప్పెడు ఒడ్లు జల్లితే కుంచెడు ధాన్యం ఇస్తాయి వరి మొక్కలు. పట్టెడు డబ్బు బిళ్లల్ని పాతితే కనీసం గుప్పెడు గింజలైనా ఇవ్వవా? అని నాటుతున్నాను' అమాయకంగా చెప్పింది గౌతమి.

'నీకేమైనా మతిపోయిందా?' అరిచాడు వేణుగోపాల్.

'పోనీ మీరు సంపాదించిన వజ్ర వైడూర్యాల్ని పొలంలో వెదజల్లితే ఒక్కముద్దకు సరిపడా తిండిగింజలు మొలుస్తాయేమో చూద్దామా బాబాయ్?' అడిగింది గౌతమి.



'ఏమిటా మతిలేని మాటలు? నాణేలు, వజ్రాలు విత్తనాలు కాదు, మొక్కలు రావడానికి' గౌతమి మీద విరుచుకుపడ్డాడు ఆయన.

గౌతమి ఎందుకలా చేసింది? ఆమె ఆంతర్యమేంటి? వేణుగోపాల్‌కు ఎలా అర్థమైందది? జీవిత సత్యాన్ని తెలుపుతూ హృద్యంగా సాగే **సింహప్రసాద్** నవల **నదీ నరుడు**

6వ పేజీలో..

★ ముఖచిత్రం: మాస్టర్ తనయ్
★ చివరి కవరు : కుమారి లావణ్యా
★ పుస్తకాలంకరణ : రాజు యాట

నగరానికి బయలుదేరుతున్నాడు వేణుగోపాలరావు.

అంతలోనే సెల్ రింగయ్యింది..

'నాన్నా! ఎట్టిపరిస్థితుల్లోనూ నువ్విక్కడికి రావద్దు! ఎవరికంటా పడకుండా అక్కడే ఉండిపోతే ఇంకా బెటర్..' వేణుగోపాలరావుకు ఫోన్‌లో కంగారుగా చెప్పాడు కొడుకు.

నవనాడులూ కుంగిపోయాయతనికి.

'ఆ జడ్జి మొండి మనిషి! నెక్స్ట్ హియరింగ్‌కి మిమ్మల్ని కోర్టులో హాజరుపరచాలన్నారు. మన ప్లీడర్ మిమ్మల్ని ఇక్కడికి రానివ్వద్దని, వస్తే అక్కడికక్కడే అరెస్టుచేసి జైలుకు పంపుతారంటున్నారు' ఆందోళనగా చెప్పాడు కొడుకు. వేణుగోపాలరావుకు ఏమీ పాలుపోలేదు.

అసలతనేం చేశాడు? కోటీశ్వరుడైన అతను ఓ మూల కుగ్రామంలో ఎవరింట్లోనో తలదాచుకోవాల్సిన పరిస్థితి ఎందుకొచ్చింది?

ఆద్యంతం ఆసక్తిగా చదివించే **సింహప్రసాద్** నవల **నదీ నరుడు**

చతుర సెప్టెంబరు కానుక!



చల్లని పిల్లతెమ్మెర నా శరీరాన్ని ఆప్యాయంగా నిమిరింది. నేను పొత్తిళ్లలో ఉన్నప్పుడు అమ్మ అందించిన అమృత హస్తపు హాయి మళ్లీ ఒడలంతా వ్యాపించింది.

కారు సిద్ధాంతం బ్రిడ్జిమీద కళ్ళేలు లేని వేయికాళ్ళ కోరికల గుర్రంలా పరుగుతీస్తోంది. తల్లి గోదావరి కన్నుల పండువుగా కన్పించింది

కారు దిగి రైలింగ్ వేపు నడిచాను.

గోదావరి ప్రశాంతంగా ఉంది. వయ్యారాలు పోతూ పారుతోంది. జీవనాదం చేస్తూ జీవనవేదం బోధిస్తూ గంభీరంగా ప్రవహిస్తోంది.

ఓహ్! ఎంత హాయిగా, ప్రశాంతంగా వుందీ! ప్రాణం లేచి రావడమంటే ఇదే కాబోలు!

చిన్నప్పుడు గోదావరిలో కొట్టిన ఈతలూ గట్టుమీద ఆడిన ఆటలూ గుర్తొచ్చాయి. ఏదో తెలీని అవ్యక్తానందం నిలువెల్లా ఆవహించి ఉక్కిరిబిక్కిరి చేసింది!

*గంగే చ యమునే చైవ*
*కృష్ణే గోదావరీ సరస్వతీ*
*నర్మదే సింధు కావేరీ*
*జలేస్మిన్ సన్నిధిం కురు*

అంటూ పూజల్లో వ్రతాల్లో కలశంలోకి జీవనదుల పవిత్రజలం వచ్చి చేరాలని ఆవాహన చేస్తారు. చేరినట్లు భావన చేస్తారు.

అటువంటి ఒక మహత్తర నదీతీరంలో పుట్టి పెరగడం అనేది నిజంగా ఓ గొప్ప వరం! జన్మజన్మల పుణ్యఫలం!

తల్లి నుదుటి ఎర్రటి కుంకుమ బొట్టు లాంటి సూరీడు కొబ్బరి తోటల మాటు నుంచి ఉదయిస్తున్నాడు.

పచ్చని ప్రకృతి మౌనిలా రెండు చేతుల్తో కర్మసాక్షికి స్వాగతం పలుకుతోంది.

ఓహ్! ఎంత మనోహరంగా, మనోజ్ఞంగా వుందీ దృశ్యం. ఇలాంటి అత్యద్భుత సజీవ చిత్రం చూసి ఎన్నేళ్ళయ్యిందో! నలభై ఏళ్ళై ఉండదూ? ఉండే వుంటుంది!

ఏదో గుర్తురాగా జేబులో చెయ్యిపెట్టి వెదికాను. చేతికి నాణేలు తగ్గల్లేదు.

పర్సు తీసి వందనోటు నదిలోకి విసిరాను. అది గాలికి ఎటో కొట్టుకుపోయింది.

నా వ్యాపారాలూ, లావాదేవీలూ, కోర్టు సమస్యలూ, ఆందోళనలూ, కుటుంబస భ్యుల భయాలూ గుర్తొచ్చాయి. వాటిని తొక్కిపట్టి ఉంచాలని చూసేకొద్దీ ఉవ్వెత్తున లేచి వస్తున్నాయి. వెంటాడుతున్నాయి. వేటాడుతున్నాయి.

వద్దొద్దు! అవన్నీ తలచుకోకూడదు. మరచిపోవాలి. కనీసం మరపుగదిలో బంధించి తాళం వేసెయ్యాలి!

చల్లగాలి వీస్తున్నా ఒళ్ళంతా ముచ్చెమటలతో తడిసి ముద్దయ్యింది! మరోపక్క ఊపిరాడనట్టుగా ఉంది!

మెడకి బిగించుకున్న టై వదులు చేసుకోవాలనీ, తొడుక్కున్న కోటు విప్పెయ్యాలనీ అన్పించింది. కానీ ఆ పని చేయలేక పోయాను. నా స్థాయి, పరపతీ, గొప్పా.. మా ఊరి జనానికి తెలియాలి కదా!

కారు కదిలింది.

అక్కడ.. భాగ్యనగరంలో ఏం జరుగుతోందో? ఖాతాదారుల ఆగ్రహం చల్లారిందో? లేదో? కోర్టులో జడ్జి సానుకూలంగా ఉన్నారో? లేదో? సమస్య పరిష్కారానికి పాపం పిల్లలెంతగా శ్రమిస్తున్నారో? మిగతా పోలీసుకేసులూ.. దర్యాప్తులూ ఎలా వున్నయో?

కొంపతీసి అంతా కలిసి నన్ను బలిపశువుని చెయ్యరుకదా?

గుండెల్ని కాల్చేస్తూ చిన్నగా సెగ..

మైగాడ్! మళ్ళీ గుండెనొప్పి వస్తుందో ఏమో? అదే జరిగితే ఆ క్షణమే నా అంతిమ క్షణమవుతుందని డాక్టర్లు తెగేసి చెప్పేరు. అలా జరగనీయకూడదు. నేను బతకాలి! యస్- బతికితీరాలి! ఇంకా..

# శతాబ్దానికి పైగా ఆరని బల్బు!

చతుర సమగతులు

ప్రపంచానికి అమెరికా ఎలాగో అమెరిక న్స్‌కి కాలిఫోర్నియా రాష్ట్రం అలా. ప్రతీ అమెరికన్‌కి కాలిఫోర్నియాని చూడాలనే కల ఉంటుంది. కాలిఫోర్నియా గురించిన కొన్ని సంగతులు.




★ ప్రతి ఎనిమిదిమంది అమెరికన్స్‌లో ఒకరు కాలిఫోర్నియాలో నివసిస్తున్నారు.

★ అమెరికాలో అత్యధిక వాయుకాలుష్యం గల మొదటి ఐదు నగరాలు కాలిఫోర్నియాలోనే ఉన్నాయి.

★ ప్రపంచంలోని ఎనభై శాతం బాదం పప్పు కాలిఫోర్నియాలోనే పండుతుంది.

★ 1966 దాకా కాలిఫోర్నియాలో ఎల్.ఎస్.డి(మాదక ద్రవ్యం) చట్టబద్ధం.

★ 1901 నుంచి ఆర్పని ఎలక్ట్రిక్ బల్బు కాలిఫోర్నియాలోని ఓ ఫైర్ స్టేషన్‌లో ఇంకా వెలుగుతోంది.

★ హాలీవుడ్‌లోని ఓ పెట్రోల్ బంక్‌లో మైక్రోవేవ్ ఓవెన్ అమర్చిన బరీటో వెండింగ్ మెషీన్ ఉంది.

★ చైనాలోని వాయు కాలుష్యం, కాలిఫోర్నియాలో మంచు కురిసేలా చేస్తోంది.

★ కాలిఫోర్నియాలోని క్రాంప్టన్ అనే ఊళ్ళో హత్యల శాతం అత్యధికం. సదరన్ కాలిఫోర్నియాలోని ఈ గతం సోమాలియా లాంటిది.

★ ట్రాఫిక్ జామ్స్‌లో అమెరికా దేశానికంతటికీ కాలిఫోర్నియాలోని లాస్ ఏంజిల్స్‌దే ప్రథమస్థానం.

★ చాలా ఫ్యాషన్లు లాస్‌ఏంజిల్స్ నుంచే అమెరికాలోని ఇతర ప్రాంతాలకి విస్తరిస్తాయి.

★ కాలిఫోర్నియాలో భూకంపాలు అధికం, కానీ వాటివల్ల నష్టాలు మాత్రం స్వల్పం.

★ అమెరికాలోని అతి ఐశ్వర్యవంతమైన రాష్ట్రం కాలిఫోర్నియా. తలసరి ఆదాయం ఈ రాష్ట్రంలోకే అత్యధికం.

కనీసం.. ఇంకో యాభై ఏళ్ళు బతకాలి!

అందుకోసమైనా ఆ గొడవల్నీ ఆ ఝుంఝుూటాలన్నిట్నీ మర్చిపోవాలి. పుట్టిన ప్రదేశపు ఒడిలో సేదదీరాలి. నూతనోత్సాహాన్ని గుండెల్నిండా నింపుకోవాలి!

ఏవిటో! ఇన్నేళ్ల తర్వాత మళ్లీ ఈ ప్రదేశాన్ని వెదుక్కుంటూ రావాల్సి వచ్చింది! 'కుంజర యూథంబు దోమ కుత్తుక జొచ్చెన్' అంటే ఇదేనేమో!

నా ఖర్మ గాకపోతే అజ్ఞాతవాసం చేయాల్సి రావడమేంటీ!

ఎడమచేతి సైగతో ఎందరినో శాసించిన వాణ్ణి! ఇవాళ ఇలా ఒకరకంగా పారిపోయి రావాల్సి వస్తుందని నేను కలలో కూడా ఊహించలేదు.

ఎన్నో కార్లు మారి దొంగలా దాక్కుంటూ వచ్చానంటే ఇది గ్రహచారం గాకపోతే ఇంకేంటి?

అగ్నిపర్వతం మీద బైరాయించినట్టుగా ఉంది నా పరిస్థితి. అది ఏ క్షణంలోనైనా పేలవచ్చు, పేలక పోనూవచ్చు. రెంటికీ సమాన అవకాశాలున్నాయి.

కారు రావులపాలెం దాటి కోనసీమలోకి పరుగెడుతోంది.

అరటిగెలలూ, పాలబిందెలూ సైకిళ్ళకు కట్టుకుని ఎందరో ఎదురొస్తున్నారు. కూలీలు గుంపులు గుంపులుగా కబుర్లు చెప్పుకుంటూ వెళ్తున్నారు. పశువుల కాపర్లు పశువుల్ని తోలుకెళ్తున్నారు.

స్కూలు పిల్లలు యూనిఫాం ధరించి

సైకిళ్ల మీద హుషారుగా వెళ్తున్నారు.

వాళ్ళని చూసేసరికి నా బాల్యం గుర్తొచ్చింది. ఆ వెంటనే అమ్మ, ఆ పిమ్మట పుట్టిన ఊరూ స్మృతిపథంలో మెదిలాయి. గతం తాలూకు జ్ఞాపకాలు గోదావరి వరదలా నన్ను ముంచెత్తాయి!

★ ★ ★

మాది గోదావరిని ఆనుకుని ఉన్న కుగ్రామం. ఎటుచూసినా పచ్చని వరి చేలూ, కొబ్బరి, అరటి, పనస, మామిడితోటలూ. మా తాత రంగయ్య పదెకరాల రైతు. మా మండువా లోగిలి ముత్తాత హయాంలో కట్టిందయినా చెక్కుచెదర లేదు. తాతకి నలుగురు కొడుకులు. చిన్నవాడు మా నాన్న.. ముత్యాలయ్య. చాలా తెలివైనవాడు. ఉత్సాహవంతుడు. వ్యవసాయంలో నూతన పద్ధతులు ప్రవేశపెట్టాడు. అన్నగార్లు వెనక్కి లాగాలని చూసినా వెనుకంజ వెయ్యలేదు.

తాతకి మా నాన్న శక్తిసామర్థ్యాల మీద ఎంతో గురి. అందుచేత ఆయన చిన్న కొడుకుని వెనకేసుకురావడమే కాదు, వెన్నుదన్నుగా కూడా నిలిచారు. కొత్తవంగడాలు సత్ఫలితాలనిచ్చాయి. రాబడి పెరిగింది. గ్రామంలో కుటుంబం పరువూ మర్యాదా పెరిగాయి.

పెద్దిళ్లవారు పెద్దకట్నంతో పిల్లనిస్తామంటూ వచ్చారు. తాత ఒప్పుకోలేదు.

పేదింటి అమ్మాయి సీతమ్మని చిన్నకోడలిగా తెచ్చుకున్నారు.

ఆమె కాపురానికి వచ్చేక ఇంటి ఆర్థికపరిస్థితి రెక్కలు విప్పుకుంది.

కొత్తకోడలొచ్చిన వేళావిశేషమని పొంగిపోయారు తాత. మా అమ్మనెంతో అపురూపంగా చూసేవారు. ఇక నాన్న అయితే అమ్మని మహారాణిలా చూసేవాడు.

అమ్మది తీయని గొంతు. ఎన్నోరకాల కీర్తనలూ స్త్రీల పాటలూ కమ్మగా పాడేది. గ్రామంలో ఏ ఇంట శుభకార్యం జరిగినా ఆమె గళం శ్రావ్యంగా మార్మోగాల్సిందే.

ఏడాది తిరిగేసరికి నన్నెత్తుకుంది. తన తండ్రి పేరు కలిసొచ్చేలా 'వేణుగోపాలరావు' అని నాకు నామకరణం చేశారు తాత.

"పెద్దయ్యాక చాలా గొప్పవాడవుతాడు. మా ఇంటికి పేరు ప్రఖ్యాతులు తెచ్చిపెడతాడు" అని పొంగిపోయేవారు తాత.

క్షణం కూడా నన్ను వదిలి వుండేవారు కాదు. నన్నెత్తుకునో, భుజాలకెక్కించుకునో తన పనులు చేసుకునేవారు.

గోదావరి మీద పడవ ప్రయాణంలా సాగుతున్న మా కుటుంబం హఠాత్తుగా తుఫానులో చిక్కుకుంది. రాత్రివేళ తోటలోంచి వస్తోన్న నాన్నని పాము కరిచింది. నురగలు కక్కుతూ చనిపోయాడు.

ఆ ఘోరం తట్టుకోలేక తాత మంచం పట్టారు. ఆర్నెల్లు తిరక్కుండానే ఆయనా కన్నుమూశారు. అమ్మ పరిస్థితి దారుణంగా మారిపోయింది. గృహలక్ష్మిలా మసలిన ఇంట్లో గృహఖైదీ అయిపోయింది. నన్ను అక్కున చేర్చుకుని ఎన్ని కడవల కన్నీళ్లు కార్చిందో లెక్కలేదు. మమ్మల్ని ఆదరించేవారు, ఆప్యాయంగా పలకించేవారు కరువయ్యారు.

అమ్మకి నేను, నాకు అమ్మ - అంతే!

ఆస్తిపాస్తులు పంచుకుని అన్నదమ్ములు విడిపోయారు.

మా వాటాకి రెండెకరాల పొలమూ మండువా లోగిలిలో చిన్నవాటా వచ్చాయి. మాకొచ్చిన పొలాన్ని పెదనాన్నలే కౌలుకి చేసేవారు. తోచినంత ఇచ్చేవారు.

ఆ సొమ్ము బతకడానికి సరిపోయేది కాదు. పుట్టింటివాళ్లు ముఖం చాటేశారు. మరి గత్యంతరం లేక అత్తింటినే అంటిపెట్టుకుని ఉండిపోయింది అమ్మ.

లేసులు కుట్టేది. నవ్వారు నేసేది. సిగ్గు, అభిమానం చంపుకుని పెద్దిళ్లలో పనిచేసేది. శుభకార్యాల్లో, పండగల్లో వంటలక్కగా మారేది.

రూ.116/- గెలుచుకున్న

# ఉత్తమ సమీక్ష

## క్రూరరాజకీయాలపై అక్షరాస్త్రం!




ఆగస్టు సంచికలో వెలువడిన సలీం నవల 'అరణ్య పర్వం' ఉత్కంఠభరితంగా సాగింది. వణ్యప్రాణుల మీద రీసెర్చిస్కాలర్ రాసిన థీసిస్‌లా ఉందనుకుంటే పొరపాటు పడ్డట్టే. క్రూర మృగాలకంటే క్రూరరాజకీయాలు ఎంతగా సమాజాన్ని అతలాకుతలం చేస్తాయో చెప్పిన నవల ఇది. గుంజన్ అనే పులుల్ని వేటాడే వ్యక్తికి శ్రద్ధ అనే సంస్కారవంతమైన కూతురుండడం, ఆమె తండ్రిని మార్చే ప్రయత్నం చెయ్యడం కథనానికి ప్లస్‌పాయింట్. ఇది రచయిత నేర్పరితనం. ఏ జంతువునైతే ప్రాణాలతో కాపాడదామని గుంజన్ విశ్వప్రయత్నం చేశాడో, అదే మృగం అతన్ని బలితీసుకోవడం బాధాకరం.

పర్ధితెగ వాళ్ల జీవితాలను కళ్లకు కట్టినట్టు చిత్రీకరించారు రచయిత. చెయ్యని నేరానికి పోలీసులు వాళ్లను చిత్రహింసలకు గురిచెయ్యడం హృదయవిదారకం. అందులోనూ కొత్త పెళ్లికొడుకుల్ని టార్గెట్ చేసి అమ్మాయిల పొందు కోరడం రాక్షసత్వమని చెప్పకనే చెప్పారు. పులిని పట్టుకోవడానికి 'ఎరగా మేకను కట్టడంలో నేడు వాగ్దానాల పరంపరలో ఓటరుని బలిచెయ్యడం కన్పిస్తోంది. రాజకీయ లబ్ధికోసం పులిని చంపమని ఫారెస్టు అధికారులకే లంచమిచ్చి, నెమలి మాంసపు విందు ఇవ్వడంలో వంజారీ అవినీతి కన్పిస్తోంది. పులిని చంపేందుకు 'ట్రాప్'లు వెయ్యడం, ఆఫీసులో పని జరిగేందుకు 'లంచం' ఇవ్వడంలాంటిది. 'మనీ మేక్స్ మెనీ థింగ్స్' అనుకుంటున్న బడాబాబులు ఉద్యోగుల్ని లొంగదీసుకోవడం, ఎదిరించి నష్టపోయేకన్నా రాజీకొచ్చేసి లాభం పొందడమే మేలనుకునేలా పరిస్థితుల్ని కల్పించడంతో దేశం అవినీతి పాలవుతోందని రచయిత బాధ వెళ్లగక్కారు. నిస్వార్థపరులు, దేశభక్తులైన ఎందరో ఆఫీసర్లు అలా బలైపోవడం నిత్యం వార్తాపత్రికల్లో చూస్తూనే ఉన్నాం. నాగపూర్ పరిసరాల్ని ఉపయోగించుకునే 'సామాజిక స్పృహ' మెండుగా ఉన్న సలీం అరణ్యరోదన కొందరికైనా వినిపిస్తే సామాజిక ప్రయోజనం కలిగినట్టే. బోల్డన్ని పాత్రల్ని సృష్టించి పాఠకుడ్ని అయోమయం చెయ్యకుండా సులభంగా చదివించేటట్టు రాయడం వల్ల సామాన్య పాఠకుడి కళ్లు కథాంశం మేర చురుగ్గా కదుల్తాయి. మంచి నవల అందించినందుకు రచయితకు, సంపాదక వర్గానికీ ధన్యవాదాలు.



– గుడిమెట్ల గోపాలకృష్ణ

కుటుంబ గౌరవం మంటకలుపుతోందని ఇంట్లోవాళ్లు సూటిపోటి మాటలు విసిరే వారు. వారి కోపాల్నీ, ఈసడింపుల్నీ కన్నీటితో పళ్ళబిగువున భరించేది అమ్మ. నా కోసం అన్ని అవమానాలూ సహించేది.

"నీ కోసం బతుకుతున్నాన్రా కన్నా! నువ్వు గొప్పవాడివి కావాలి! మీ నాన్నా తాతా కన్నకలలు నిజంచెయ్యాలి. నేనెన్ని కష్టాలు పడినా ఫరవాలేదు. నువ్వు బాగుండాలి. అంతా ఈర్ష్యపడేంత గొప్పవాడివి అవ్వాలి!" అనేది నన్ను గుండెలకి హత్తుకుని.

ప్రాణం విసిగినప్పుడు మాత్రం "నువ్వు నా కాళ్ళకి బంధమయ్యావురా! లేకపోతే గోదాట్లో దూకేదాన్ని" అని విలపించేది. నేను మరింత న్యూనతగా ఫీలయ్యేవాడ్ని. అమ్మని బాధపెట్టే పనులు చేసేవాడ్ని కాదు. చాలాబుద్ధిగా ఉండేవాణ్ణి. అది కావాలి, ఇది కావాలి అంటూ అమ్మనెప్పుడూ ఇబ్బంది పెట్టేవాడ్ని కాదు. గొంతెమ్మ కోర్కెలు కోరేవాడ్ని కాదు. వాళ్ళూ వీళ్ళూ ఇచ్చిన పాతబట్టలు ఇష్టంగా తొడుక్కునేవాడ్ని. మూర్తి పుస్తకాలిచ్చేవాడు. రాకుమారి వాళ్ళమ్మ స్కూలు ఫీజుకి డబ్బు సర్దేది.

మూడుమైళ్లు నడిచెళ్ళి హైస్కూల్లో శ్రద్ధగా చదువుకునేవాడ్ని.

"ఆ వేణుని చూసి బుద్ధితెచ్చుకోండ్రా" అంటూ తమ పిల్లల్ని మందలించేవారు ఊరివాళ్లంతా.

"పొట్టివాడికి పుట్టెడు బుద్ధులు" అనేది రాకుమారి వాళ్ళమ్మ.

మా చుట్టుపక్కల ఇళ్ళల్లో ఉత్తరాలు రాసిపెట్టడానికీ, వ్రతకథలు చదవడానికీ నన్నే పిలిచేవారు.

మూతబడ్డ మా ఊరి లైబ్రరీలోని పుస్తకాలు చదవడం, చల్లయ్య తాతగారి రేడియో వినడం, మూర్తితో కలిసి ఆటలాట్టం, గోదావరిలో ఈత కొట్టడం, రాకుమారికి కథలు చెప్పడం - సెలవులొస్తే చాలు ఇదే నా దినచర్య.

అమ్మ కష్టాలూ, మా దారిద్ర్యం, గొప్పింటివారి ఈసడింపులూ చూసి ఎప్పటికైనా నేనూ గొప్పవాడ్ని కావాలనుకునేవాడ్ని. బాగా డబ్బు సంపాదించి వీళ్ళందరి ముందూ ఫోజుకొట్టాలని, వీరిచేత సలాములు చేయించుకోవాలనీ కలలు కనేవాడ్ని.

మధ్యలో రాకుమారి స్నేహం పిల్లతెమ్మరలాంటి ఘటనే. ఆమె కోసం జానపద సినిమాలు చూస్తూ కథలు చెప్పేవాణ్ణి. నేనూ అలాంటి హీరోని కావాలని గాఢంగా ఆశించేవాడ్ని. ఆ కథల్లోలా రాజ్యమూ, రాకుమారీ దక్కాలంటే ఎన్నోసాహసాలు చేయాలి, ఎన్నోశక్తులు సాధించాలనీ తపన పడేవాడ్ని!

అనుకోకుండా ఒకరోజున నా గుండెల్లో కొత్తవిత్తనం నాటుకుంది.

అవాళేం జరిగిందంటే..? నేనూ మూర్తీ, మూర్తీ వాళ్ళింట్లో చదువుకుంటున్నాం.

స్నేహితుడు అన్న పదానికి సరైన నిర్వచనం మూర్తి.

వాళ్ళిల్లు నాకు చాలా ఇష్టం. వాళ్లది ఎత్తరుగుల పెద్దయిల్లు. హాలు నాలుగు గోడల మీద ఒకే సైజుగల దేవుళ్ళ అద్దాల పటాలు వేలాడుతూండేవి. ఒక్కో ఫొటోలో ఒక్కో దేవుడు. ఒక్కో కథ.

మూర్తీవాళ్ళ నాన్నని ఇంట్లో చాలా తక్కువసార్లు చూశాను. ఆయనెప్పుడూ పొలాల్లోనో, పశువులశాలలోనో ఉంటూంటారు. 'నిత్య కృషీవలుడు' అన్నమాటకి అర్థం ఆయనే అని చెప్పాలి.

వాళ్ళమ్మ అన్నపూర్ణమ్మ అక్షరాలా కాశీ అన్నపూర్ణే. అంత ఆప్యాయంగా చూసేది. తండ్రిలేని పిల్లాడినని తినుబండారాలు దాచి దాచి నాకు పెట్టేది.

రాకుమారీ మరికొందరు అమ్మాయిలూ ఇత్తడి పళ్లాల్లో 'సారె' పట్టుకొచ్చారు.

సారె పెట్టించుకుంటూ "ఎలా చదువు

తున్నావే రాకుమారీ..?" అనడిగింది మూర్తీవాళ్ళమ్మ.

"బాగా చదువుకుంటున్నానత్తా! కావాలిస్తే వేణుని అడుగు..!"

నా వంక చూసింది పెద్దమ్మ. "చాలా బాగా చదువుతోంది పెద్దమ్మా!" గబుక్కున అబద్ధమాడేశాను.

చక్రాల్లాంటి కళ్ళతో పరమాశ్చర్యంగా చూసింది రాకుమారి. నిజానికి తనకి అత్తెసరు మార్కులే వస్తున్నాయి.

"వేణు చెప్పేడంటే నిజమే అయ్యుంటుంది! బాగా చదువుకోవే పిల్లా! మీ నాన్న ఎవర్ని తెచ్చి నీకు కట్టబెట్టినా అతగాడు ఇంద్రుడో, చంద్రుడో అవుతాడు. అలాగని చదువు మానొద్దు! మా కాలంలో చాకలి పద్దు రాస్తే చాలనేవారు. ఇప్పుడలా కుదర్దు. పట్నాల్లోని ఆడపిల్లలు ఎంచక్కా చదువుకుంటున్నారు, ఉజ్జోగాలూ చేస్తున్నారు తెల్సిందా?"

"ఓ!" అంటూ తలాడించి ఓరగా నా వంక చూసి వెళ్ళిపోయింది రాకుమారి. నా గుండె ఝల్లుమంది.

అపుడు రాకుమారికీ నేనంటే ఇష్టం - అన్పించింది. నా ఒళ్ళంతా ఆనందంతో నిండిపోయింది.

ఆమెని చేసుకోబోయే ఇంద్రుడ్ని నేనే ఎందుకు కాకూడదు?

రాకుమారీ వాళ్ళది బాగా కలిగిన కుటుంబం. బోలెడు పొలాలు, తోటలు, పెద్దమేడ ఉన్నాయి. ఆమెని పెళ్లాడితే నేను రాకుమారుడ్ని అయిపోవడం ఖాయం!

అప్పటికి నేను తొమ్మిదో? పదో? చదువుతున్నాను. కాలేజీలో చదివే స్థోమత ఎలాగూ లేదు గనుక ఎలాగోలా రాకుమారిని ఆకట్టుకుంటే..?!

అప్పుడు ఇల్లరికం వెళ్తాను గనుక, వారి ఆస్తి అంతా నాదే అవుతుంది. మా కష్టాలన్నీ గట్టెక్కుతాయి. నేనూ గర్వంతో మీసం మెలెయ్యొచ్చు!

ఆ మర్నాటి నుంచే కాదు.. కాదు కాదు.. అవాళ్టి నుంచే నా దినచర్య పూర్తిగా మారిపోయింది.

ఆమెని ఆకట్టుకోడానికి, ఆమె అభిమానం సంపాదించడానికి ఎన్నెన్నో చేసేవాడ్ని. ఎంతో తాపత్రయపడేవాడ్ని. ఆమె సానుభూతి కోసం లేని కష్టాలు ఏకరువు పెట్టిన సందర్భాలూ లేకపోలేదు.

ఆమెని సంతోషపెట్టడానికి పీకల్లోతు చెరువులోకి దిగి తామరపూలూ.. కాయలూ కోసుకొచ్చి భక్తుడు దేవతకు సమర్పించినట్టు ఇచ్చేవాడ్ని.

ఆమె కోసం ఎవరికీ సాధ్యపడని సాహసాలు చేస్తున్న రాకుమారుడ్ని నేనే అన్నట్టు భ్రమ కల్పించేవాడ్ని.

రాకుమారి పెద్దమనిషయ్యేసరికి నా రాకపోకల మీద ఆంక్షలు మొదలయ్యాయి.

ఆమె కూడా సిగ్గుపడుతూ దూరదూరంగా ఉండేది. అయినా వాళ్ళింట్లో పనిచేస్తోన్న మా అమ్మకోసం వెళ్ళినట్టు వెళ్ళేవాడ్ని. గ్రంథాలయంలోని మంచి పుస్తకం అంటూ పట్టుకెళ్ళేవాడ్ని. 'ఏదో లెక్క తెలీలేదుట కదా!' అని కల్పించుకునే వాడ్ని.

వాళ్ళమ్మ ఎప్పట్లానే అభిమానంగా చూసేది. ఆమెని మంచి చేసుకోడానికి మరింత బుద్ధిమంతుడిగా నటించేవాడ్ని. రాకుమారి మాత్రం అల్లరిగా నవ్వేది.

వాళ్ళ నాన్న చల్లయ్యతాత మాత్రం

### కొత్తగాలి...

**కలాం! మీ ప్రతిభకు**
**లోకమంతా సలాం!**
**మీ స్ఫూర్తికి**
**సదా మేం దాసులం!**

– శ్రేష్టి శేషగిరి,
సికింద్రాబాద్

ఏదో ఒకటి అనకుండా వదిలేవాడు కాదు.

"వేణు చాలా బుద్ధిమంతుడు. అలాంటి కుర్రాడు నూటికీ కోటికీ ఒకరుంటారేమో!" అనేది రాకుమారీ వాళ్లమ్మ.

వాటికి నేను ఇంకో అర్థం కల్పించుకుని కలలు కనేవాడ్ని.

నేనే కాదు రాకుమారి కూడా నా చుట్టూతా కలలు అల్లుకునేది. నాలో తన రాకుమారుడ్ని చూసుకునేది. ఇవాళ్టి భాషలో చెప్పాలంటే నన్ను ప్రేమించింది!

అందుకు బలమైన రుజువూ ఉంది.

ఒకరోజున నేను, మూర్తి, రంగడు, వీరా స్వామి ఈత కొట్టడానికి గోదావరికెళ్ళాం.

కాస్సేపయ్యాక ఎవరెక్కువ దూరం ఈదగలరన్న చర్చ వచ్చింది. అది కాస్తా ముదిరి పోటీ పెట్టుకున్నాం.

అందరికన్నా మిన్నగా ఈత కొడుతూ లోలోపలికెళ్ళేను. అప్పుడాగి వెనక్కి చూశాను. ఒడ్డు నుంచి చాలా దూరం వచ్చేశానని అర్థమైంది. దగ్గర్లో నా స్నేహితులెవరూ కన్పించలేదు.

గుండెలు గుభిల్లుమన్నాయి, కాళ్లు చల్లబడ్డాయి. నేల అందటం లేదు. భయం కమ్మేసింది. నిస్సత్తువ ఆవరించింది. వెను దిరిగానో? లేదో? సుడిగుండం బలంగా అమాంతం లాగేసింది.

గిరగిరా తిరిగాను.. అరిచాను.. పెనుగులాడాను.. కాళ్లు తేలిపోయాయి. స్పృహ తప్పుతున్నట్టుగా అన్పించింది. చచ్చిపోయాననే అనుకున్నాను.

కానీ అదృష్టం చల్లగా చూసింది. కళ్ళు తెరిచేసరికి ఒడ్డు మీదున్నాను. ఒకతను నన్ను బోర్లా పడుకోబెట్టి నా వీపు నొక్కుతూ నీళ్లు కక్కిస్తున్నాడు.

మూర్తీవాళ్లు వెళ్ళి చెప్పేరు కాబోలు, అమ్మ గుండెలు బాదుకుంటూ వచ్చింది.

గండం గడిచినందుకు వెయ్యి దేవుళ్ళతో బాటు నన్ను రక్షించిన పడవవాడికీ దణ్ణాలు పెట్టింది.

ఈ సంగతి రాకుమారికి తెలిసి, అన్నం తింటోన్నదల్లా లేచి పరుగు పరుగున గోదావరి ఒడ్డుకి వచ్చేసింది. నన్ను పట్టుకుని బావురుమంది.

ఆమె ప్రవర్తనకి అంతా నోళ్లు వెళ్ళబెట్టారు. ఆశ్చర్యంగా చూశారు.

చెప్పొద్దూ - రాకుమారి అంటే నాకూ చెప్పలేనంత ఇష్టమే! ప్రేమే!

ఒకసారి ఏమయ్యిందంటే మా ఊరి మోతుబరి రాయుడుగారు పెద్దాపురం నుంచి భోగందాన్ని తీసుకొచ్చి తోట మేడలో ఉంచారు.

ఆమె పేరు కాంచనమాల. ఆమెది అసమాన సౌందర్యమని ఊళ్ళో అంతా చెవులు కొరుక్కోసాగారు.

"తోట మేడలో ఉన్నామెని చూసి రా!" రహస్యంగా చెప్పింది రాకుమారి.

"ఎందుకు?"

"నాకన్నా అందంగా వుందేమోనని..! నేను రాకుమారినిగా!"

మూర్తిని తోడు రమ్మంటే రానన్నాడు. నన్నూ వెళ్లొద్దన్నాడు.

"వాళ్ల దగ్గరికి వెళ్ళకూడదంట! వాళ్ళ కేవో మంత్రాలొచ్చంట! ఎవర్నయినా చూసి ఆ మంత్రాలు పలికితే వాళ్ళామె చుట్టూ కుక్కలా తిరుగుతారంట! మాయల ఫకీరు బాలనాగమ్మని కుక్కలా మార్చి తీసుకుపోలేదూ అలాగన్నమాట!"

## కొత్తగాలి...



**మహాత్మాగాంధీ నోట్ల మీద**
**అబ్దుల్ కలాం గుండెలోన**
**ఎప్పటికీ నిలిచే ఉంటారు!**

– నల్లపాటి సురేంద్ర,
విశాఖపట్నం

నేను వాడి మాటలు పట్టించుకోకుండా తిన్నగా తోటలోకెళ్లాను.

మేడ కిటికీలో తళుక్కుమని మెరిసిందో అప్సరస.

ఎంత అందంగా వుందో చెప్పలేను..! అంత సౌందర్యం నేనెప్పుడూ చూడలేదేమో? కళ్ళు తిప్పుకోలేకపోయాను.

పచ్చని రంగు, పరువాల వయస్సు, సిల్కు చీర, పొడవాటి జుట్టు, మెడలోనూ నడుముకీ నగలు, చూపుల్లో వగలు, నడకలో వయ్యారం, పెదాల మీద కవ్వించే నవ్వు.. మన్మథుడైనా సరే పాదాక్రాంతం కావాల్సిందే!

'ఇలాటామె నా భార్య అయితేనా!' ఒక క్షణమే అయినా అనుకోకుండా ఉండలేకపోయాను.

రాయుడిగారి అదృష్టానికి అవాళెంత కుళ్లిపోయానో చెప్పలేను.

"చూశావా? ఎలా ఉంది? " ఎదురొచ్చి మరీ అడిగింది రాకుమారి.

"బాగానే ఉంటుంది గానీ.. నీ అంత కాదులే..!"

ఆమె మోము పున్నమి చంద్రుడయ్యింది. గబుక్కున నా చేతి మీద ముద్దు పెట్టుకుని తుర్రుమని పారిపోయింది.

స్నేహితులకి మాత్రం ఆవిడ కథల్లోని అప్సరస. రెక్కల్లేని దేవత!" అని చెప్పాను. అందర్నీ తోటమేడకి తీసుకెళ్ళి కాంచనమాలని చూపించాను.

ఆ మర్నాటి నుంచి ఆ తోట పక్కనుంచే స్కూలుకి వెళ్ళేవాళ్ళం. వచ్చే వాళ్ళం. ఆమె కన్పిస్తుందేమోనని ఆశగా చూసేవాళ్లం.

ఎప్పుడు కన్పించినా మెరుపుతీగలా మెరిసిపోతూ ఉండేది. సినిమాతారలు ఆమె ముందు దిగదుడుపు అనుకునేవాళ్ళం.

ఆమె కోసం రాయుడుగారు ప్రత్యేకంగా గుర్రపు బండి చేయించారు. రంగురంగుల బండి. ముందూ వెనుకా తెరలతో భలే సరదాగా ఉండేది. గుర్రం తల మీద రంగుల కుచ్చులుండేవి.

# 'చమత్కారం'

## పెద్దనగారే పెద్ద!



పెద్దన వలె కృతి చెప్పిన
పెద్దనవలె, అల్పకవిని
పెద్దనవలెనా?
ఎద్దనవలె, మొద్దనవలె,
గద్దనవలె, కుందవరపు
కవిచౌడప్పా!

బూతుకవిగా సుప్రసిద్ధుడు కుందవరపు కవిచౌడప్ప. ప్రబంధకవి అలసాని పెద్దనంటే ఆయనకు ఎనలేని అభిమానం! గౌరవం! పెద్దనలా కవిత్వం చెప్పిన వాడినే పెద్ద (గొప్ప) అనాలి తప్ప, చిల్లరమల్లర కవిత్వం చెప్పేవాడిని పెద్దంటామా? అలాంటి వాడిని ఎద్దు అనాలి కాదంటే మొద్దనాలి.. కాదను కుంటే గద్దనాలి అంటూ విరుచుకుపడ్డాడాయన.

'పెద్దనవలె' పదాన్ని పెద్దనలా, పెద్ద+అనవలె అని రెండర్థాలలో చమత్కరించడంలో చౌడప్ప గడుసుదనం మనం చూడొచ్చు.

సేకరణ: చంద్రప్రతాప్

బండి నడిపే సాయిబు- బండి చక్రపు ఆకులకి కవుసీకర్ర ఆన్చి టకటకా శబ్దం చేస్తూ గుర్రాన్ని పరుగెత్తించేవాడు.

రాయుడుగారు ఆమె మైకంలో పడ్డారనీ, అన్నీ ఆమెకి దోచిపెడుతూ భార్యాబిడ్డల్ని నిర్లక్ష్యం చేస్తున్నారనీ ఆడవాళ్ళు ఆడిపోసుకునేవాళ్లు. మెటికలు విరిచేవాళ్లు. కొందరు ఆడంగులు ఆమె బండి కంటబడితే చాలు తుపుక్కున ఊసేవాళ్లు. అంతేకాదు శాపనార్థాలు కూడా పెట్టేవాళ్లు!

'ఆవిడ మంచిదానిలాగే ఉందిగా! అనవసరంగా ఆమెనెందుకు తిడుతున్నారో పాపం!' అనుకునేవాళ్లం.

ఆ వయస్సులోనే ఆమెలో నాకేదో ఆకర్షణ కన్పించింది. అందమంటే ఆమెదే అనుకునేవాడ్ని. పెళ్లి చేసుకుంటే అలాంటి అమ్మాయినే చేసుకోవాలనుకునేవాడ్ని.

రాయుడు, కాంచనమాల - ఇద్దరూ నామీద బలమైన ముద్రవేశారు.

ఆమెలాంటి రాకుమారిని పెళ్లాడి వాళ్ల ఆస్తికి వారసుణ్ణయి రాయుడిలా పిల్లజమిందారులాగ వెలిగిపోవాలని నిశ్చయించుకున్నాను. రాకుమారి తండ్రి చూపుల్ని, ఈసడింపుల్ని లెక్కచెయ్యకుండా వాళ్ళింటి చుట్టూ తిరగటం ఎక్కువ చేశాను.

అప్పట్లో వాళ్లింట్లోనే రేడియో ఉండేది. వార్తలు, కార్మికుల కార్యక్రమం, రేడియోలో వచ్చే సినిమాలు - వినే నెపం మీద వాళ్ళింటికెళ్ళేవాడ్ని. రాకుమారిని మెచ్చుకుంటూనే నా గురించీ, నా చదువు గురించీ ఎన్నో చెప్పేవాడ్ని. నేనెంతో గొప్పోడ్ని అవుతానని కోతలు కోసేవాడ్ని.

మిగతా వాటిల్లో వెనకబడ్డా చదువులో మాత్రం చాలా ముందుండేవాణ్ణి. ఎప్పుడూ క్లాసు ఫస్ట్ వచ్చేవాణ్ణి.

చెప్పొద్దూ- ఆ చదువే నా రాతనీ గీతనీ సమూలంగా మార్చేసింది.!

ఎస్సెస్సెల్సీలో నాకు నాలుగువందల నలభై మార్కులొచ్చాయి. జిల్లాలో నాది ప్రథమస్థానం అన్నారు. హైస్కూలువాళ్లు నూట పదహార్లు బహూకరించారు.

ఆ డబ్బుతో కాలేజీలో చేరతానని పట్టుబట్టాను. అమ్మ ఒప్పుకోలేదు. తన ఆరోగ్యం బాగోలేదని ఏదో ఉద్యోగం చూసుకోమని గొడవ పెట్టింది. ఒకరోజు కోపించి అన్నం మానేశాను. అమ్మ కూడా మానేసింది తప్ప అంగీకరించలేదు.

అప్పుడు మూర్తి వచ్చి అమ్మకి నచ్చచెప్పేడు. పద్దెనిమిదేళ్ళు నిండితేనే కానీ ఉద్యోగం రాదన్నాడు. రోజూ ఇద్దరం కలిసి నర్సాపురం వెళ్లి చదువుకొస్తామన్నాడు. కాలేజీ ఫీజులు తక్కువన్నాడు. ఒక తెలివైనవాడి బంగారు భవిష్యత్తుకు అడ్డు పడొద్దన్నాడు.

"నాకూ చదివించాలనే ఉంది. నా కొడుకు కలెక్టరైతే కళ్ళారా చూసుకుని మురిసిపోవాలనుందయ్యా! కానీ ఏంచెయ్యను చెప్పు? రెండు వేళ్ళూ నోట్లోకెళ్లడానికే అవస్థ పడుతున్నవాళ్ళం. ఇక కాలేజీకెక్కడ ఎగరగలం?" అంది అమ్మ చేతులు తిప్పుతూ.

"రోజూ ఇక్కడున్న పాలకేన్ తీసుకెళ్లి నర్సాపురంలో పాలు అమ్ముతాను. ఆ డబ్బుతో చదువుకుంటాను" అని మంకుపట్టు పట్టాను.

అయినా అమ్మ మెత్తబడలేదు. గ్రామ పెద్ద శ్రీరాములుగారు మా ఇంటికొచ్చారు.

**కొత్తగాలి...**

**ఎందరికో ఆయన స్ఫూర్తి**
**నిరాడంబరతకు మూర్తి**
**భారత్ వృద్ధిపై ఎంతో ఆర్తి**
**అబ్దుల్ కలాం మీకు సలాం!**

– తటవర్తి రామకృష్ణ,
తాళ్లగడ్డ, హైదరాబాద్

"మొత్తం జిల్లాకే ఫస్టొచ్చాడు. వేణు సరస్వతీ పుత్రుడు! వాడికి మోకాలు అడ్డుపెట్టొద్దు! నీ పరిస్థితి నాకు తెలీంది కాదు. ఖర్చు గురించి దిగులు పడొద్దు. నేనూ మరో నలుగురూ తలో చెయ్యీ వేస్తాంలే. నా మాట విని కాలేజీలో చేర్పించు" అని నచ్చ చెప్పారు.

ఆయన మాట తీసెయ్యలేక అమ్మ ఒప్పుకుంది. మర్నాడే నర్సాపురంలోని శ్రీయర్రమిల్లి నారాయణమూర్తి కాలేజీలో చేరాను.

"ఏంట్రోయ్! కాలేజీలో చేరేవటగా? " అని కొందరు వెక్కిరించారు.

మా పెదనాన్నల పిల్లలు - ముఖ్యంగా రంగడూవాళ్లు మరీ ఎకసెక్కేలాడారు.

"కలెక్టరో తాశిల్దారో అవుతాడ్రా" అని ఏడ్పించారు.

"నర గోసకి నల్లరాళ్ళు బద్దలవుతాయంటార్రా" అని కళ్లనీళ్లు పెట్టుకునేది అమ్మ.

మూర్తివాళ్ల అమ్మ మాత్రం నాకు వత్తాసుగా నిలబడింది.

"ఎవరి నుదుట ఏం రాసి పెట్టుందో? ఎవరికి తెలుసు? వేణు గొప్పవాడవుతాడేమో? సర్కారోడి సొమ్ము తినే యోగం ఉందేమో? ఎవరు చూడొచ్చారు? " అని ధైర్యం చెప్పేది.

రోజూ అయిదు గంటలకి లేచి ఇల్లిల్లూ తిరిగి పాలు సేకరించేవాడ్ని. చద్దన్నం తిని బయల్దేరేవాడ్ని. సైకిలుకి పాలకేన్లు తగిలించుకుని సఖినేటిపల్లి వెళ్లి పడవ మీద గోదావరి దాటేవాడ్ని. నర్సాపురంలో గడప గడప తిరిగి పాలు పోసేవాడ్ని.

కొందరు కాలేజీ మిత్రులు హీనంగా చూసేవాళ్లు. నేనవేం పట్టించుకునేవాడ్ని కాదు. నాకు నా లక్ష్యం ముఖ్యం. ఎలాగైనా గొప్పవాణ్ని కావాలంతే!

అందుకని ఏ కాస్త సమయం చిక్కినా పుస్తకం చేతిలోకి తీసుకునేవాడ్ని. పడవ కోసం నిరీక్షించేప్పుడు, పడవ మీద ప్రయాణం చేసేప్పుడు కూడా చదువుకుంటూనే ఉండేవాణ్ణి.

కాలేజీలో అంతా ఆడుకునే సమయంలో నేను మర్రిచెట్టు కింద కూర్చుని చదువుకునేవాడ్ని. లేదా కాలేజీ లైబ్రరీలో రిఫరెన్సు పుస్తకాలు తిరగేసేవాణ్ణి.

అనుకోకుండా నా జీవితం కొత్తమలుపు తిరిగింది. నా బతుకు గమ్యాన్ని పూర్తిగా మార్చేసింది.

ఆ మలుపుకి.. ఆ మార్పుకీ కర్త, కర్మ, క్రియ అన్నీ తాశిల్దారు బుచ్చయ్యగారే! అప్పటికే ఆయన నర్సాపురం తాశిల్దారుగా ఉండేవారు. ఎస్సెస్సెల్సీలో నాకు అత్యధిక మార్కులు రావడంతో ఆయన దృష్టిలో పడ్డాను.

ఆయన చాలా గొప్పమనిషి. చూపుల్తో మనిషి గుండె లోతుల్ని కొలిచెయ్యగల సమర్థుడు. ఆయన గద్దచూపుల్లో పడటం నిజంగా నా అదృష్టం.

నాకు తెలీకుండానే నా గురించాయన చాలా చాలా ఎంక్వైరీ చేశారు. ప్రిన్సిపాల్ రూమ్‌లోకి నన్ను పిలిచి నా చదువు వివరాలు, కుటుంబ స్థితిగతులూ అడిగి తెలుసుకున్నారు.

ఒక శుభముహూర్తాన మా బంధువొకాయన మా ఇంటికి ఊడిపడ్డాడు.

"నేను గుర్తులేనూ..? " అంటూ బంధుత్వ వివరాలు చెప్పగా "అలాగా!" అంటూ తలాడించింది అమ్మ.

"నిన్నంతగా ఎరగను గానీ మీ నాన్నని పేరెట్టి పిలిచేంత చనువుండేదనుకో! ఇహ అసలు సంగతేవిటంటే నీకొడుకు గొప్ప జాతకుడు. అందుకే తాశిల్దారు బుచ్చయ్యగారి దృష్టిలో పడ్డాడు. నీ కొడుకు చదువు సంధ్యల గురించి, మీ మంచిచెడ్డల గురించి అన్నీ తెలుసుకున్నాడు. మీ సంబంధం ఆయనకి బాగా నచ్చింది. అందుకే నన్ను పంపించారు. నీ కొడుకుని తన అల్లుడిగా చేసుకోవాలని ఆయన

కోరిక. మనవాడిది మహారాజయోగమని మొఖం చూస్తూనే అనుకున్నాన్లే!"

నా గుండె ఝల్లుమంది. అది కలో? నిజమో? అర్థం కాలేదు. అతడి మాటలు సత్యమై నేన్నిజంగా తాశిల్దారుగారి అల్లుడ్న యితే - హమ్మో ఇంకేమైనా ఉందా? చుక్కల్ని చూడనూ? !

"వాడి చదువింకా పూర్తికాకుండా పెళ్ళి మాటలేమిటన్నయ్యగారూ!"

"ముద్దొచ్చినప్పుడే చంకెక్కాలమ్మా! ఇహ చదువుల బాదరాబందీ ఏవీ నీకుండవ మ్మాయ్! అన్నీ తాశిల్దారుగారే చూసుకుం టారు. ఆయనకి ఒక్కగానొక్క కూతురు. ఇక అల్లుడైనా కొడుకైనా మనవాడే" అని నా వంక తిరిగి భుజం తడుతూ అన్నారు.. "నీకెక్కడో సుడి ఉందోయ్! తాశిల్దారుగారి అల్లుడయ్యాక మమ్మల్ని మర్చిపోకు సుమా!" అన్నాడు.

"ఇల్లరికమా అన్నయ్యగారు? " చురుగ్గా చూస్తూ అడిగింది అమ్మ. ఆమె కళ్లలో ఏవో భయాలు రెపరెపలాడుతున్నాయి.

"ఒక్కతే కూతురు. వెనక రెండు చేతులా సంపాదించిన ఆస్తి. నువ్వు ఏ పేరైనా పెట్టుకో! అదంతా అనుభవించేది మనవాడే"

"నాకున్నదీ వీడొక్కడే కదా అన్నయ్య గారూ! వీడ్ని ఇల్లరికం పంపి.." అమ్మ గొంతునిండా బతుకు భయం!

"నీకలాంటి దిగులక్కర్లేదమ్మా! ఆ లంకంత కొంపలో వాడితోబాటు నువ్వూ ఉండొచ్చు. నువ్వు చూడలేదు గనుక ఏదో అనుకుంటున్నావు గానీ తాశిల్దారుగారు మా దొడ్డమనిషిలే! ఇక నీ కొడుకు మేలిమి బంగారం! నిన్ను పువ్వుల్లో పెట్టి పూజించడూ? "

అమ్మ తాత్సారం నాకు నచ్చలేదు. విప రీతమైన కోపమూ వచ్చింది. వెదు క్కుంటూ వచ్చిన సువర్ణావకాశాన్ని అమ్మ మూర్ఖత్వంతో కాలదన్నేస్తుందేమోనని భయపడ్డాను.

మా పెదనాన్న, చిన్నాన్నలు వచ్చి మాట్లాడారు.

ఎట్టకేలకు అయిష్టంగానే అంగీకరిం చింది అమ్మ.

ఆ మర్నాడు నేనూ, పెదనాన్నా నర్సా పురం వెళ్లాం.

నౌకర్లు చాలా హడావిడి చేశారు. తాశి ల్దారుగారూ గౌరవంగానే చూశారు. ఆయ న భార్య మాత్రం అప్రసన్నంగా ఉంది.

నా కాబోయే భార్య లక్ష్మీరాణిని కూడా చూపించారు. కాస్త ఒళ్లు ఎక్కువగా వున్నా బాగానే వుంది. అటు రాకుమారితోగానీ ఇటు కాంచనమాలతోగానీ పోల్చలేం. వారి ముందు దిష్టిబొమ్మలా ఉంటుంది. కానీ అవన్నీ పట్టించుకునే స్థితిలో అప్పుడు నేను లేను!

ఆమె పేరడిగారు పెదనాన్న. ఠకీమని పేరు చెప్పి, తలెగరేసి విసురుగా లోపలికి వెళ్లిపోయిందామె.

"ఈ క్షణం నుంచీ ఈ అబ్బాయి బాధ్యత నాది. ఇంజినీరింగు చదివిస్తాను. నా ఖర్చుతో పెళ్లిచేస్తాను. నన్ను మించిన వాడ్ని చేస్తాను" అన్నారు తాశిల్దారుగారు.

"వీడ్ని మీకప్పజెబుతున్నాం. పాల ముంచుతారో.. నీట ముంచుతారో.. మీ ఇష్టం. ఆపైన వీడి అదృష్టం!"

"పాలూ నీళ్ళలో.. కాదు డబ్బులో, ఐశ్వ ర్యపు మడుగులో ముంచెత్తనూ!" అని నవ్వేరాయన.

మేమూ శ్రుతి కలిపాం.

"రేపట్నించీ పాల వ్యాపారాలవీ కట్టిపె ట్టెయ్! ఇహ నిన్ను అంతా తాశిల్దారుగారి అల్లుడిగా చూస్తారు. నా గౌరవానికి తగ్గ ట్టుగా మసలుకోవాలి. నీక్కావల్సిన ఏర్పా ట్లన్నీ నేను చేస్తాన్లే! నీ పనల్లా బాగా చదు వుకోవడం, ఫస్టుక్లాసులో పాసవడం.. అంతే!"

తలాడించాను.

# టీ కలపడం మగవారి బాధ్యత!




సౌతిండియాలో కాఫీ, నార్త్ ఇండియాలో టీ అధికంగా తాగుతారు. టీకి సంబంధించిన కొన్ని విషయాలు..

★ ప్రపంచంలోనే అత్యంత ఖరీదైన టీ వెల కిలో పది లక్షల ఇరవైఐదు వేల డాలర్లు! చైనాలోనే క్వాంగ్ హో పర్వతాల్లో పండే ఈ తేయాకు పేరు 'డా హాంగ్ పావో'.



★ పద్దెనిమిదో శతాబ్దంలో యూరప్‌లో టీ తాగేప్పుడు మీసాలకు అంటని ప్రత్యేక కప్పులు ఉండేవి! ఈ బేలో ఇవి దొరుకుతాయి.

★ టీ తాగితే గుండె జబ్బుల నుంచి ఇరవైనాలుగు శాతం ఉపశమనం కలుగుతుంది.

★ నిద్ర పోవడానికి ముందు గ్రీన్ టీ తాగితే, నిద్రలో ఎక్కువ కేలరీలు ఖర్చవుతాయి.

★ ప్రపంచంలో టీ అధికంగా తాగే దేశం చైనా, కానీ టర్కీ, ఐర్లండ్, యు. కె. ప్రజలు టీ ప్రియులు.

★ నీరు తర్వాత ప్రపంచంలో ప్రజలు అధికంగా తాగేది తేనీరే.

★ ప్రపంచంలో నిత్యం సగటున 300 కోట్ల కప్పుల టీని తాగుతున్నారు.

★ వాడని టీ బేగ్‌ని వాసన వేసే బూట్లలో ఉంచితే, ఆ చెడువాసన అది పీల్చుకుంటుంది.

★ టీ డికాషన్‌తో జుట్టుని తడుపుకుంటే, జుట్టు మెరుస్తుంది.

★ మొరాకోలో టీ కలపడం, కప్పులో పోయడం మగవాళ్ళ బాధ్యత.

★ టీని చైనా చక్రవర్తి షెన్‌నుంగ్ క్రీస్తుపూర్వం 2737లో కనుగొన్నాడు.

★ ఐస్డ్ టీని తొలిసారిగా 1904లో సెయింట్ లూయిస్ వరల్డ్ ఫెయిర్‌లో అతి వేడిరోజు సర్వ్ చేశారు. అప్పటినుంచి అది పాపులర్ అయింది.

★ టీలో ఆరు రకాలున్నాయి. వైట్, ఎల్లో, గ్రీన్, బ్లాక్, ఊలాంగ్, పోస్ట్-పెర్మెంటెడ్.

★ 'తొందరలో ఉన్నవాడు టీని ఫోర్క్‌తో తాగుతాడు' అన్నది చైనీస్ సామెత.

---

"నువ్వు నేను గీచిన గీత మీద నడిస్తే చాలు, నిన్ను ఊహించలేనంత గొప్పవాడ్ని చేస్తాను. కోటీశ్వరుడ్ని చేసేస్తాను"

ఆ క్షణంలో ఆయన గీతోపదేశం చేస్తోన్న శ్రీకృష్ణపరమాత్మలా అన్పించారు. అర్జునుల్లా మోకాళ్ళ మీద కూర్చుని చేతులు జోడించాలన్న కోర్కెని బలవంతాన నిగ్రహించుకున్నాను.

ఎట్టి పరిస్థితుల్లోనూ ఆయన మాట జవదాటకూడదని అప్పుడే మనస్సులో గట్టిగా నిశ్చయించుకున్నాను. నా బతుకుని పూలగా మార్చి ఆయన పాదాల దగ్గర కుప్పగా పోయాలనీ నిర్ణయించుకున్నాను.

ఊరంతా 'తాశిల్దారుగారి అల్లుడు' అంటూ గొప్పగా చూస్తూ పొగుడుతూ ఉంటే ఏనుగు అంబారీ ఎక్కినట్టు ఎంతో పొంగిపోయాను.

ఊరంతా తిరిగి అందరికీ - మూర్తికి, వాళ్ళమ్మకీ.. రాకుమారికి, వాళ్ళమ్మకీ.. చల్లయ్యతాతకీ అందరికీ గొప్పగా చెప్పేను.

రాకుమారికి తాశిల్దారుగారు గురించి, ఆయన ఇంటి గురించీ ఎంతో గొప్పగా వర్ణించి తలెగరేశాను.

"నీక్కాబోయే పెళ్లాం బావుంటుందా? " అడిగింది రాకుమారి.

"ఓ! సినిమాల్లోని రాజకుమారిలా ఉంటుంది"

మూతి తిప్పింది. నవ్వుకున్నాను.

మూడోరోజున మా గ్రామం నుండి నర్సి పురం మకాం మార్చేశాను.

ప్రతి ఆదివారం తాశిల్దారుగారి ఇంటికి భోజనానికెళ్లేవాణ్ణి.

జీవితంలో పైకి రావల్సినవాళ్ళు నేర్చుకో వాల్సిన సూత్రాల గురించి చెప్పేవారు. అవకాశాలని ఎలా అనుకూలంగా మలచు కోవాలో ఉపదేశిస్తూండేవారాయన.

"జీవితమనే మూడక్షరాల పదాన్ని అడు గడుగునా నిలదీసి శాసించేది ఒకటుంది. మనిషంత చిన్నగా కనిపించినా ప్రపంచ మంత పెద్దగా మార్చేసే ఆ పదార్థం పేరే డబ్బు. అంచేత డబ్బునెప్పుడూ తక్కువగా అంచనా వెయ్యొద్దు. గొడ్డుకి తిన్నది పుష్టి.. మనిషికి ఉన్నది పుష్టి. ఈ సంగతి జీవితంలో ఎన్నడూ మర్చిపోకు! తెలివైన చేప గాలానికి చిక్కుకోదు. ఎరని కొరికేసి చక్కగా ఈత కొట్టుకుంటూ వెళ్లిపోతుంది. జ్ఞాపకం పెట్టుకో! డబ్బు, పదవి, హోదా, విజయం ఎలా సంపాదించామన్నది కాదు, సంపాదించడమే ముఖ్యం.. గుర్తుంచుకో!"

ఇలా ఎన్నెన్నో చెప్పేవారు - కాదు నూరిపోసేవారు!

తాశిల్దారుగారి భార్య కూడా అభిమా నంగా చూడటం మొదలు పెట్టింది.

లక్ష్మీరాణి- నాక్కాబోయే భార్య మాత్రం నా దరిదాపులకే వచ్చేది కాదు. 'తాశిల్దారు గారి గారాల పట్టి కదా!' అని సర్దిచెప్పుకు నేవాడ్ని నాకు నేను.

ఒక గొప్ప గమ్యాన్ని చేరాలనుకున్న ప్పుడు కొన్ని అయిష్టాల్ని భరించాలి. కొన్ని ఇష్టాల్ని త్యాగం చెయ్యాలి, తప్పదు!

ఫస్ట్‌క్లాసులో పీయూసీ పాసయ్యాను. ఇంజినీరింగులో సీటు వచ్చింది. విశాఖ పట్నం ఇంజినీరింగ్ కాలేజీలో చేర్పిం చారు. ఇంజినీరింగ్ పూర్తవబోతుండగా మరో అద్భుతం జరిగింది!

జిల్లాకి చెందిన ఎమ్మెల్యే సూర్యనారాయ ణగారికి మంత్రి పదవి లభించింది. ఆయన తాశీల్దారుగారి మిత్రుడు. అంచేతా యన ఈయన్ని పి.ఎ.గా తీసుకున్నారు. దాంతో మకాం హైదరాబాదుకి మారింది.

కొత్త పరిచయాలు, పైరవీలు, లంచాలు, కాంట్రాక్టులు - ఇక పట్టిందల్లా బంగార మయ్యే పరిస్థితి!

నేను ఇంజినీరింగు పట్టా పుచ్చుకోగానే "ఉద్యోగం వద్దు, కాంట్రాక్టుల్లోకి దిగిపో" అన్నారు తాశిల్దారుగారు.

ఆయన వాక్కు వేదవాక్కు గనుక మారు మాట్లాడకుండా దిగిపోయాను.

ప్రముఖ కాంట్రాక్టర్లతో, బిల్డర్లతో నేనూ చేయి కలిపాను.

అప్పుడే లక్ష్మీరాణికి నాకు వివాహం జరిపించారు. హైదరాబాదులోనే భారీ ఎత్తున చేశారు. మంత్రులూ, ఎమ్మెల్యేలూ, అధికారులూ, అనధికారులూ ఎందరెందరో హాజరయ్యారు.

మా ఊర్నించి మా అమ్మ, పెదనా న్నలు, మూర్తీ మాత్రం వచ్చారు. వాళ్ళు కూడా పెళ్లయిన మర్నాడే వెళ్ళిపోయారు.

అమ్మని మా దగ్గరే ఉండిపొమ్మని అందామనుకున్నాను గానీ ఆ వాతావర ణంలో ఇమడలేదని ఊరుకున్నాను. అమ్మ పల్లెకెళ్లిపోయింది.

ఆ తర్వాత వ్యాపార వ్యవహారాల్లో పీక లదాకా కూరుకుపోయాను. అంచెలంచె లుగా ఎదిగాను.

## కొత్తగాలి...

**అద్భుత ప్రజ్ఞతో**
**అమరుల బోధనకై**
**అరిగినాడు దివికి**
**అబ్దుల్ కలాం!**

– *అంబటి వెంకటశివారెడ్డి,*
యర్రగుంట్ల, కడప జిల్లా

రియల్ ఎస్టేట్ వ్యాపారం ప్రారంభించాం. అపార్ట్‌మెంట్లు నిర్మించి అమ్మేం. ప్లాట్లు వేసి అమ్మాం.

రిటైర్ అవడంతోనే మా మావగారు కూడా మాతో కలిశారు.

ఒకసారి విజయాన్ని చవిచూసినవాడు మరి నిద్రపోడు. అల్ప విషయాల్ని పట్టించుకోడు. మరింతగా పనిచేస్తాడు. పని రాక్షసుడవుతాడు. మరిన్ని విజయాలు సాధించాలని తహతహలాడ్తాడు. అందుకోసమే తపిస్తాడు.

నేనూ అందుకు మినహాయింపు కాదు.

అందువల్లే మళ్ళీ నేను మా ఊరు వంక చూడలేకపోయాను. అతికష్టం మీద మూర్తి పెళ్ళికి మాత్రం నర్సాపురం వెళ్ళి వచ్చాను. అప్పుడే తెలిసింది నాకు అమ్మ ఆరోగ్యం బాగోలేదని.

సరైన వైద్యం చేయించుకోమని కబురంపాను. డబ్బూ పంపాను. హైదరాబాద్ వచ్చేస్తే ఖరీదైన వైద్యం చేయిస్తానని మూర్తి ద్వారా చెప్పించాను.

అమ్మ మొండిది. వినలేదు. ఆ ఊరినీ, ఆ జనాన్నీ వదిలి రానంది.

తర్వాత నా వ్యాపారపు రంధిలో పడి ఆ విషయాల మీద శ్రద్ధ పెట్టలేకపోయాను. నాకు కొడుకు పుట్టినప్పుడు అమ్మ వచ్చింది. నా వైభవానికి ఎంతగానో మురిసిపోయింది. పది రోజులపాటూ మా దగ్గరే ఉండింది.

బారసాల చాలా ఘనంగా చేశాం. అప్పుడు అమ్మని 'జో అచ్యుతానంద జోజో ముకుందా' పాడమన్నాను. అమ్మ కళ్ళ నుండి కన్నీళ్ళు జలజలా కారిపోయాయి. మరేమి జ్ఞాపకాలు రేగాయో! ఏమో!

ఆ కన్నీళ్ళని రాణి అపార్థం చేసుకుని విసుక్కుంది.

"పిల్లాడికి నీ దిష్టి తగుల్తుంది, దూరంగా వుండు" అంది మా అత్తగారు.

అమ్మ దాన్ని అవమానంగా భావించింది. లోపలికెళ్ళిపోయింది. ఎంత పిలిచినా రాలేదు. ఆ మర్నాడే ఊరికెళ్ళిపోయింది. వయస్సు పైబడినా అమ్మ మొండితనం వీసమంత తగ్గలేదు!

మళ్ళీ వ్యాపారపు గొడవల్లో పడిపోయాను. ఒక రోజున 'మదర్ సీరియస్' అని టెలిగ్రాం వచ్చింది.

అప్పుడేదో ప్రారంభోత్సవ కార్యక్రమంలో బిజీగా ఉన్నాను. సంగతి కనుక్కుని ఫోన్ చెయ్యమని మూర్తికి టెలిగ్రాం ఇచ్చాను.

ఆ మర్నాడు మూర్తి ఫోన్‌చేసి అమ్మ చనిపోయిందని చావు కబురు చెప్పేడు!

ఎక్కడి పనులక్కడే వదిలేసి బయల్దేరి వెళ్ళాను. ఆ కుగ్రామంలో ఒక గంట కూడా ఉండలేరని రాణినీ అబ్బాయినీ తీసుకెళ్ళలేదు.

అప్పటికి అమ్మ చనిపోయి మూడు రోజులయ్యిందట! రోడ్డు పక్కన పాత చీరల్తో డేరా వేసి అందులో శవాన్ని వుంచారు. కంపు కొడుతోంది.

అందర్నీ చెడామడా తిట్టాను. టీబీతో చనిపోయిందని తెలుసుకుని 'నాకు ముందే ఎందుకు తెలియబర్చలేద'ని నిలదీశాను. 'అయిన వాళ్ళంతా ఉండి కూడా అనాథ శవంలా పడేస్తారా?' అని ఆగ్రహంతో ప్రశ్నించాను.

ఊరి పెద్దల మాటలకి కోపాన్ని దిగమింగాను.

శవయాత్రలో ఊరు ఊరంతా పాల్గొంది.

మూడోరోజున అమ్మ చితాభస్మాన్ని గోదావరిలో కలిపి నమస్కరించాను.

గోదావరి!

పుట్టింది మొదలు చనిపోయే వరకూ మనిషి జీవనయాత్రలో ముడి వేసుకున్న పుణ్యానది.

గోదావరి నీరిచ్చింది. సారవంతమైన నేల ఇచ్చింది. పంటలిచ్చింది. సంపదలిచ్చింది. నాగరికత నేర్పింది. పిల్లాపాపల

తో వృద్ధిచెందేలా చేసింది. పుట్టినప్పుడు 'పురుటి మైల' నుండి శుద్ధి చేస్తుంది. కడకి బూడిదగా మిగిలినప్పుడు దాన్ని తనలో కలుపుకుని అమరత్వాన్ని కూడా ప్రసాదిస్తుంది!

ఎంతటి మహోన్నతమైనమూర్తి తల్లి గోదావరి!

నది నరుడి బతుకులో అడుగడుగునా పెనవేసుకున్నప్పటికీ ఒక్కోసారి మనిషి మనుగడకోసం సుదూర తీరాలకి సాగి పోక తప్పదు. నదికి వీడ్కోలు చెప్పకా తప్పదు.

గాఢంగా నిట్టూర్చాను.

ఊళ్ళో చిన్నకర్మ చేసి హైదరాబాద్‌కు వెళ్ళిపోయాను. అక్కడ పదకొండో రోజున పెద్దకర్మ ఘనంగా చేశాను. స్నేహితులూ వ్యాపార లావాదేవీలు ఉన్నవారూ.. అందరూ వచ్చారు.

కష్టాలు ఒంటరిగా రావని ఎందుకంటారో ఆ తర్వాత తెలిసింది. అమ్మ చనిపోయిన రెండు నెలలకే మా మావగారు కన్నుమూశారు. కడుపులోని అల్సర్‌కి ఆపరేషన్ చేయిస్తే అది కాస్తా విఫలమైంది. ఒక్కసారే ఒంటరినైపోయినట్టు ఫీలయ్యాను. కన్నీరు మున్నీరుగా విలపించాను.

బంధుమిత్రులెక్కువగా రాలేదు. మా దగ్గర పనిచేసేవాళ్ళు మాత్రం శ్మశానం దాకా వచ్చారు.

మావయ్యగారి చితాభస్మాన్ని ప్రత్యేకంగా తీసుకెళ్ళి కాశీలోనూ త్రివేణి సంగమంలోనూ కలిపొచ్చాను. ఆ రకంగా ఆయన రుణం కొంతైనా తీర్చుకోగలిగానని తృప్తిపడ్డాను.

ఆయన్లేని లోటు పూడ్చలేందే అయినా పూడ్చుకుని పురోగమించక తప్పలేదు.

మాకిద్దరు కొడుకులు, ఒక కూతురూ. వారికి నగరంలోని బెస్ట్ ఎడ్యుకేషన్ ఇప్పించాను. కాలేజీలకి కార్లలో వెళ్ళేవారు. బంజారాహిల్స్‌లో పెద్దబంగళా కట్టాను. ఎన్నో ఆస్తులు సంపాదించాను. ఎంతో కీర్తి ప్రతిష్ఠల్ని ఆర్జించాను. నల్లేరు మీది బండిలా సాగిపోతోంది జీవితం.

## 2

ఎలాటి వారికైనా కొన్ని కొన్ని ఆకర్షణల్నుంచి, వ్యామోహాల నుంచి తప్పించుకోవడం సాధ్యం కాదు.

బహుశా అందుకే మా ఊరి రాయుడు గారు కాంచనమాలని ఉంచుకునుంటారు.

రాకుమారిలాంటి అందమైన అమ్మాయి భార్యగా రావాలనుకున్నాను. అది నెరవేరలేదు. రాణి నా భార్య అయింది. అందగత్తెగాకపోయినా కొంచెం లావుగా ఉండటం వల్ల నేనాశించిన అందచందాల్లేవు. అలాగని అసంతృప్తీ లేదు. అడపాదడపా పార్టీల్లో బయటి అమ్మాయిలతో బాగానే ఖుషీ చేస్తున్నాను.

అయినప్పటికీ కాంచనమాలలాంటి అందాల యువతి పొందుకోసం నాలోని 'తహతహ' తగ్గలేదు.

వెండితెర శృంగార దేవత రమామణి వయస్సు, అందం, హొయలు, నవ్వు నన్ను ఒకరకంగా పిచ్చివాణ్ణి చేశాయి.

ఎలాగైనా సరే ఆమెతో ఓ రాత్రి గడపాలనుకున్నాను. మద్రాసులో ఉన్న మిత్రుల ద్వారా సినీజీవుల ద్వారా ప్రయత్నించాను.

ఒక రేటు చెప్పారు. అది చాలా ఎక్కువ. అయినా అంగీకరించాను. కలల రాణితో కలిసే భాగ్యంకోసం ఏమైనా చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను.

ఆమె పి.ఎ. నన్ను ఆమె దగ్గరకి తీసుకెళ్ళాడు.

ఆమె నా వంక ఎగాదిగా చూసి మొఖం చిట్లించి లోపలికి వెళ్ళిపోయింది. దాంతో ఖిన్నుడ్నయ్యాను.

"సారీ! అమ్మకుట్టికి మీరుదా నచ్చలేదు"

నల్లగా పొట్టిగా కొంచెం లావుగా

బొజ్జతో ఉంటాను. అందగాడ్ని కాదన్న సంగతి నాకూ తెలుసు. అయినా మొఖం మీద అలా చెప్పి అవమానించడం భరించలేకపోయాను.



నాలో పట్టుదల పెరిగింది.

ఆమెతో ఒక్కరాత్రి గడిపితే చాలు ఇంకేమీ అక్కర్లేదు - జన్మ ధన్యమైపోతుం దన్న భ్రమలో కూరుకుపోయాను.

నా అదృష్టం కొద్దీ మరికొన్నాళ్ళకే రమా మణి సొంత చిత్ర నిర్మాణం చేపట్టింది. రెండో షెడ్యూలు జరుగుతూండగా ఫైనా న్షియర్లు వెనకడుగేశారు. ఫైనాన్స్ కోసం ఆమె విపరీతంగా ప్రయత్నిస్తోందని తెలి సింది నాకు. దాన్ని క్యాష్ చేసుకోదలి చాను. ఆమె దగ్గరికి ఓ మధ్యవర్తిని పంపేను.

మహాబలిపురంలో కాటేజ్ బుక్ చెయ్య మని కబురంపింది.

ఆమె అప్సరాంగనలానే ఉంది. ఫుల్ మే కప్‌తో వచ్చింది. తననెవరైనా గమనిస్తా రని కాబోలు శాలువా కప్పుకుని వచ్చింది.

ఆమెనీ ఆమె సినిమాలనీ గొప్పగా పొగి డాను. ముక్తసరిగా మాట్లాడింది. వేట్ సిక్స్టీనైన్ బయటికి తీశాను.

ఎగిరి గంతేసింది. తాగుతూ తిన్నాం. తింటూ తాగాం. ఏదేదో పేలుతోంది.

ఆమెకి దగ్గరగా కూర్చుని ఆమెనీ, ఆమె అంగాంగాల్నీ తినేసేలా చూశాను.. నిమి రాను.. స్వర్గంలో ఉన్న అనుభూతి పొందాను.

కోట్లాదిమంది ప్రేక్షకుల ఆరాధ్యదేవత నా కౌగిట్లో ఉందన్న ఊహ ఉక్కిరి బిక్కిరి చేసింది. ఉద్రేకంతో రెచ్చిపోయాను. ఆమెని కొన్ని నిమిషాల పాటు సొంతం చేసుకున్నాను. జగజ్జేతనైనట్టుగా అను భూతి చెందాను.

ఆస్తిపరుడ్నవ్వాలనుకున్నాను.. అయ్యా ను. రమామణితో పక్క పంచుకోవాలను కున్నాను.. అదీ సాధించాను.

'అయామ్ గ్రేట్! గ్రేట్!' అని పిచ్చిగా అరుస్తూ నర్తించాను.

"రాజులకీ మహారాజులకీ లభ్యమయ్యే భోగంరా!" అని మెచ్చుకున్నారు మిత్రులు.

అప్పుడు రాయుడుగారు గుర్తొచ్చారు. 'మీకన్నా నేను అధికుడ్ని' అనుకుంటూ మీసం సవరించుకున్నాను!

ఆ తర్వాత రమామణి సినిమా పూర్త య్యింది. రిలీజయ్యింది. ఘోరంగా ఫ్లాప్ అయ్యింది.

మా కంపెనీ సొమ్ము నష్టపోయాం. అయినా నేను చింతించలేదు. అందుకు తగిన ప్రతిఫలం నాకు ముందే ముట్టింది!

ఓరోజు సాయంత్రం ఆఫీసు నుంచి ఇంటికొస్తున్నాను. గేటు ముందు కారా గటం ఆలస్యం, ఓ ముసలాయనా ఓ కుర్రాడు ముందుకొచ్చారు.

మా ఊర్నించి వచ్చామన్నారు. పరీక్షగా చూశాను. పెద్దాయన శ్రీరాములు గారు. చిన్నతను నాకు తెలీని యువకుడు.

"వూc.. చెప్పండి! సిటీకెప్పుడొచ్చారు? ఏదైనా పనిమీద వచ్చారా? సిటీ చూద్దా మనొచ్చారా? "

"అయ్! మిమ్మల్ని కలుద్దామనే ప్రత్యే కంగా వచ్చాం" శ్రీరాములుగారన్నారు.

నాకంటే వయస్సులో చాలా పెద్దవా డైనా, నన్ను మన్నిస్తూ మాట్లాడారు. అదంతా నా 'స్టేటస్' వల్లనే కదా అన్పించి కించిత్తు గర్వంగా ఫీలయ్యాను. ఈ రకంగా మా ఊరివాళ్లకి నా ఇల్లూ నా వైభోగం చూపించే అవకాశం చిక్కినందు కెంతో సంతోషించాను.

## కొత్తగాలి...

**నాయకుల ఎత్తులకు**
**వినాయకుడి ఎత్తు పెరుగుతుంది**
**ఆశీర్వాదం కోసం కాదు**
**ఆదాయం కోసం!**

– నల్లపాటి సురేంద్ర,
విశాఖపట్నం

## అంపశయ్య నవీన్ నవలా పురస్కారాలు

కొత్తగా నవలలు రాసే రచయితలను ప్రోత్సహించాలనే ఉద్దేశంతో ఒక నవలాకారుడు రచించిన మొదటి నవలకు రూ. పదివేల పారితోషికం ఇవ్వాలని **'అంపశయ్య నవీన్ సాహిత్య సమితి (లిటరరీ ట్రస్టు)'** నిర్ణయించింది. పోటీకి వచ్చిన ఆయా నవలాకారుల మొదటి నవలల్లో ఉత్తమమైంది ఎంపిక చేసి, ఈ పురస్కారాన్ని డిసెంబరు 24న నవీన్ జన్మ దినోత్సవం నాడు ప్రదానం చేస్తారు. 2012- 14 సంవత్సరాల మధ్య కాలంలో రాసి, ప్రచురితం కాని నవలల్ని (నాలుగు ప్రతులు) అక్టోబరు 31, 2015 లోగా **అంపశయ్య సాహిత్య సమితి,** వరంగల్‌కు పంపాలి.

**వివరాలకు : 0870 - 2456458 ఫోన్ నెంబరులో సంప్రదించవచ్చు**

"చెప్పండి! ఏమైనా ఇంటర్వ్యూ వచ్చిందా? రికమండేషన్ చెయ్యాలా? "

"అహ! మా గురించి కాదు. ఊరుమ్మడి కార్యార్థం వచ్చాం! ఏంలేదు.. మనూళ్ళోని గ్రంథాలయం గురించి మీకు తెలుసు కదా! దానిని పునరుద్ధరించాలని మా సంకల్పం. ఆయ్! మీరో చేయివేస్తారని వచ్చాం" అన్నారు శ్రీరాములుగారు.

"లైబ్రరీకి శ్రీరాములుగారు స్థలం రాసిచ్చారు. మీలాంటి పెద్దలు సహకరిస్తే చక్కని భవనం నిర్మించి ఊరందరికీ ఉపయోగపడేట్టు తీర్చిదిద్దాలనుకుంటున్నాం!" అన్నాడు యువకుడు బోస్.

"తండ్రికి వారసుడిగా నిలిచినప్పుడే పుత్రుడవుతాడు. మీ అమ్మే నీకు అమ్మా నాన్నా అయి పెంచింది గనుక భవనానికి ఆవిడ పేరు పెట్టు" శ్రీరాములుగారు అందుకున్నారు.

"నాలుగైదు లక్షలిస్తే చాలు! మీకది లెక్కలోంది కాదు" బోస్ అన్నాడు.

"ఊరికి లైబ్రరీ చాలా ముఖ్యం. చాలా అవసరం. నా ఎదుగుదలలో పుస్తకాలు బాగా ఉపకరించాయి. కానీ లైబ్రరీని మెయిన్‌టెయిన్ చెయ్యడం చాలా కష్టం. నిజం చెప్పాలంటే మీకు సాధ్యం కాదు. ఇలాటివి ప్రభుత్వం చేత ఏర్పాటు చేయించడం మంచిది"

"మీ మీద చాలా ఆశ పెట్టుకునొచ్చాం" శ్రీరాములుగారన్నారు.

"మా సంపాదన అంతా టాక్సులు కట్టడానికీ లంచాలివ్వడానికే సరిపోతోంది" చిన్నగా నవ్వేను.

నిరాశతో వాళ్ళెళ్ళిపోయారు.

ఎంతో కొంత సాయం చెయ్యాల్సిందన్పించింది. కానీ ఆ వెంటనే దానివల్ల లాభమేమీ లేదనీ అన్పించింది. లాభం లేని పనులు చెయ్యడానికి నేనేమీ సంఘసేవకుడ్ని కాదు, వ్యాపారవేత్తని!

మళ్ళీ నేనా కుగ్రామానికి వెళ్ళేదీ లేదు. అక్కడివాళ్ళతో నాకు పనీ లేదు. ఇదే మరొకళ్ళకో మరొకళ్ళకో ఇస్తే ఏదోరకంగా ఉపయోగపడ్తారు. ఆ పల్లెజనం మాత్రం దేనికీ ఉపమోగపడరు. నేను రాజకీయాల్లోకి దిగి అక్కడ్నుంచి పోటీ చేస్తే తప్ప.

నాకపుడు శుక్రమహాదశ. నేను వేసిన ప్రతి అడుగూ సక్సెస్సే. పట్టిన ప్రతీదీ బంగారమే!

మా అబ్బాయిలిద్దరూ అందొచ్చారు. వ్యాపారంలో చెరోభుజమై కాశారు. నేను అక్షరాలా త్రివిక్రముడ్ని అయ్యాను.

సరిగ్గా అప్పుడు హర్షద్ మెహతా పుణ్యమా అని షేర్ మార్కెట్లో ఊహాకం

దనంత బూమ్ వచ్చింది. దాన్ని మేం బాగా డబ్బు చేసుకున్నాం. షేర్ బ్రోకింగ్, షేర్ ఫైనాన్స్ సంస్థలు నెలకొల్పాం. తర్వాత మార్కెట్ క్రాష్ అయినా మాకు నష్టం వాటిల్లలేదంటే మా ప్రజ్ఞాపాటవాలు ఎలాటివో గ్రహించొచ్చు.

ఇక్కడ మా పిల్లల గురించి రెండు మాటలు చెప్పాలి.

చిన్నవాడు ధనేష్, బుద్ధిమంతుడు. చక్కని వ్యూహకర్త. వ్యవహర్త. నిమ్మకినీరె త్తినట్టు ఉంటాడు. పైకి కనిపించడుగానీ ఎలాటి పనైనా ఎంతో అవలీలగా సాధిం చుకొస్తాడు.

పెద్దవాడు బుచ్చిరాయుడు. మా మావ గారి పేరైతే పెట్టాంగానీ ఆయన బుద్ధులు ఒక్కటీ రాలేదు.

మనిషి మంచివాడే గానీ దుందుడుకు తనం, కోపం ఎక్కువ. ఏదైనాసరే చకచకా తేలిపోవాలంటాడు. నాన్చుడు ధోరణి అస్సలు నచ్చదు. హై సొసైటీలోని అందరు అబ్బాయిల్లానే స్నేహితుల్ని వెంటే సుకుని బైక్స్ మీద తిరుగుతూంటాడు. క్లబ్బులకీ బార్లకీ వెళ్తూంటాడు. ఆ వయ స్సులో నేను చెయ్యలేనివన్నీ వాడిప్పుడు చేస్తున్నాడు.

'లైఫ్‌ని ఎంజాయ్ చెయ్యనీ' అని ఊరుకున్నాను.

అదే నా నెత్తి మీదకో ముసలం తెచ్చిపె ట్టింది! అదింకో మలుపుకి దారితీసింది!

★ ★ ★

"డాడీ!" అంటూ సుడిగాలిలా వచ్చాడు బుచ్చిరాయుడు.

భయకంపితుడై నిలువునా వణకిపోతు న్నాడు. ముచ్చెమటల్తో దుస్తులు తడిసి ముద్దయ్యాయి.

"డాడీ! మీరే నన్ను రక్షించాలి.." నా ఒళ్ళో వాలిపోయి బావురుమన్నాడు. వాడికి తల్లి దగ్గరకన్నా నా దగ్గరే చనువె క్కువ మరి.

"నీకు నేనున్నాను! నీకేం భయం లేదు గానీ ఏం జరిగిందో ఏదీ దాచకుండా చెప్పు..." అభయమిచ్చాను.

"డాడ్..!" అంటూ మొత్తం చెప్పాడు.

వాడూ, వాడి స్నేహితులూ బార్ నుంచి తూలుతూ బయటికొచ్చి కార్లు బయటికి తీశారట. రోడ్లు నిర్మానుష్యంగా ఉండేసరికి 'పోటీ' ఆలోచన వచ్చింది. సై అంటే సై అనుకుని పోటీపడ్డారు.

రెండు కార్లు.. ఒక కారు డ్రైవింగ్ సీట్లో మావాడు. వెనక సీట్లలో ఉత్సాహపరుస్తూ మిత్రబృందం.

కార్లు రెండూ పోటాపోటీగా దూసుకు పోయాయి. ఓవర్‌టేక్‌లు ఎక్కువ య్యాయి. ఎలాగైనా రెండోవారిని ఓడిం చాలన్న 'కసి'తో చెలరేగిపోయారు.

ఒకచోట మావాడు ఓవర్‌టేక్ చెయ్యడా నికి కారుని ఫుట్‌పాత్ మీంచి దూకిం చాట్ట. ఏడుపులూ పెడబొబ్బలూ వినిపిం చాక గానీ గ్రహించలేదుట - ఫుట్‌పాత్ మీద నిద్రపోతున్న బిచ్చగాళ్ళ మీంచి కారుని పోనిచ్చానని.

దాంతో బెంబేలు పడిపోయి మరింత వేగంగా నడుపుతూ దారిలో ఒక ఆటోనీ, ఇద్దరు ముగ్గురు వ్యక్తుల్నీ ఢీకొట్టి ఎలాగో ఇంటికొచ్చి పడ్డాడట!

"భయపడకు నాన్నా! మీ నాన్న నిన్నె లాగైనా బయట పడేస్తార్లే..." రాణి బుచ్చిని అనునయిస్తోంటే గబగబా ఆలో చించాను.

జరిగింది చిన్నఘటనే! అనుకోకుండా జరిగిందే! కానీ దాన్ని మీడియా సంచలన వార్త చేస్తుంది. ఆలోగానే వాడ్ని సిటీ నుంచి పంపించెయ్యటం మంచిదనుకు న్నాను. వెంటనే చెన్నై పంపించేశాను.

తర్వాత నాకు తెలిసిన పోలీసు అధికా రిని కలిసి జరిగింది చెప్పేను. అతడు పై అధికారులతో మాట్లాడాడు.

'నిందితులు ఎంతటి వారైనాసరే అరెస్టు

చేసి తీరతాం' అని పెద్ద స్టేట్‌మెంట్లి చ్చారు. మా కారుని స్వాధీనం చేసుకున్నారు. రక్తసిక్తమైన కారు టైర్ల ఫొటోలు పత్రికలకి రిలీజ్ చేశారు.

కారు వేణుగోపాలరావు గారిదని చెప్పారు. నేను ఇంట్లోనే ఉన్నాననీ పెద్దబ్బాయి మహాబలిపురంలో ఉన్నట్టు చెప్పారనీ, చిన్నబ్బాయికి ఎలిబీ ఉందనీ పేర్కొన్నారు. సంఘటన జరిగినప్పట్నుంచీ డ్రైవర్ కన్పించడం లేదనీ, అతడికోసం గాలింపు ముమ్మరం చేశామనీ ప్రకటించారు పోలీసు అధికారులు.

ఉవ్వెత్తున లేచిన సంచలన కెరటం సద్దుమణిగింది. మరి వారం రోజులకే వార్త చప్పబడిపోయింది.

అప్పుడు పోలీసులు కృష్ణయ్య అనే డ్రైవర్ని నా దగ్గరికి తీసుకొచ్చారు.

అతడేదో పల్లె నుంచి సిటీకి వలస వచ్చాడనీ కుటుంబ పరిస్థితుల దృష్ట్యా నేరాన్ని తన మీద వేసుకోడానికి సిద్ధంగా ఉన్నాడనీ, ఇరవై లక్షలు ఇమ్మనీ చెప్పారు.

"ఆరుగురు గాయపడ్డారు. ఒకరు చనిపోయారు. ఇంకొకరి పరిస్థితి ప్రమాదకరంగా ఉంది. శిక్ష ఎక్కువే పడొచ్చు..! ఆ లెక్కన చూస్తే ఆ మొత్తం చాలా తక్కువ. ఏదో పల్లెటూరివాడు గనుక ఒప్పుకున్నాడు" పోలీసు అధికారి వివరించాడు.

"అంతో ఇంతో బాధితులకీ ఇవ్వాలిగా! వాళ్ళకి ఎగ్గొట్టే మార్గం లేదా? "

"ఎంగిలి మెతుకులు విసిర్తేనే అణగి ఉంటారు. లేకపోతే ఎవరో ఒకరు వాళ్ళని భుజానికెత్తుకుంటే మనకపుడు చచ్చేచావు అవుతుంది"

అయిష్టంగానే 'డీల్'కి అంగీకరించాను.

దగ్గరదగ్గర ఎనభై లక్షలు క్షవరమైంది. ఈ వంకన అటు పోలీసు ఉన్నతాధికారులతో ఇటు రాజకీయ నాయకులతో స్నేహాలు పెరిగాయి.

'ఏం చేసినా ఫరవాలేదు! డబ్బు వెదజల్లి తప్పించుకోవచ్చు' అనే ధీమా లేదా అహం

## 'చతుర'లో పదమూడో నవల



సింహప్రసాద్

గోదావరి ప్రధాన పాత్ర పోషించిన ఈ నవలని గోదావరి పుష్కర సంవత్సరంలో ప్రచురిస్తున్న 'చతుర'కు కృతజ్ఞతాంజలి.

ఇంతదాకా 277 కథలూ 53 నవలలూ ప్రచురితమైనాయి. వాటిల్లో 45 కథలకు, 11 నవలలకు, కొన్ని కవితలకు నాటికలకూ బహుమతులందుకున్నాను. సుమారు 25 కథలు కన్నడ, తమిళ, హిందీ భాషల్లోకి అనువదితమయ్యాయి. 8 కథాసంపుటాలు వెలువడ్డాయి.

ఇది నా యాభైనాలుగో నవల. 'చతుర'లో పదమూడోది. తి.తి.దే. ఆర్థిక సహాయంతో ప్రచురించిన హిందూ వివాహ విజ్ఞాన సర్వస్వం 'వివాహవేదం'కు పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంవారి సాహితీపురస్కారం లభించింది. ఈ ఏడాది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి ఉగాది పురస్కారం అందుకున్నాను.

నా నవలల మీద ఒకరు, బహుమతి కథల మీద మరొకరు పి. హెచ్. డి నిమిత్తం పరిశోధన చేస్తున్నారు.

నేను పూర్తి వైవిధ్యమైన కథాంశాలతో నవలలు రాయడానికి ప్రధాన కారణం 'చతుర' ప్రోత్సాహమే. 'చతుర' సంపాదకులకు నా కృతజ్ఞతాభివందనలు.

*చిరునామా:*
**సింహప్రసాద్**
401, మయూరి ఎస్టేట్స్,
కె.పి. హెచ్. బి.,
హైదరాబాద్-500085

కారం నాలో బలంగా వేరూనింది.

నీతికీ అవినీతికీ మధ్య గల రేఖని చెరి పేశాం!

టేకుచెట్ల పథకం, గొర్రెల పెంపకం పథకం.. అంటూ రకరకాల స్కీములు ప్రకటించాం. నమ్మకాన్ని కలిగించాం. చేరిన ప్రతివారికీ అరచేతిలో వైకుంఠం చూపించాం. జనం నుంచి కోట్లాది రూపా యలు ఒక రకంగా దండుకున్నాం.

ఆ సొమ్ముని కొంత రియల్ఎస్టేట్ బిజి నెస్‌లోకి మళ్ళించాం. కొంత సినిమా నిర్మాతలకి అధికవడ్డీకి అప్పులిచ్చాం. బడా కాంట్రాక్టర్లకీ, బిల్డర్లకీ తక్కువ హామీతో ఎక్కువ వడ్డీకి రుణాలిచ్చాం.

"డాడీ! సినిమాల్లో నటించాలని ఉంది" మనస్సులోని కోరిక బయటపెట్టాడో రోజున ధనేష్. వాడు అందంగా ఉంటాడు. తెలిసిన నిర్మాతలకి చెప్పేను. చిన్నాచితకా వేషాలిస్తానన్నారు.

"నేను హీరోగానే చేస్తాను" అని భీష్మిం చాడు మావాడు.

"యాభై'ల'కారాలు పెట్టుబడి పెట్టండి. మీ వాడే హీరో" అన్నాడో చిన్ననిర్మాత.

దాంతో ఫైనాన్స్ నుంచి చిత్రనిర్మాణ రంగంలోకి దిగాం. సినిమా సగం పూర్తికా కుండానే సదరు నిర్మాత కాళ్ళు చల్లబడిపో యాయి. దాంతో మా సొమ్ముతో పూర్తి చేసి రిలీజ్ చేశాం. దురదృష్టవశాత్తూ అది రిలీజైనట్టు నలుగురికీ తెలిసే లోగానే థియేటర్లవాళ్ళు మా బొమ్మ పీకేశారు. నష్టం రెండు కోట్లు!

అది మా స్పీడుకి బ్రేకు వేసినా మళ్ళీ పుంజుకున్నాం. మా కంపెనీల్లో మదుపు చేసే డిపాజిట్లకి అత్యధిక వడ్డీ ఆశ చూపి కోట్లు సేకరించాం.

మా వ్యాపారాలు మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లుతోంటే ఓ సంఘ టన ఊహించని దెబ్బతీసింది. ఒక్కసా రిగా మమ్మల్ని ఎత్తి కుదేసింది. ఉక్కిరి బిక్కిరి చేసింది! ఊపిరందక గిలగిలా తన్నుకునేలా చేసింది!




డ్రైవర్ సడన్ బ్రేకు వేసేసరికి గతం తాలూకు జ్ఞాపకాల్లోంచి తేరుకుని బయ టికి చూశాను.

కారు ఒక పల్లెలోకి ప్రవేశిస్తూ పశువులు అడ్డొచ్చేసరికి ఆగింది.

పరిశీలనగా చూశాను. అది మా ఊరే! నా ఒళ్ళు ఒక్కసారిగా గగుర్పొడిచింది.

మా ఊరు ఒక పూజాపీఠంలా కన్పిం చింది. ముగ్ధుడ్నై ఆరాధనగా చూశాను.

ఇదిగిదిగో ఈ గడ్డమీదే నేను పుట్టాను! ఈ నేలమీదే నడిచాను! ఈ గాలే పీల్చాను! ఊరవతలున్న గోదావరి నీళ్ళే తాగాను! ఈ జనం ప్రేమాభిమానాలతోనే పెరిగాను! ఇవాళింత గొప్పవాడ్నయినా, కోట్లకు పడగెత్తినా నా మూలాలు ఇదిగో ఇక్కడే, ఈ ఊళ్ళోనే ఉన్నాయి!

చిన్నపిల్లాడిలా పొంగిపోయాను. ఏదో తెలీని ఆనందోత్సాహం నా నరనరంలోనూ పరుగులు తీస్తోంటే పరమానందంగా చూశాను.

కన్నులకు పండుగగా గుండెలకు నిండుగా ఉంది.

ఎంత డబ్బు పోస్తే ఈ అనుభూతి దక్కుతుంది! చిత్రంగా మారిన నా ఆలోచ నాధోరణికి అదిరిపడ్డాను.

మెటీరియలిస్టుని హృదయవాదిగా

మారిపోతున్నానేంటీ? ఈ ఊరి భూమి కింద విక్రమార్కుడి సింహాసనం లాంటిదే మైనా ఉందా? !

నా పెదాల మీద చిరునగవు మెరిసింది. హాయిగా నవ్వుకున్నాను. ఆ నవ్వు నాకే ముచ్చటగొల్పింది.

పల్లె పెద్దగా ఏమీ మారలేదు. కొన్ని నగరపు నడకలు పోతున్నా, స్లీపింగ్ విలేజ్‌లాగానే ఉంది.

అయినా ఒకప్పటి పచ్చదనం నిండుదనం అడుగడుగునా గుబాళిస్తూనే ఉండటం విశేషం.

వేంకటేశ్వరస్వామి గుడి దాటి చెరువు పక్కనుంచి వెళ్లి ఎత్తు అరుగుల పాత ఇంటి ముందాగాం! డిక్కీలోంచి సూట్‌కేస్ తీసి అరుగు మీద పెట్టాడు డ్రైవర్.

మాట్లాడుకున్న దానికన్నా ఎక్కువే కిరాయి ముట్టజెప్పాను. సంబరంగా చూసి సలాం చేసి కారు వెనక్కి తిప్పాడు.

మెట్లెక్కుతోంటే ఒకతను ఆశ్చర్యంగా చూస్తూ ఎదురొచ్చాడు.

అతడి నుదిటి మీది చుట్టతో కాల్చిన మచ్చ కంటబడగానే గుర్తించాను. అతడు గురుమూర్తి! నా మిత్రుడు మూర్తి!

"ఆ ముఖమేవిటి? ఆ ఫీలింగ్సేవిటి? నేనురా మూర్తీ..! గుర్తుపట్టలేదూ? వేణుని" ఆనందంగా అన్నాను.

"ఒరే నువ్వట్రా! రారా..! ఎన్నేళ్ళయ్యిందీ నిన్ను చూసి!!"

ఆ సంగతికేంగానీ నువ్వేమీ మారినట్టు లేవురా. ఇంకా ఇలాగే ఉంటే ఎలా పైకొస్తావురా మూర్తీ"

"ప్రియ మిత్రుడివి నువ్వెంతో పైకొచ్చావు. అదిచాలు గానీ, ఏవిటిలా దారి తప్పి వచ్చావ్? "

వాడి మాటల్లో 'శ్లేష' ఉందేమోనని వెదికాను, లేదు. గుండెల మీంచి బరువేదో దిగిపోయినట్టన్పించింది.

"అమ్మాయ్ గౌతమీ! నా బాల్యమిత్రుడొచ్చాడమ్మా! కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళు తెచ్చియ్యి!"

అందెల చప్పుడు.. ఆ వెంటనే పచ్చని తీగ ప్రత్యక్షమైంది. ముచ్చటగా లంగా వోణీ ధరించి పదహారణాల పడుచుదనంలా ఉంది.

ఆమె వనకన్యలా కన్పించింది. రెప్పవేయడం మర్చిపోయాను.

"మా అమ్మాయిరా! పేరు గౌతమి! అది పుట్టేక నువ్విదే చూడటం. వీడు వేణుగోపాలరావని నా చిన్ననాటి స్నేహితుడమ్మా! హైదరాబాద్‌లోని ప్రముఖ వ్యాపారవేత్తల్లో ఒకడు. ఇప్పుడంటే హైదరాబాదీయుడై పోయాడు గానీ ఒకప్పుడు మన ఊరివాడే"

"నమస్కారం బాబాయిగారూ!"

ఆ పిలుపులోని ఏదో మాధుర్యం నన్ను కదిపింది.. కుదిపింది.. కళ్ళు చెమర్చేలా చేసింది. మళ్ళీ ఒకప్పటి వేణుని చేసింది!

"చాలా సంతోషం తల్లీ! నువ్వు మా మూర్తిగాడి కూతురిగా పుట్టినందుకు ఈర్ష్యగా ఉందనుకో!"

కిలకిలా నవ్వేసింది.

"పిల్లలెందర్రా? " అడిగాను.

"గౌతమి ఒక్కతే"

"పున్నామ నరకం నుంచి తప్పించడానికో పుత్రుడుంటే బాగుండేది!"

"ఈనాటి కొడుకులు ఎందరో భూలోకంలోనే తల్లిదండ్రులకి నరకాన్ని చూపిస్తున్నారు కదురా!"

"నీ చాదస్తంతో వచ్చిన చిక్కే ఇది! ఏదేదో చెబుతావు. నువ్వెన్ని చెప్పినా సరే కూతురు కూతురే! కొడుకు కొడుకే!"

"కాదురా! కూతురు ఎప్పుడూ కూతురే! కొడుకు మాత్రం పెళ్ళయ్యేదాకే కొడుకు" నవ్వుతూ అన్నాడు.

మరేమన్లేక "సరే! అలాగే అనుకో! నా కొడుకులెంత ప్రయోజకులో చూశాకే నీ అభిప్రాయం మార్చుకుందువుగాన్లే!"

అంటూ ఇంట్లో కెళ్ళాను.

ఇదివరకట్లానే వుంది. ఎలాంటి మార్పూ లేదు. గోడలకి వరుసగా దేవుళ్ళ, దేశనాయకుల ఫొటోలు తగిలించి ఉన్నాయి. అవన్నీ పాతకాలంవే. చిన్నప్పుడు మూర్తికోసం వచ్చినప్పుడల్లా వీటిని ఎంతో ఆసక్తిగా ఆరాధనగా చూసేవాడ్ని. వాటిలో గంగావతరణం ఫొటో నాకు చాలా బాగా నచ్చేది.

శివుడు నడుం మీద చేతులు పెట్టుకుని ఎంతో ఠీవిగా, ధైర్యంగా నిలబడి తల పైకెత్తి చూస్తోంటే.. గంగ వయ్యారంగా దివి నుంచి శివుని శిరస్సుపైకి దుముకుతోంది.

ఆ ఫొటో చూసినప్పుడల్లా ఏ విషయంలోనైనా ఆ శివుడిలా ధైర్యంగా నిలవాలన్పించేది. గంగలా ఆకాశం నుంచి నేల మీదకి దిగి వచ్చి పదిమందికి ఉపయోగపడాలనీ అన్పించేది.

"పాత ఫొటోల్ని అంత దీక్షగా చూస్తున్నావేమిట్రా? నువ్వు తలుచుకుంటే రమణీయ శిల్పాలే నీ డ్రాయింగు రూములోకి నడచి వస్తాయిగా!"

"వీటి ప్రత్యేకత వేరురా! ఇవన్నీ తీపిగుర్తులు. ఒకనాటి ఉత్ప్రేరకాలు. నన్నూ నా ఆలోచనల్నీ ప్రభావితం చేసిన అమూల్య సంపద.."

"ముందర్జంటుగా కడుపులో కాఫీ పడాలి. ఆత్మారాముడు గోల చేస్తున్నాడు. కాఫీలో నో షుగర్"

"ఇవాళ ఉగాది పండగ బాబాయ్!" గౌతమి మాటలకి ఎంబ్రాస్సింగా ఫీలయ్యాను.

"నీ ఇల్లాలెక్కడా కన్పించదేంరా?"

మూర్తి కళ్ళు బాధా పుష్పాలయ్యాయి. వాడి చూపులు ఓవైపుకి తిరిగి ఆగాయి. అటు చూసి గతుక్కుమన్నాను.

ఫొటోకి వేసి వున్న దండ నన్ను నిలేస్తోంటే సిగ్గుపడ్డాను.



"సారీరా! అప్పట్లో- నీ ఉత్తరం వచ్చినట్టే గుర్తు. పని ఒత్తిడివల్ల రాలేకపోయాను. ఆ తర్వాత సంగతే మర్చిపోయాను. 'వచ్చి పోతూ వుంటే బంధుత్వం.. ఇచ్చి పుచ్చుకుంటేనే వ్యవహారం' అనెందుకన్నారో ఇప్పుడు తెలుస్తోంది. అంత చిన్నవయస్సులో.. అసలలా ఎలా జరిగిందిరా?"

"సమయానికి వైద్యసాయం అందలేదు. నూకలు నిండిపోయాయి"

"ప్చ్..! చాలా అన్యాయం జరిగిపోయిందిరా! భగవంతుడెప్పుడూ మంచివాళ్ళకే కష్టాలు రాస్తూంటాడు.."

వాడేమీ మాట్లాడలేదు. మరికేం మాట్లాడాలో ఎలా ఓదార్చాలో నాకు తోచలేదు.

మూర్తి మాట తోసిపుచ్చలేక తలస్నానం చేసి ఉగాది పచ్చడి తిన్నాను. జీవితంలో ఎన్ని అనుభూతులుంటాయో తెలియజెప్పే షడ్రుచుల సమ్మేళనం ఉగాది పచ్చడి.

ఉగాది రోజున వచ్చాను. ఇది నా జీవితంలో నవ ఉగాది అయితే బావుణ్ణు!

లేత అరటి ఆకుల్లో మా ఇద్దరికీ భోజనం వడ్డించింది గౌతమి.

"అయినవాళ్ళకి ఆకుల్లోనూ కానివాళ్ళకి కంచాల్లోనూ వడ్డించాట్ట వెనకటికెవడో నీలాటివాడు. అలా వుంది వరస!"

"నేనే వడ్డించమన్నారా! నువ్వు అరిటాకులో భోంచేసి ఎన్నేళ్ళయ్యిందో అని!"

గొంతుకేదో అడ్డుపడినట్టయ్యింది.

"నిజంరా..! చాలా నిజం! అప్పుడప్పుడూ అన్పిస్తూంటుంది, ప్లేటులో అరిటాకు వేసి అందులో ఇడ్లీ పెట్టి కారప్పొడీ కమ్మని నెయ్యీ వేసి కొబ్బరి చెట్నీ జత చేసిచ్చే హోటళ్ళు ఈ రోజుల్లో ఎక్కడా కన్పించట్లేదు. ఆ రోజులు వేరు. ఆ పద్ధతులూ ఆ ఆప్యాయతలూ వేరు. ఇప్పుడు తల్లిపాల దగ్గర్నుంచి ప్రతీదీ వ్యాపారమైపోయింది"

"డబ్బు యావ ముందు విలువలు ఏ మాత్రం కన్పించవు"

"అలాగని డబ్బుని తీసిపారెయ్యకు.



# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

- ★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టిపెట్టాలి. హాస్య, వ్యంగ్య సహా ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.
- ★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర నవల' అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీనికి అనుగుణంగా రచయితలు నవలల్ని రాసి పంపాలి.
- ★ ప్రచురణకు స్వీకరించని నవలలు తిప్పి పంపేందుకు వీలుగా తగినన్ని స్టాంపులు అంటించిన సొంత చిరునామా గల కవరు జతపరచాలి. స్టాంపులు అంటించని నవలలు ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి.
- ★ నవలలపై నిర్ణయం తెలియజేయడానికి 6-8 వారాలు పడుతుంది. ఫోన్/ఎస్సెమ్మెస్/ ఈమెయిల్ ద్వారా మా నిర్ణయాన్ని తెలియజేస్తాం. గడువులోగా సమాచారం అందకపోతే మమ్మల్ని సంప్రదించవచ్చు.
- ★ నవలతోపాటు మీ చిరునామా, ఫోన్ నెంబరు, ఈ మెయిల్ వివరాలు స్పష్టంగా రాయాలి.
- ★ సంపాదకులను ఉద్దేశించి 'హామీ పత్రం' తప్పనిసరిగా పంపాలి. హామీ పత్రం లేని నవలలు పరిశీలించలేమని మనవి.

## నమూనా హామీ పత్రం

చతుర సంపాదకులకు

ఫలానా నవలను 'చతుర'లో ప్రచురణార్థం పంపుతున్నాను. ఈ నవల నా సొంతం. దేనికీ అనువాదం కాదు. (ఒకవేళ అనువాదమైతే) .... పేరుగల అనువాద నవల ఫలానా భాషా రచయితది (రచయిత పేరు). ..... పబ్లిషర్‌నుంచి/పుస్తకం/పత్రిక నుంచి ...భాషలో స్వీకరించి అనువదించాను.

ఈ నవలను ఇంతవరకూ ఏ పత్రికకూ పంపలేదు. ఎవరి పరిశీలనలోను లేదు. ఏ వెబ్‌సైట్, బ్లాగులో ప్రచురితం కాలేదు. ఈ అనువాద నవలకు మూల రచయిత/రచయిత్రి/ ప్రచురణకర్తల నుంచి అనుమతి పొందాను/ పొందలేదు. ప్రచురణకు స్వీకరించని పక్షంలో తిప్పి పంపటానికి స్టాంపులు అంటించిన కవరు జతపరిచాను/లేదు.

తేదీ:

స్థలం: సంతకం:

చిరునామా : ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082
ఫోన్ : 23318181, Ext: 6658, 6532 ఈ మెయిల్:vipula.chatura@gmail.com

'డబ్బు లేనివాడు డుబ్బుకి కొరగాడ'ని పెద్దలే అన్నారు. ఇంకోసంగతి చెప్పనా? సుఖం అనే పదార్థం డబ్బు అనే యథార్థం పక్కనే వుంటుందిరా!"

"నేన్నమ్మను. నువ్వు కోటీశ్వరుడివి కదా! నువ్వు సుఖంగా శాంతిగా ఉన్నావా? "

గతుక్కుమన్నాను. ఏం చెప్పాలో చప్పున తోచలేదు.

ఇదే ఇదివరకైతే స్వర్గసౌఖ్యాలనుభవిస్తు న్నానని గొప్పగా గర్వంగా చెప్పేవాణ్ణి. మూర్తిని హేళన చేసే వాడ్నేమో కూడా!

కానిప్పుడు భయాల పాములు పగబట్టి తరుముతోంటే తప్పించుకొచ్చిన వాడ్ని. వెన్నిచ్చి పారిపోయి వచ్చినవాడ్ని. అజ్ఞాత వాసం చేయడానికి వచ్చినవాడ్ని. ఏం సమాధానమివ్వగలను? !

"నీ దగ్గర జవాబులేదని నాకు తెలుసురా! ఎంచేతంటే ఎవర్కైనా సరే సక్రమ మార్గాల్లో అత్యధిక ధనం సంపాదించడం సాధ్యం కాదు. ఆ మధ్య లక్షలకోట్లు సంపాదించిన ఓ నాయకుడి గురించి సుప్రీంకోర్టూ అదే మాటంది. అందుకని రకరకాల మాయలు, మోసాలు, మోళీలూ చేస్తూంటారు. కానీ అంతరాత్మ మౌనంగా ఉండలేక ఎదురి తిరిగి ప్రశ్నిస్తూంటుంది. దాంతో అనుక్షణం భయాలతో, ఉద్వేగాలతో, ఒత్తిళ్ళతో సతమతమవుతూంటారు. కంటినిండా నిద్రకి సైతం నోచుకోరు!"

"అదేమోగానీ బతుకులో బాగుపడాలనుకున్న వాడెవడూ నేను మంచి వాడ్నా? చెడ్డవాడ్నా? అనెప్పుడూ ప్రశ్నించుకోడు. ప్రశ్నించుకున్న వాడెవడూ బాగుపడలేడు"

"భోంచెయ్యకుండా ఆ వాదనలేంటి? అన్నం చల్లారిపోతోంది బాబాయ్!" అంది గౌతమి.

★ ★ ★

మధ్యాహ్నపు నిద్రలేచి పెరట్లోకెళ్ళి మొహం కడుక్కున్నాను.

"బండోడి కొడుక్కి బాగోలేదని వచ్చి నాన్నని తీసుకెళ్ళారు.. అమ్మపోయాక మా నాన్న హోమియో వైద్యం నేర్చుకున్నార్లే బాబాయ్!"

"సరిసరి! అవతల బడిపంతులు. ఇవతల డాక్టరు. మధ్యలో వ్యవసాయం. మొత్తానికి మీ నాన్న అఖండుడేనే"

వేడివేడి పకోడీల ప్లేటు తెచ్చి ముందు పెట్టింది. నోట్లో లాలాజలం నూతినీళ్ళలా ఊరిపోతూంటే నూనె పదార్థాలు తినొద్దన్న డాక్టర్ హెచ్చరిక గుర్తున్నప్పటికీ ఊదుకుంటూ తినేశాను.

టీ తాగుతూ అన్నాను "ఇక నువ్వే నా ఫ్రెండ్‌వి. నువ్వేం విశేషాలు చూపిస్తే అవి చూస్తాను. ఇవాళేం చూపిస్తావు? "

"గోదావరి"

నవ్వేను. "నేను పుట్టిపెరిగింది ఈ ఊళ్ళోనే గౌతమీ!"

"ఎన్నిసార్లు చూసినా ప్రతిసారీ కొత్త అందాలతో మెరిసి పోతూంటుంది. కొత్త సోయగాలు ప్రదర్శిస్తూంటుంది. కొంగొత్త పాఠాల్ని చెబుతూంటుంది. అందుకే గోదావరంటే నాకెంతో ఇష్టం బాబాయ్! గోదావరి నా ప్రియనేస్తం!"

"అవునవును! అందుకే పొద్దుటే దారిలో ఆ తల్లి దర్శనం చేసుకున్నాను. సరే మళ్ళీ వెళ్దాం! వశిష్ఠ గోదావరిని చూసి ఆనాటి స్మృతుల్ని నెమరు వేసుకుంటాన్లే"

కాళ్ళకి చెప్పుల్లేవన్న సంగతి వీధిలోకి వెళ్ళేక తెలిసింది. ఇంట్లో ధరించే పైజమా చొక్కా ధరించినందున బూట్లు తొడుక్కోలేదు. అవి తప్ప మరేవీ తెచ్చుకోలేదు.

"చెప్పులు లేకుండా నడవగలరా బాబాయ్? "

"సమయ సందర్భాలని బట్టి నదికైనా నరుడికైనా నడక మార్చుకోక తప్పదు. ఇన్నాళ్ళూ కార్లలో తిరుగుతూ నడక మర్చిపోయాను. ఇప్పుడు మళ్ళీ కొత్తగా నేర్చుకుంటాను. పద..!"

"మరిప్పుడు ఇంత స్థాయికొచ్చారంటే, అదంతా మీ దీక్షా పట్టుదలవల్లే సాధ్యపడిందా బాబాయ్? "

అక్కడో పిచ్చివాడు రంగు రంగుల కాగితాల్ని ఏరుకుంటూ గోనెసంచిలో భద్రంగా దాచుకుంటున్నాడు. అందుకు ఎంతో మురిసిపోతూ గంతులేస్తున్నాడు. పిచ్చి ఆనందం అంటే అదేనేమో!

గౌతమిని చూసి బుద్ధిమంతుడిలా మారిపోయాడు.

ఆమె తన చేతిలోని పొట్లాన్ని వాడికందిచ్చింది. అందుకుని అందులోని పకోడీల్ని ఆబగా తినసాగాడు.

వాడి కళ్ళ నుండి కన్నీళ్ళు ధారాపాతంగా కారిపోతున్నాయి!

"వాడెవడు గౌతమీ? "

"లాటరీ పిచ్చోడు బాబాయ్! ఒకప్పుడు బాగా బతికినవాడే. లాటరీ పిచ్చి ఎలా పట్టిందోగాని పట్టింది. తిండి తినడం కూడా మాని లాటరీ టిక్కెట్లు కొనేవాడు. లక్షలూ కోట్లూ వస్తాయని ఆశపడ్డాడు. లాటరీల్లో బహుమతులు రాలేదు గానీ ఆస్తి హారతి కర్పూరమై పోయింది. చివరికిలా అయిపోయాడు. ప్రతి రంగుకాగితమూ లాటరీ టిక్కెట్టే అనుకుని భద్రంగా దాస్తూంటాడు.."

రోడ్డు వదిలి కొబ్బరి తోటల్లోంచి అడ్డదారిలోకి పడ్డాం.

"అక్కా! అక్కా!"

మామిడి చెట్టు మీంచి ఓ కుర్రాడు అరుస్తున్నాడు.

"ఒరే శీనూ! అంత చిటారుకొమ్మకు ఎందుకెక్కేవురా? జారిపడతావు జాగ్రత్త!"

"భయమేస్తోందక్కా! నన్ను దింపవూ!"

"ఆ సంగతి చెట్టెక్కే ముందు ఆలోచించుకోవాల్రా" అంటూ దిగడానికి సాయపడిందామె.

"ఈ చెట్టుకాయలు తీయగా ఉంటాయక్కా!" అంటూ జేబులోంచి రెండు మామిడికాయలు తీసి విజయగర్వంతో చూపించాడు.

"ఘనకార్యం చేశావులే" అంటూ డిప్ప మీద ఒక్కటేసింది.

"ఉప్పూకారం తెచ్చేనక్కా" నా వంక చూస్తూ అన్నాడు.

"ఇలాంటి వేషాలు చిన్నప్పుడు మేమూ వేశాంలే!" అంటూ నవ్వి ఒకముక్క తీసుకుని ఉప్పూకారం అద్దుకుని తిన్నాను.

"ఎవరబ్బాయేవిటి? "

"వడ్రంగి బ్రహ్మంగారబ్బాయి. నా చిట్టి నేస్తం. కన్పిస్తేచాలు వదలి పెట్టడు. ఏ కాయ దొరికినా, ఏ పువ్వు కోసినా వీడికి నేనే గుర్తొస్తాను. పరుగెత్తు కొచ్చేస్తాడు!"

"మా అక్క చాలా మంచిదండీ! పుస్తకాలు కొనిస్తుంది. లెక్కలు చెబుతుంది.."

"చెవులు మెలేస్తుంది! తిన్నగా ఇంటికెళ్ళిపోరా శీనూ! మధ్యలో ఎక్కడా ఆడుతూ కూర్చోకు"

బుద్ధిగా తలూపి వెళ్ళిపోయాడు.

"నీ ఫ్రెండ్ చాలా హుషారైనవాడిలా కనిపిస్తున్నాడే!" గోదావరి వైపు అడుగులేస్తూ అన్నాడు.

"శీను చురుకైనవాడే! కానీ పాపం సవతి తల్లి సరిగ్గా చూడదు. చదువు మానేసి వృత్తి నేర్చుకోమంటోంది"

"వాళ్ళ నాన్న సంపాదన బాగాలేదా? "

"ఓ మోస్తరుగా ఉంది. వీడికేమో చదువంటే పిచ్చి ఇష్టం. అక్కడికీ చదువు ఖర్చు నాన్న భరిస్తానని చెబుతున్నారు"

నేను చదువుకున్న రోజులు గుర్తొచ్చాయి. అమ్మ రూపం కళ్ళముందు మెదిలింది! మనస్సునెవరో పట్టి కుదిపినట్టుగా అదిరిపడ్డాను.

ఊళ్ళో అడుగుపెట్టిన ఎనిమిది గంటలకి మా అమ్మ గుర్తొచ్చింది!

ఏదో అపరాధ భావన నమిలేస్తోంటే అమ్మని తలచుకున్నాను.

'అమ్మ!'

మాసిన తెల్లచీర.. బక్కచిక్కిన శరీరం.. సగం నెరిసిన జుట్టు.. లోపలికి పోయిన కళ్ళు.. మెడలో కాశీతాడు.. చేతులకి సీవండి కడియాలు.. చెమటలు కారుస్తూ, అంట్లు తోముతూ, సణుగుళ్ళు భరిస్తూ..!

'అమ్మా! అమ్మా! ఎక్కడున్నావమ్మా? ! నిన్ను సుఖపెట్టాలనుకున్నాను. నీ మోములో సంతోషం, నీ కళ్ళలో మెరుపులు చూడాలనుకున్నాను. నాకోసం కొవ్వొత్తిలా కాలిపోయిన నీకు బంగారు పుష్పాలతో పూజ చేయాలనుకున్నాను. నాకా భాగ్యం దక్కనీకుండా ఎందుకెళ్ళిపోయావమ్మా? '

అడుగు ముందుకి పడలేదు. దుఃఖోద్వేగంతో ఊగిపోతూ కొబ్బరిచెట్టు మొదట్లో కూలబడ్డాను.

మనసు అడుగుపొరల్లో ఎక్కడో నిక్షిప్తమైపోయిన అమ్మ ఒక నీటిచెలమలా లోలోన ప్రవహిస్తోంది!

గౌతమి నా ముఖంలోకి తేరపారి చూసి "మీ అమ్మగారు గుర్తొచ్చారా బాబాయ్!" అనడిగింది.

ఆశ్చర్యపోయాను! మనస్సు చదివే విద్య ఈ పిల్లకి తెలుసా? అన్పించింది.

"అప్పుడప్పుడూ నాకూ మా అమ్మ గుర్తొస్తూంటుంది. గోదావరితో నా బాధ చెప్పుకుంటాను. ఓదారుస్తుంది. దాంతో ఊరట లభిస్తుంది నాకు. కుదుటపడ్డ మనస్సుతో తిరిగొచ్చేస్తాను" చెప్పింది గౌతమి.

"పద చూద్దాం! నాకూ మా అమ్మ కన్పిస్తుందేమో" అన్నాను లేస్తూ.

"తప్పకుండా కన్పిస్తుంది బాబాయ్! నది నిస్వార్థానికి ప్రతీక. మనిషి కోసం, మనిషి మనుగడ కోసం సర్వం అర్పిస్తుంది. గంగానదిని చూసే వుంటారు. తను కలుషితమవుతున్నా సరే లెక్కచెయ్యకుండా జనుల పాపాల్ని కడిగి ముక్తిని ప్రసాదించాలని పరితపిస్తూంటుంది"

"చదవాపకుండా ఉండాల్సింది. ఏ డాక్టరమ్మవో అయ్యేదానివి"

"నాన్న బాధా అదే! కానీ ఇంటినీ, నాన్న బాగోగుల్నీ చూట్టానికి ఇంకెవరున్నారు బాబాయ్? "

ఆ పిల్ల గొంతు వణికింది. "మీకిక్కడ చుట్టాలెవరూ లేరా బాబాయ్? " హఠాత్తుగా అడిగింది.

"ఉన్నారు.. కానీ ఎవరూ సరిగ్గా తెలీదు. ఎప్పుడో పీయూసీ చదివే రోజుల్లో వెళ్ళిపోయాను. మళ్ళీ ఎప్పుడూ ఇటుకేసి తొంగిచూడలేదు"

"ఊరంటే ఇళ్ళూ పొలాలే కాదుకదా బాబాయ్! స్వచ్ఛమైన గాలి, జీవనది నీరు, ప్రకృతి సౌందర్యం, కల్మషం ఎరుగని మనుషులు, ఆత్మీయతానురాగాలు, మానవ సంబంధాలు- ఒక అపూర్వ సమ్మేళనం. అలాంటి ఊరిని మళ్ళీ మళ్ళీ చూడాలనీ, కొన్నాళ్ళు అందరితో కలిసి గడపాలనీ ఎప్పుడూ అన్పించలేదా? బాల్యం మీద పరిసరాల ప్రభావం ఎక్కువగా ఉంటుందంటారే? !"

"నాలాంటి బిజినెస్ మాగ్నెట్ లకి పుట్టిన గడ్డ.. పెరిగిన ఊరూ గుర్తు చేసుకునేంత తీరిక వుండదు"

"మనుషులంత యాంత్రికమైపోతారా బాబాయ్? "

చెళ్ళున కొరడాతో కొట్టినట్టు చూశాను. ఆమె చాలా తెలివైందని అర్థమైంది.

"మీ ఇల్లు సినిమాల్లో చూపించే భవంతిలా వుంటుందనీ, ఇంటి ముందు పెద్దపెద్ద కార్లూ, ఇంట్లో బోల్డుమంది నౌకర్లూ వుంటారనీ అంతా చెప్పుకుంటున్నారు. అది నిజమేనా బాబాయ్? "

అవునంటూ గర్వంగా తలాడిస్తూ చిన్నగా నవ్వేను. ఫోజు కొట్టేను.

నా గురించి, నా ఆస్తిపాస్తుల గురించి నా ఊరివాళ్ళంతో గొప్పగా చెప్పుకుంటున్నారని తెలిసేసరికి ఎంతో ఆనందంగా, తృప్తిగా అన్పించింది. గర్వంగా ఫీల

య్యాను. స్వోత్కర్ష కాదుగానీ రియల్లీ అయామ్ ఎ గ్రేట్ మేన్! చాలా గొప్పవాడ్ని! నేల మీద పాకే స్థాయి నుంచి నింగిలోకి దూసుకుపోయాను! చుక్కల్ని అందుకున్నాను.!

"నేనిప్పుడెందుకొచ్చానో చెప్పుకోవడం లేదా?" ఆరాతీశాను- సన్నగా కంపిస్తూనే.

"ఊరుని, మా నాన్ననీ చూసెళ్ళడానికి వచ్చారనుకుంటున్నారు. నిజంగా అందు కేనా బాబాయ్?"

"ఆ..! అహ..!! జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి- అన్నారుగా!" తడబ డుతూ చెప్పేను.

ఒకవేళ నిజం తెలిస్తే? నా గుట్టు రట్టయితే? ఆ పరిస్థితి ఊహించటానికే భయమేస్తోంది!

కాలం తన కడుపులో నా కోసం ఏం దాచి వుంచిందో! అమృతమా? మరి హాలాహలమా?

గౌతమి పరుగునెళ్ళి గోదావరి గట్టెక్కి చిన్నపిల్లలా కేరింతలు కొట్టింది.

"ఇవాళ గోదావరి చాలా ప్రశాంతంగా.. ప్రసన్నంగా కనిపిస్తోంది బాబాయ్! మీరొ చ్చారనేమో..?"

"గోదావరి జీవనది. చలనం దాని సందేశం. చైతన్యం దాని సారాంశం. ప్రయోజనం దాని పరమార్థం"

నదిలోకి దిగాను. చెప్పుల్లేకుండా నడిచి నందున కలిగిన నొప్పులూ గీచుకున్న దెబ్బలూ మాయమయ్యాయి. ఎంతో చల్లగా, హాయిగా అన్పించింది.

చేతులూ ముఖమూ కడుక్కున్నాను. పవిత్రుడినయ్యానన్న భావన నా నిలు వెల్లా వ్యాపించింది.

దోసిలిపట్టి నీళ్ళు తాగాను. మనస్సు కూడా పరిశుభ్రమైనట్టు ఓ చిత్రమైన

భావన కలిగింది నాలో.

ఒడ్డున కూర్చుని నది వంక అపేక్షగా చూశాను. నీరెండ పడి మిలమిల మెరిసిపోతోంది గోదావరి.

"గోదావరి నీళ్ళు తాగి పెరిగిన వారి తీరే వేరుకదా బాబాయ్!"

"ప్రతినదీ తల్లిలాటిదే. నాగరికతను వృద్ధిచేసిందే. పాడీ.. పంటా.. బతుకూ.. సుఖం ఇచ్చిందే! కాదంటే తల్లిపాలు తాగి రొమ్ముల్ని గుద్దేవాళ్ళు ఎప్పుడూ ఉంటారు.. ఎక్కడైనా వుంటారు!"

"మీ అమ్మనీ, ఈ నదినీ, ఊరునీ, చుట్టాల్నీ, స్నేహితుల్నీ, అందర్నీ- ఆఖరికి మీ అమ్మగార్ని కూడా వదిలేసి అంత దూరం ఎందుకెళ్ళేరు బాబాయ్? "

"అదో పెద్దకథ" చిన్నగా నిట్టూర్చాను.

ఓ తెరచాప పడవ మావైపు వస్తూ కన్పించింది.

"అదిగో పడవ తాత వస్తున్నాడు. ఎన్నోకథలూ, కబుర్లూ చెబుతాడు. మా తాత బతికొచ్చి చెబుతున్నట్టే ఉంటుంది!"

"పిల్లలకి తాత, మామ్మలు ఉండటం ఓ అదృష్టం! వృద్ధతరపు ఆలోచనా ధోరణితో అనుబంధం ఏర్పడుతుంది. ఆత్మీయత పెరుగుతుంది. కానీ ఆ వ్యవస్థ పల్లెల వరకే పరిమితమైపోతోంది" నా మనుమలకు నాకు మధ్యనున్న దూరాన్ని గుర్తుచేసుకుంటూ అన్నాను.

వాళ్ళని ఒడిలో కూర్చోబెట్టుకుని కబుర్లు చెప్పేంత ఓపికా, సమయమూ నాకు లేవు. కథా.. కాకరకాయ చెప్పమని అడిగే అవసరం వారికి లేదు. టీవీలోని 'పోగో'ను మించిన ఆత్మీయులెవరూ వారికి లేరు!

పడవలోంచి నలుగురు ప్రయాణికులు దిగారు. ఇద్దరు చిల్లర ఇచ్చారు. ఒకావిడ రెండు అరటికాయలిచ్చింది.

"ఇదిగో సిట్టితల్లీ!" అంటూ తెరచాప దించేక గౌతమిని పిలిచి జామకాయ అందిచ్చాడు తాత.

"మా బాబాయి! హైదరాబాదు నుంచొచ్చాడు" అంటూ నన్ను గొప్పగా పరిచయం చేసింది.

అతడ్ని తేరపార చూశాను. గుర్తుపట్టాను. కానీ కొత్తవ్యక్తిని చూసినట్టు చూస్తుండిపోయాను.

కళ్ళపైన చెయ్యి అడ్డం పెట్టుకుని చూసి "ఎవరి తాలూకు బాబయ్యా మీరు..? " అడిగాడతను.

సంగతి బయటపడిపోతుందని గ్రహించి అన్నాను "నువ్వు ఈదిగోళ్ళ ముసలయ్యవి కాదూ? నేను చిన్నప్పుడు నదిలో మునిగిపోతే కాపాడావు? "

"ఓరి ఓరి.. తవఁరా! ఎన్నేళ్ళకి సూశాను! శానా పెద్దోరై పోయారు. సీతమ్మ గోరబ్బాయి గార్నంటే బేగీ తెలిసేది. ఏంటో? సీతమ్మ పేరెట్టుకున్నోళ్లందరికీ కట్టాలే! ఆయమ్మ బతుకంతా కట్టాలే చూసింది. బతికినన్నాళ్ళూ కట్టాల్లోనే బతికింది. సావులో కూడా కట్టవే పడింది మాతల్లి..!

నా గుండె నెవరో ఉక్కు హస్తాలతో నలిపేసినట్టు తల్లడిల్లాను.

"పట్నంలో దండిగా సంపాయించేరని ఇన్నాను. సల్లగా ఉన్నారు. అంతేశాన బాబయ్యా! ఆళ్ళింటా ఈళ్ళింటా పన్జేసి మీ అమ్మగోరు ఎన్ని అవత్తలు పడి తవఁర్ని పెంచారో తల్సుకుంటే కడుపు తరుక్కుపోద్ది. ఇంకోరూ.. ఇంకోరూ అయితే తవఁర్నొగ్గేసి ఆళ్ళదారి ఆళ్ళు సూసుకునేవోరు. ఆ సీతమ్మ తల్లి అలాటిలాటిది కాదు. సాచ్చాత్తూ సీతామాలచ్చే. కడుపు కట్టుకుని తవఁర్ని సాకింది. ఆయమ్మ కస్టమే తవఁర్నింతోర్ని సేసింది. ఇప్పుడు బతికుంటే ఎంత పొంగిపోయేదో మాతల్లి!"

అతడి మాటలకి నా గుండెల్లో దుఃఖం సుళ్ళు తిరిగింది.

"ఒకసారి గోదావర్లో పిల్లలు ఈత కొడుతుంటే ఒక కుర్రాడ్ని సుడి గుండం లాగేసిందనీ, నువ్వెళ్ళి రక్షించేవనీ చెప్పేవు. ఆ

అక్షరం

ఒక వ్యక్తిని త్వరగా అర్థం చేసుకోకపోయినా
ఫర్వాలేదు
కానీ అతిత్వరగా అపార్థం
చేసుకోవద్దు

– సర్వేపల్లి రాధాకృష్ణన్



కుర్రాడు మా బాబాయేనా? అందుకు ప్రతిగా నీకు భోజనం పెట్టి, కొత్తబట్టలు కొనిచ్చి కృతజ్ఞత చెప్పింది బాబాయీ వాళ్ళమ్మేనా? ”

గౌతమి మాటలకు తృప్తిగా నవ్వేడు తాత. నాకు మాత్రం ఒళ్ళంతా చీమలు పాకినట్టుగా ఉంది. అసహనంగా చూశాను.

“ఈరేనమ్మా! జుట్టు అందబట్టి ఈడ్చుకు రాగలిగేను గానీ లేపోతే సుడిగుండం లోంచి బయటపట్టమంటే మాటలు కాదు. కొడుక్కి పేణాలు పోశానని ఆయమ్మ అప్పుసేసి మరీ కొత్తపంచె కొనిపెట్టింది. సచ్చి ఏలోకానుందో గానీ తల్లి అంటే ఆయమ్మనే సెప్పుకోవాల. ఆయాల నన్నెంత పొగిడిందో ఈర్ని గుండెలకి అత్తుకుని ఎంతేడ్సిందో ఆ భగమంతుడికే తెలవాల! ఈరికేవన్నా అయ్యుంటే గోదార్లో పడేదాన్నని ఒకటే ఏడుపు ఏడ్సింది. సిన్న ఒయుసులోనే పెనిమిటి పోయాడు. కొడుకూ పోతే ఇంకేం సూసుకొని బతుకుద్దీ!”

పడవెక్కి గోదావరి మధ్యలోకెళ్ళాం.

సూరీడు పడకటింటికి వెళ్ళిపోయాడు. మెల్లగా చీకటి తెరలు ఆకాశం నుంచి దిగుతున్నాయి. తిరుగుముఖం పట్టాం.

మూర్తి మాటలూ, గౌతమి ప్రశ్నలూ, ఈ ముసలోడిలాటి వాళ్ళ కబుర్లూ చాలా ఎంబ్రాస్సింగా ఉండేట్టున్నాయి. సాధ్యమైనంత త్వరగా ఈ ఊర్నించి, ఈ మనుషుల నుంచి దూరంగా వెళ్ళిపోవాలి. అయినా రేపటెల్లుండుకి అన్నీ సర్దుకుపోతాయిలే. సమస్యలన్నీ ఊదేసినట్టు చెదిరిపోవడమూ ఖాయమే! మనిషి జీవించేది ఉచ్ఛ్వాస నిశ్వాసలతో మాత్రమే కాదు.. రేపటిపై తమ మదిలో వెలిగించుకున్న ఆశల దీపాలతో కూడా!

★ ★ ★

ఇంటి ముందు ఆరుబయట కూర్చున్నాం మూర్తీ, నేనూ. ఎనిమిదింటికే ఊరికి నిద్రముఖం పడింది.

వెంకటస్వామి, గోపీ వచ్చారు. వాళ్ళిద్దరూ నా బాల్యమిత్రులే! నేనొచ్చానని తెలిసి వచ్చారు.

వెంకటస్వామి పని బాగుంది. ఊళ్ళోనే రైస్‌మిల్ కట్టాడు. రైస్‌మిల్ కట్టేప్పుడు లైసెన్సుల కోసం సాయం అర్థిస్తూ నా దగ్గరికొచ్చాడు. బ్రోకర్లకి చెప్పి ఏ ఆటంకం లేకుండా పనయ్యేట్లు చూశాను. అందుకే నేనంటే ఎంతో కృతజ్ఞత ప్రదర్శిస్తున్నాడు. బాగా సంపాదించాట్ట.

గోపి టైలరు! నాలుగో తరగతిలోనో, అయిదో తరగతిలోనో చదువు మానేసి మస్తాన్ టైలరు దగ్గర కాజాలు కుట్టే పనిలో చేరాడు. తర్వాత్తర్వాత తనూ టైలరయ్యాడు. కానతడి పని అంతంత మాత్రంగానే ఉందిట!

గోపితో ముక్తసరిగా మాట్లాడినా, వెంకటస్వామితో కాస్తెక్కువగానే మాట్లాడాను.

అతడు అధికారపార్టీకి చెందిన స్థానిక నాయకుడని తెలిశాక మరింత ఆప్యాయంగా మాట్లాడాను.

ఇంతలో ఒకడు కడుపునొప్పి అంటూ వచ్చాడు. అతడ్ని వీధి అరుగు మీది వసారాలోకి తీసుకెళ్ళాడు మూర్తి. వివరాలు కనుక్కుని హోమియో మాత్రలిచ్చాడు.

"మొత్తానికి డాక్టరుగా కూడా అవతారమెత్తేవన్న మాట!"

"ఏదో కేటలాగు వైద్యం రా! సమయానికి వైద్యసహాయం అందక మీ చెల్లెలు కన్నుమూసింది. డాక్టరు లేనిలోటు తీర్చలేకపోయినా కనీసం ఊరివాళ్ళకి ఉడతాభక్తిగా సాయం చెయ్యాలని హోమియో వైద్యం నేర్చుకున్నాను"

"ఊళ్ళో డాక్టరు లేడా? "

"ఆచార్యులుగారు బతికున్నంతకాలం బాగానే వైద్యంచేశారు. ఆయన పోయాక, ఆయన సంతానమెవరూ ఈ వృత్తిలోకి రాలేదు. ఉద్యోగాలకెళ్ళిపోయారు. అప్పిచ్చువాడు, వైద్యుడు, ఎప్పుడూ పారే ఏరూ, ద్విజుడూ ప్రతి ఊరికీ అవసరమని, అవి లేని ఊళ్ళో ఉండనేకూడదని సుమతీ శతకకారుడు ఎందుకన్నాడో బాగా తెలిసొస్తోందనుకో!"



చిన్నప్పుడెప్పుడో చదివిన నీతిపద్యం వెనుక ఎంత జీవితానుభవం!

నా రాక గురించి తెలిసి మా పెదనాన్నల అబ్బాయిలు రం గడూ, సూరన్నా వచ్చారు. ఆప్యాయత ఒలకబోశారు.

ఒకప్పుడు అమ్మ పనిమనిషిగా మారి కుటుంబ గౌరవం మంట కలుపుతోందని కోప్పడి, ఈసడించింది వీళ్ళ తల్లిదండ్రులే! నేను చిరిగిన బట్టలు తొడుక్కుంటే 'పోస్టాఫీస్' అంటూ అందులో వేలుపెట్టి, కన్నం పెద్దది చేస్తూ హేళన చేసింది వీళ్ళే!

అవన్నీ మర్చిపోయి నంగనాచుల్లా మాట్లాడారు. వాళ్ళిళ్ళకి భోజనానికి రమ్మని ఆహ్వానించి వెళ్ళారు.

"ఏవిట్రా అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు? మీ అమ్మ గుర్తొచ్చిందా? "

"ఊс! అమ్మని హింసించిన వీ ళ్ళ గురించే ఆలోచిస్తున్నాను. మా రంగడూ, సూరన్నా ఎంతటి అవకాశవాదులో చూడు మూర్తీ! మా అమ్మని హీనంగా చూసి, మా ఆస్తి కాజేసి, ఇవాళ పత్తిత్తుల్లా కబుర్లు చెబుతున్నారు. అవాళ అమ్మ చని

వారూ లేరు. అయినా రెండు ముద్దలు పెట్టారు. అంతకంటే ఎక్కువ ఎందుకు చెయ్యాలి చెప్పు? "

"వాళ్ళకి చిన్నమ్మ అవుతుందిరా! అడ పాదడపా నేనూ వాళ్లకు డబ్బు పంపించాను గానీ ఊరికే ఊడిగం చెయ్యమన్లేదుగా! అయినా అంత రాక్షసంగా ప్రవర్తించారంటే ఏమనుకోవాలి? "

"పేగుతెంచుకు పుట్టిన కొడుక్కే కన్నతల్లి మీద మమకారం లేకపోయింది! మరే బంధమూ కన్పించకుండా పోయింది! ఇహ ఇతరులకెందుకు కన్పిస్తుంది? అసలెందుకు కన్పించాలి? "

"మూర్తీ!" ప్రాన్పడిపోతూ అరిచాను.

మూర్తి- నా ప్రియమిత్రుడు. వాడు నాగురించి అంత కఠినంగా, దారుణంగా మాట్లాడతాడని కలలో కూడా నేను ఊహించలేదు!



పోయినప్పుడు నువ్వూ, ఊరివాళ్ళూ తలోచెయ్యీ వేశారు గానీ, వీళ్ళెవరైనా ముందుకొచ్చారా? శవం కంపు కొడుతున్నా నాలుగు అగరొత్తులు వెలిగించిన పాపాన పోలేదు!"

"ఎందుకు రావాలి? ఎందుకు చేయాలి? "

"మూర్తీ!" నిర్ఘాంతబోయాను. "నువ్వేనా అలా మాట్లాడుతోంది? "

"నేనేరా! నా కళ్ళల్లోకి సూటిగా చూసి చెప్పు. మీ అమ్మ ఆరోగ్యం దెబ్బతింది. మంచం పట్టింది. సేవ చేసేవారూ, చూసే

"నిజమెప్పుడూ నిష్ఠూరంగానే ఉంటుందిరా వేణూ! మీ అమ్మ మంచం పట్టిన సంగతి నీకు తెలీదూ? ఆమె పరిస్థితి దారుణంగా వుందనీ, వచ్చి తీసుకెళ్ళి వైద్యం చేయించమనీ నేను ఉత్తరాలు రాయలేదూ? మరెందుకు నువ్వు రాలేదు? తల్లికంటే సంపాదన ఎక్కువైపోయింది!"

"అదికాదురా! అప్పుడు.. అప్పుడేదో.

కొత్త బిజినెస్ స్టార్ట్ చేశాం! ఆ బిజీలో..!"

"అదే చెబుతున్నాను. తల్లికంటే ధన సంపాదన ముఖ్యమనుకుని తల్లిని నిర్లక్ష్యం చెయ్యడం తప్పుకాదు. కానీ అయినవాళ్ళామెని ఆదుకోకపోవడం ఘోరతప్పిదంగా నీకు కన్పిస్తోంది! ఒక్కసారి ఆత్మవిమర్శ చేసుకోరా వేణూ! మన విషయంలో ప్లీడర్లానూ ఇతరుల విషయంలో జడ్జీలానూ వ్యవహరించొద్దు!"

"ఒక ముసలావిడ చనిపోయిందని చెప్పి చేతిలోని పనులన్నీ ఎక్కడివక్కడ వదిలేసి పరుగు పరుగున వచ్చేయ్యాలంటావు? " కోపంగా అరిచినట్టుగా అన్నాను.

"చనిపోయింది ముసలావిడ కాదురా! నిన్ను కన్నతల్లి! నీకీ జన్మ ఇచ్చిన మూల విరాట్టు! అమ్మ అంత గొప్పది కాబట్టే సంసార బంధనాలను తెంచుకున్న సన్యాసి కూడా అమ్మ మరణిస్తే అంత్యక్రియలకి వెళ్ళొచ్చని ధర్మశాస్త్రం ఘోషిస్తోంది. ఆది శంకరులవారు తన తల్లి మరణిస్తే స్వయంగా వెళ్ళి అంత్యక్రియలు నిర్వహించారు. తెలుసా"?

"పిచ్చి సెంటిమెంట్ల కోసం డబ్బుని కాలదన్నమంటావ్? అదేనా నువ్వు చెప్పేది? "

"డబ్బుకన్నా విలువైనవి, ముఖ్యమైనవి చాలా వున్నాయిరా! ఆ సంగతి నువ్విప్పటికైనా గ్రహిస్తే మంచిది. ఎంత పండినా కూటికే, ఎంత వుండినా కాటికే"

కుతకుత ఉడికిపోయాను.

మాకొద్ది దూరంలో గౌతమి పుల్లతో బుల్లిగొయ్యి తవ్వి అందులో చిల్లర డబ్బులు పాతుతూ కన్పించింది.

మూర్తి మీది కోపాన్ని ఆమె మీదకి మళ్ళించాను.

"అదేం పిచ్చిపని గౌతమీ? "

"గుప్పెడు వడ్లు జల్లితే కుంచెడు ధాన్యం ఇస్తాయి వరి మొక్కలు. పట్టెడు డబ్బు బిళ్ళల్ని పాతితే కనీసం గుప్పెడు గింజలైనా ఇవ్వవా అని నాటుతున్నాను"

"నీకేమైనా మతిపోయిందా? "

"పోనీ మీరు సంపాదించిన వజ్రవైడూర్యాల్ని పొలంలో వెదజల్లితే ఒక్క ముద్దకు సరిపడా తిండిగింజలు మొలుస్తాయేమో చూద్దామా బాబాయ్? "

"ఏవిటా మతిలేని మాటలు? నాణేలూ వజ్రాలూ.. విత్తనాలు కాదు మొక్కలు రావడానికి? "

"మనిషి ఆకలి తీర్చగలిగేవి తిండిగింజలే బాబాయ్! అవి ఉత్పత్తి చెయ్యలేని డబ్బెందుకు? వజ్రవైడూర్యాలెందుకు? అయినవాళ్ల అతీగతీ చూసేంత తీరిక, ఓపిక లేనంతగా డబ్బు వెంట, ఐశ్వర్యం వెంట పరుగెత్తారు. ఆ డబ్బుతో వంద రకాల అన్నం కూరల్ని కొనుక్కోగలరు. కానీ అవన్నీ తినగలరా? తిని అరగించుకునే ఆరోగ్యం ఉందా? కనీసం కంటి నిండా నిద్రపోగల్గుతున్నారా? "

పిచ్చిగా చూస్తుండిపోయాను నేను. ఆమె ఒక్కో ప్రశ్నా మెదడులో చిరుబాంబై విస్ఫోటిస్తోంది!

"అన్నట్టు అలెగ్జాండరు కథ మీకు తెలుసా బాబాయ్? "

ఉండేలు దెబ్బ రుచి తెలీని పక్షిపిల్ల.. జీవితపు ఆటుపోటుల్ని ఎదిరించి ఎంతో ఎత్తుకి ఎదిగిన నాకు పాఠాలు చెప్పాలని చూస్తోంది! ఉక్రోషం తన్నుకురాగా నుదురు చిట్లించి విసుగ్గా చూశాను.

"జగజ్జేత అలెగ్జాండర్ తన చివరి రోజుల్లో ఓ చిత్రమైన కోరిక కోరాడు. మనిషి మరణించినప్పుడు అతని రెండు గుప్పిళ్లూ మూయడం వారి సంప్రదాయం. అయితే తన చేతుల్ని అలా మూయవద్దన్నాడు. తెరిచే ఉంచమన్నాడు. ప్రపంచాన్ని జయించిన తను తనతో ఏమీ తీసుకుని పోలేదన్న సత్యాన్ని ప్రపంచానికి తెలియనివ్వమన్నాడు"

నిర్ఘాంతపోయాను. ఆలోచనలతో ఉక్కిరిబిక్కిరయ్యాను.

"అశోకవనంలో సీతలా కూర్చున్నా వేంట్రా? " మూర్తి అన్నాడు నావేపు అదోలా చూస్తూ.

తల విదిలించాను. రాని నవ్వు పెదాల మీదకి తెచ్చుకుంటూ అన్నాను "నేన్నీ కంటికి సీతమ్మోర్లా కన్పిస్తున్నానా? "

"అక్షరాలా! లోకంలో బంగారు లేడి ఉండదని తెలుసు. అయినా బంగారు లేడి కన్పించేసరికి ఆశపడింది.. ఆత్రపడింది! సొంతం చేసుకోవాలనుకుంది. పట్టి తెమ్మని నాథుడ్ని తరిమింది. అతడి కోసం రక్షకుడు లక్ష్మణుడ్నీ పంపింది. రావణుడి పన్నాగంలో ఇరుక్కుంది. తనకీ, తనవారికీ కష్టాలు కొనితెచ్చింది. అశోకవనంలో జుట్టు విరబోసుకుని విలపిస్తూ కూర్చోవల సిన దుస్థితి దాపురించింది. ఎవరికి? ఒక మహారాజుకు కూతురూ, ఇంకో మహా రాజుకు కోడలూ, మరో యువరాజుకు పత్నీ అయిన సీతకి! తృప్తిలేనప్పుడు, అత్యాశకు లోబడినప్పుడు ఎవరి పరిస్థితి అయినా అంతేరా!"

"ఇదంతా మాయలేడి వల్లే నంటావ్!"

"మాయలోళ్ళ వెంట పరుగెత్తే వారం దరి పరిస్థితీ అలాగే అవుతుందని వాల్మీకి మహర్షి భావం! హెచ్చరిక!"

"ఒకసారి అలా బయటికొచ్చి చూడు, ప్రపంచం ఎంత విశాలమో తెలుస్తుంది" హేళనగా నవ్వుతూ అన్నాను.

"లోకం నాకు తెలీదనుకోకు! బతుకు నేర్పేవాడే బడిపంతులని నువ్వు తెలుసుకో చాలు!" అని వెళ్ళిపోయాడు మూర్తి.

ప్రశాంత ప్రకృతి మధ్య రగులుతున్న రాక్షసిబొగ్గులా ఉండిపోయాను!

అసల్నాకీ కోపం, ఆవేశం, ఉద్రేకం, భుజాలు తడుముకోవడం - ఇవ్వన్నీ ఎందుకు? ఇప్పుడేం జరిగిందని?

ఇంతదాకా నాకు ఎలాంటి ఘోరమూ జరగలేదు, మరెలాటి ప్రమాదమూ సంభ వించలేదు. నేనంటే అతిగా రియాక్టవు తూండొచ్చు. వీళ్ళకేవయ్యింది? అసలు నా గురించి ఏమనుకుంటున్నారు వీళ్ళంతా?

కంటిసైగతో వీళ్ళనీ, ఈ ఊరినీ శాసిం చగల శక్తిమంతుడ్నని వీళ్ళకి తెలీదూ?

వ్యాపారంలో సంభవించిన కొన్ని అనూహ్య పరిణామాల వల్ల నా పరిస్థితి కొంచెం డౌన్‌లో ఉంది. అందుకని తాత్కా లికంగా పలాయనం చిత్తగించాను. ప్రమాదం వచ్చినప్పుడు తాబేలు డొప్పలో తల దాచుకున్నట్టు ఇక్కడికొచ్చి తలదాచు కున్నాను. అంతే! ఆ మాత్రానికే వీళ్ళకి లోకువైపోయానా! లేకపోతే వీరి కబుర్లు వినాల్సిన కర్మ నాకేంటి? !

జానేదేవ్ అనేస్తే? వద్దొద్దు! తొందర పాటు మంచిది కాదు. ఇంకో రెండ్రోజుల్లో అంతా క్లియరైపోతుంది. అప్పుడు చెబుతా వీళ్ళపని. ఒట్టి శాడిస్ట్ ఫెలోస్!




**పూ**ర్వకాలపు పందిరిమంచం మీద తెల్లని దుప్పటి పరచి ఉంది. బూరుగు దూది పరుపు కాబోలు మెత్తగా ఉంది.

మంచినీళ్ళ చెంబు, గ్లాసు పెట్టి వెళ్ళిపో యింది గౌతమి.

ఏవిటో ఈమధ్య నిద్రపట్టని రాత్రులు, నిద్రలేని రాత్రులు ఎక్కువైపోతున్నాయి! నిద్రమాత్ర మింగాను.

ప్రపంచ వ్యాప్తంగా ప్రతిరోజూ కొన్ని కోట్ల నిద్రమాత్రలు అమ్ముడవుతున్నా

యట! అంటే ప్రతిచోటా నాలాటి వాళ్ళెక్కు వయ్యారన్న మాట!

బహుశా ఒత్తిడి, ఆరాటం, డిప్రెషన్, ఓటమి భావన, కబళించే భయం - కారణాలేమో!

సముద్రం పిచ్చెక్కినట్టు అల్లకల్లోలంగా ఊగిపోతోంది. కసితో ఉప్పొంగిపోతూ బుసలు కొడుతోంది.

అయినా లెక్కచేయకుండా చిన్న పడవలో జోరుగా సాగిపోతున్నాను. అలల్ని చీలుస్తూ ముందుకు దూసుకుపోతున్నాను. అల్లంత దూరాన పచ్చని దీవి.. మణిమాణిక్యాల దీవి.. వెలుగుల దీవి.. స్వర్గం లాంటి దీవి!

ఊరిస్తోంది. సూదంటు రాయిలా ఆకర్షిస్తోంది. రారమ్మని పిలుస్తోంది.

నా దృష్టంతా ఆ లక్ష్యం మీదే ఉంది. ఎలాగైనా అక్కడికి చేరుకోవాలి. దీవిని ఆక్రమించాలి. దానికి తిరుగులేని మహారాజుని కావాలి!

పడవ వేగం పెంచాను. ఇంకా.. ఇంకా.. పెంచాను.

పడవ తేలిపోతోంది. ఒరిగిపోతోంది. అయినా లెక్కచెయ్యలేదు. గమ్యం కనుచూపు మేరలోకొచ్చింది. మహోత్సాహంతో తీరం తాకే క్షణం కోసం ఉత్కంఠతో ఎదురుచూస్తున్నాను.

హఠాత్తుగా ఈదురుగాలులు లేచాయి. సుడిగాలులు పుట్టాయి. అలల తాకిడికి పడవ ఉవ్వెత్తున లేచిపడుతోంది.

కక్ష కట్టినట్టు విరుచుకుపడుతున్న ప్రకృతిని మాడ్చేసేలా చూశాను. సవాలు విసిరాను. ఎలాగైనాసరే ప్రకృతిని జయించాలి. సర్వశక్తుల్నీ కేంద్రీకరించాను.

తెరచాప టపటపా కొట్టుకుంటోంది. పడవకి అమర్చిన మోటారు బిగ్గరగా రొదచేస్తోంది.

తెడ్డు- మైగాడ్! నా పడవకి తెడ్డు లేదేమిటి? ఏమయ్యింది? ఇప్పుడు దీన్నెలా కంట్రోలు చెయ్యడం? అడ్డదిడ్డంగా దూసుకుపోతోంది? ఎలా? ఎలా?

ఓ గాడ్! గాలి దిశ మారింది. వర్షం మొదలయ్యింది. ముందు తెరచాప దించాలి ఎలా?

అయ్యో! తాడు ముడి ఊడి రావట్లేదు. పాడు గాలి పడవని ఊపేస్తోంది. తెరచాప పడవని పక్కకి లాగేస్తోంది!

ఎలా! ఇప్పుడేం చెయ్యడం? కిం కర్తవ్యం? పడవని కంట్రోలు చెయ్యడం సాధ్యం కావట్లేదు! పోనీ దూకేస్తే? హమ్మో! మహోగ్రంగా ఉంది సముద్రం! అరెరె..! పడవ తిరగబడిపోతోంది. నేను సముద్రగర్భంలోకి కూరుకు పోతూ..!

"అమ్మో!" అదిరిపడి లేచాను.

గుండెచప్పుడు కర్ణకఠోరంగా విన్పిస్తోంటే భయం భయంగా చుట్టూ చూశాను.

నేను క్షేమంగా ఉన్నాను. సముద్రం లేదు. పడవ లేదు. దీవీ లేదు! అదంతా కల! గాఢంగా నిట్టూర్చాను.

అవునూ! అంత భయంకరమైన కల వచ్చిందేవిటి చెప్మా? అది నా భవిష్యత్ సూచిక కాదుకదా?

లేచి చెంబుడునీళ్ళు గటగటా తాగేశాను. ముచ్చెమటలకు బనీనంతా తడిసి ముద్దయ్యింది. విసుక్కుంటూ లేచాను.

ఓ పక్క మూర్తి, మరోపక్క గౌతమీ నిద్రపోతున్నారు.

ఎంత ప్రశాంతంగా, గాఢంగా నిద్రపోతున్నారు! అలా నిద్రపోగలగటం కూడా నిజంగా ఓ వరం!

గౌతమి పెదాల మీద మెరుస్తోన్నది చిరునగవే కదూ? తీపి కలలు కంటోంది కాబోలు! గుండె గడపకు ఆశల తోరణాలు కట్టుకుని తన మనః ప్రాంగణంలో అడుగిడబోయే పురుషుని అస్పష్ట ఆకృతికి రంగులు అద్దుతోంది కాబోలు!

మూర్తిగాడు గుండెల మీద చేతులుంచుకుని మరీ నిశ్చింతగా నిద్రపోతున్నాడు

# ఆ పూలు బంగారం కన్నా విలువైనవి!




పువ్వులంటే ఆడవాళ్ళకెంతో ఇష్టం. పూజలో వాడతాం. అలంకరణల్లోనూ ఉపయోగిస్తాం.

★ సౌత్ అమెరికాలోని అతిపెద్ద పువ్వు నుంచి కుళ్ళిన మాంసం వాసన వస్తుంది. దానికి 'శవ పుష్పం' అని పేరు. కొన్నిరకాల పురుగులు ఆ వాసనకు ఆకర్షితమై పువ్వులపై వాలి పుప్పొడి వెదజల్లడంతో వాటి సంతతి అభివృద్ధి చెందుతోంది.



★ 16వ శతాబ్దంలో యూరప్‌లో తులిప్స్ పూల విలువ బంగారం విలువ కన్నా అధికంగా ఉండేది.

★ ప్రపంచంలో పువ్వే కూరగాయగా అయినది బ్రోకలీ ఒక్కటే!

★ ఒక మిల్లిగ్రాం వయాగ్రా కలిపిన నీటిలోని పువ్వులు వారం రోజుల పాటు తాజాగా ఉంటాయి.

★ రోమన్స్ ఏస్టర్ పూలని దెయ్యాలని పారద్రోలడానికి కాల్చేవారు.

★ గౌస్‌ప్లాంట్ పూలనుంచి రాత్రి వెలువడే వాయువు దగ్గర నిప్పు నుంచితే అది మండుతుంది.

★ యూరప్‌లో అనేక శతాబ్దాలు ఏంజెలికా పువ్వుని, బ్యుబోనిక్ ప్లేగ్ నుంచి అజీర్తి వరకు అనేక రోగాల చికిత్సలో వాడేవారు.

★ ప్రాచీన కాలంలో బ్లూబెల్ పువ్వుల రసంతో జిగురుని చేసేవారు.

★ ఎగేవ్ అనే చెట్టు చాలా ఏళ్ళు పుష్పించకుండా ఉండి, అకస్మాత్తుగా ఒకే ఒక పువ్వు పూసి చచ్చిపోతుంది. దీనికి సెంచరీ ప్లాంట్ అనే ముద్దు పేరుంది.

చూడు! భార్య లేదు.. సంపద లేదు.. కారు లేదు.. మేడ లేదు.. బ్యాంకు బ్యాలన్స్ లేదు.. పైపెచ్చు గుండెల మీద కుంపటిలా పెళ్లికెదిగిన కూతురుంది! అయినా చీకూచింతా లేనట్టు గుర్రు పెడుతున్నాడు!

పూర్ ఫెలో! ఆనందించడం అనుభవించడమే జీవితమని తెలీని అమాయకుడు! బావిలోని కప్ప!

దొడ్డి తలుపు తీసుకుని పెరట్లోకెళ్ళాను. కీచురాళ్ళ ధ్వనీ, కుక్కల అరుపులూ తప్ప మరేమీ విన్పించట్లేదు. బయటి లైటువేసి జేబులోంచి సెల్ తీశాను. పెద్దబ్బాయికి చేశాను. లిఫ్ట్ చెయ్యలేదు. చిన్నవాడికి చేశాను.

"అక్కడి పరిస్థితెలా ఉంది ధనేష్? "

"జడ్జి గరంగానే ఉన్నాడు. కేసు రేపటికి వాయిదా వేశాడు. చాలామంది ఖాతాదారులకు డిపాజిట్ సొమ్ములు వాపస్ చేశామంటూ మనం దాఖలు చేసిన రశీదులన్నీ పరిశీలిస్తున్నారు.."

నోటి తడారిపోయింది.

"అవన్నీ ఎందుకు తవ్వనిస్తున్నార్రా? "

"నిజానివో? నకిలీవో? చెక్ చెయ్యమన్నారు"

"మైగాడ్! మన ప్లీడరేమంటున్నాడు? "

"ఏం ఫరవాలేదు! ధైర్యంగా ఉండమన్నాడు. అవసరమైతే హైకోర్టులో రివిజన్ పిటీషన్ వేద్దామంటున్నాడు"

"ఇక్కడ ఓడిపోతామా? " కంపిస్తూ కీచుస్వరంతో అడిగాను.

"అహ! అలాగని కాదు! ఖాతాదారులు పేపర్లకెక్కి గోలచేస్తున్నారు"

"గొడవ చేస్తోన్న లీడర్లని కొనెయ్యలేకపోయారా? "

"ఆ ప్రయత్నమూ చేస్తున్నాం. ఇంకొద్ది

రోజుల్లో ఎలాపోలా సెటిల్ చేసేస్తాం! మీరక్కడే ఉండండి! మీరు బయటపడితే ప్రమాదం"

నిస్త్రాణగా గోడకి జేరబడి కూర్చుండిపోయాను. కన్నీళ్ళు ఉబికి వచ్చాయి. అతి కష్టం మీద నిగ్రహించుకున్నాను.

ఏదోటి చెయ్యాలి! ఏదో మంత్రం వెయ్యాలి! కష్టమర్ల నోళ్ళు మూయించాలి!

ఎలా? అదెలా సాధ్యం? తల పగిలిపోయేలా ఆలోచించాను. ఒక్కటంటే ఒక్క 'దారి' దొరకలేదు.

బీపీ పెరిగింది. చటుక్కున లేచి లోపలికెళ్ళి బీపీ టాబ్లెట్ వేసుకుని పడుకున్నాను.

నిద్రాదేవి కరుణించలేదు- మింగిన స్లీపింగ్ పిల్ ఏమైందో మరి!

> **కొత్తగాలి...**
>
> **జీవితమంటే**
> **సాగుతున్న మరణం!**
> **మరణమంటే**
> **ఆగిపోయిన జీవితం!**
>
> *– అయినాల కనకరత్నాచారి,*
> కొరిశపాడు, ప్రకాశం జిల్లా

ఆరింటికే లేచి పేపర్ మీద పడ్డాను. మా సంస్థలోని గొడవలు గురించిన వార్తల కోసం భూతద్దపు కళ్ళతో అంతా వెదికాను.

"నాకన్ని న్యూస్‌పేపర్లూ కావాలి. దొరికితే ఇంగ్లీషువి కూడా!" మూర్తితో చెప్పాను.

"మనూరి లైబ్రరీకొస్తాయనుకో! అక్కడికి నువ్వేం వెళ్తావులే! ఓ కుర్రాడ్ని మల్కిపురం పంపించి తెప్పిస్తాన్లే గానీ, వార్తలు టీవీలో చూడొచ్చుగా వేణూ!" అన్నాడు మూర్తి.

"అదీ చూస్తాన్లే! కొన్ని అర్జెంటు బిజినెస్ వివరాలు కావాలి! అందుకనీ.."

"సమస్యలేమైనా వచ్చిపడ్డాయా? " సాలోచనగా చూస్తూ అడిగాడు.

"వ్యాపారమన్నాక ఆటుపోట్లు తప్పవు. ఒక్కోసారి వాటిని భరించలేక ఆ ప్రెషర్ తగ్గటానికి కొన్నాళ్ళు ఎక్కడైనా ప్రశాంతంగా గడపడానికి వెళ్తూంటాం! కొందరు సింగపూర్, మలేసియా, బ్యాంకాక్‌లకి ప్లెజర్ ట్రిప్స్ వేసుకుంటారు. మరికొందరు ఊటీ, గోవా, సిమ్లాలాంటి ప్రదేశాలకెళ్ళి సేదదీర్తారు. నేనిలా వచ్చాను. దట్సాల్!"

అపనమ్మకంగా చూశాడు.

మరో గంటకల్లా అయిదారు పేపర్లు వచ్చిపడ్డాయి. వాటిని తీసుకుని గదిలో కెళ్ళిపోయాను.

కొన్నిట్లో మా ఫైనాన్స్ కంపెనీ గురించి రకరకాలుగా రాశారు. మా టేకుచెట్ల పథకం, గొర్రెల పెంపక పథకం.. వగైరా పథకాల ముందున్న అత్యాశనీ, వెనుకనున్న మోసాన్నీ దుయ్యబట్టారు. ఇలాటి ఉచ్చులో పడవద్దని ప్రజల్ని హెచ్చరించారు. వీటిని ప్రభుత్వం నియంత్రించకపోతే లక్షలాదిమంది ఇన్వెస్టర్లు మోసపోయే ప్రమాదముందనీ పేర్కొన్నారు.

మరో పత్రిక ఇంకో అడుగుముందుకేసి 'రాణి హౌసింగ్ అండ్ రియల్ ఎస్టేట్ కంపెనీ' ఓ మోసాల పుట్ట అంటూ రియల్ ఎస్టేట్స్ గురించి ఘాటుగా రాసింది.

ఫోర్జరీ పత్రాల ద్వారా భూమిని కబ్జా చేసి ఇళ్ళస్థలాలుగా అమ్మేరని పేర్కొంది. అపార్ట్‌మెంట్ల నిర్మాణానికి బ్యాంకులో అప్పుతీసుకుని అవి అమ్మగా వచ్చిన సొమ్ముని బ్యాంకులకు చెల్లించకుండా అటు కొనుగోలుదార్లనీ, ఇటు బ్యాంకుల్నీ ముంచారంది. ఫ్లాట్లు కట్టిన స్థలం బ్యాంకులకి తనఖా పెట్టినందున కొనుగోలుదార్లకి రాసిచ్చిన అమ్మకపు పత్రాలు చెల్లకుండా పోయే ప్రమాదముందనీ పేర్కొంది.

అన్నీ నిజమే! కానీ ఎలాపోలా తిమ్మిని బమ్మిని చేసి, అవన్నీ అబద్ధమని రుజువు

చేయాలి. చేయగలమా? అన్నదే పెద్ద ప్రశ్న! అంతకంతకీ ఊబిలోకి కూరుకుపో తున్నట్టుగా ఉంది!

కోర్టులోనూ, బయటా ఏం జరుగు తోందో ఉన్నదున్నట్టుగా చెప్పేదెవరు?

ఓంకారం గుర్తొచ్చాడు. అతడు నా పార్ట నరే కాదు, వియ్యంకుడు కూడా! మా అమ్మాయిని వాళ్లబ్బాయికిచ్చాం.

ఫోన్ చేశాను. లక్కీగా దొరికాడు.

"సిట్యుయేషన్ ఎలా ఉంది? "

"చాలా బేడ్‌గా ఉంది బావగారూ! మీరింత బేడ్‌గా ఎలా మిస్‌హేండిల్ చేశారో? అర్థం కావట్లేదు. హౌసింగ్ ప్లాట్లూ, అపార్ట్‌మెంట్లూ అమ్మకూడదని కోర్టు ఉత్తర్వులిచ్చింది. మన దగ్గర అప్పు తీసుకున్నవాళ్ళు తిరిగి చెల్లించడం లేదు. రెగ్యులర్‌గా చెల్లించేవాళ్ళు కూడా స్టాప్ చేసేశారు. ఏం జరుగుతుందో చూద్దామని గోతికాడి నక్కల్లా కాచుక్కూర్చున్నారంతా! చాలా బేడ్‌గా ఉంది బావగారూ! ఈ గందరగోళానికి కారణం మీరే! ఎంతో తెలి వైనవారు.. మీరింత బేడ్‌గా ఎలా చేశారు బావగారు? ఇన్ని చిక్కుముళ్ళెందుకు వేశారు? "

"నన్ను ప్రశ్నిస్తారేవిటి? అంతా కలిసే, అన్నీ తెలిసే నిర్ణయాలు తీసుకున్నాంగా!"

"అయినా ఎండీ మీరే కదా! బాధ్యత మీదే కదా! తగిన ప్లానింగ్ అనుసరిం చాల్సింది.. కంపెనీ భవిష్యత్తు చూడాల్సింది మీరేగా! మీ వల్ల, మీ దుందుడుకు చర్యల వల్ల మాకు లాస్ వస్తోంది. పరువు పోతోంది.."

చలిపిడుగు మీద పడ్డట్టు కూలబడిపో యాను. రకరకాల భయాలు కారుమే ఘాల్లా కమ్ముకొస్తోంటే చేష్టలు ఉడిగి చతి కిలబడిపోయాను.

నేను భయపడుతున్నట్టే నన్ను 'టార్గెట్' చేస్తున్నారన్నమాట! అంతా చేతులు కలిపి తెలివిగా తప్పుకుని నన్ను బలిపశువుని చెయ్యబోతున్నారా? !

వెన్నులో భయం పాము జరజరా పాకింది.

కంపెనీలో అత్యధిక షేర్లు మావే! కంపెనీ కార్యకలాపాలకి రూపకల్పన చేసిందీ, నిర్వహించిందీ నేనే! కంపెనీ వైఫ ల్యానిక్కారణం మాత్రం మా అందరి దురాశ!

లాభాల్ని రెండు చేతుల్తో నొల్లుకోవా లనీ, ప్రజల బలహీనతల్నీ, అత్యాశల్నీ సొమ్ము చేసుకోవాలనీ మేం ఆడిన నాటకం! పన్నిన పన్నాగం! అదెప్పటికీ బయటపడకుండా మేనేజ్ చెయ్యగలమను కున్నాం! జనం డబ్బుతో జల్సా చేశాం! రిస్కీ వ్యాపారాలు చేశాం!

ఇవాళ మా మోసం బట్టబయలయింది. అందుకందరం బాధ్యులమే! కానీ న న్నొక్కడ్నే నేరగాడిగా బోనులో నిలబెట్టా లని చూడటం మాత్రం అన్యాయం! అక్రమం!!

దుఃఖం వెల్లువెత్తింది. నిగ్రహించడాని కెంత ప్రయత్నించినా ఆగలేదు!

నా కాళ్ళు భూమిలోకి కూరుకుపోయి నట్లు నిలబడిపోయాను.

★ ★ ★

ఈ వీధి నుంచి ఆ వీధి వరకూ పరచు కునుండే మా మండువా లోగిలి ఏది? ఏమైంది?

జానపద సినిమాల్లో రాజభవనాన్ని పెళ్లగించి తీసుకుపోయినట్టుగా ఎవరైనా తీసుకుపోయారా? ఏ నేపాలీ మాంత్రి కుడో మా లోగిలిని 'హాం ఫట్' అని మాయం చేశాడా?

ఏమైంది? నేను పుట్టిపెరిగిన లోగిలి, నా బాల్యానికి తామరపూల రేకులు పర చిన చిన్నారి లోకం.. ఏమైందేమైంది?

ఒకనాటి ఉమ్మడి వ్యవస్థకి, సమష్టి జీవ నానికి సజీవసాక్ష్యంగా నిలిచిన మా మండువా లోగిలి ఏమైంది? నా బాల్యపు

అడుగులతో ముడివడిన ఆ ఆటశాల.. పాఠశాల.. జీవనశాల ఏమైంది?

ఇన్నాళ్ళూ నా ఊహల్లో సజీవంగా ఊరే గిన దృశ్యసంపదని కొల్లగొట్టిన ఆ దుర్మా ర్గులెవరు?

సైకత తుఫానులో చిక్కుకున్నట్టు కంపించి పోయాను.

కళ్ళ నుండి కన్నీళ్ళు జలజలా రాలిపో తోంటే "మన.. మన.. మండువా లోగిలి ఏమయ్యిందిరా" అన్నాను జీర గొంతుతో- నన్ను భోజనానికి తీసుకొచ్చిన రంగడితో.

చిన్నపిల్లాడు కన్పించకుండా పోయిన తన ప్రియాతి ప్రియమైన బొమ్మకోసం కలవరిస్తున్నట్టుగా వుంది నా పరిస్థితి.

"ఇంకెక్కడి లోగిలి? ఎప్పుడో తాతము త్తాతలనాడు కట్టిన లోగిలి ఇంకా ఎంతకాలం ఉంటుంది? కూలిపోయింది!"

"ఎలా కూలనిచ్చారు? బాగు చెయ్యక పోయారా? "

నా వంక చిత్రంగా చూస్తూ అన్నాడు రంగడు "అంత లోగిల్ని బాగు జెయ్యడ మంటే మాటలా? ఒక్కరి వల్ల అవు తుందా? పైగా అన్నివాటాల వాళ్ళూ కలిసిరావాలి. అదెక్కడ సాధ్యపడుతుంది చెప్పు? ఎవరి వాటా కూలితే వాళ్ళే విప్పే సుకున్నాం. టేకు దూలాలకి మంచిరేటు పలకడంతో అమ్మేసుకున్నాం. చిన్నదో చి తకదో ఇల్లు కట్టుకున్నాం"

"మరి మా వాటా ఏమైంది? " ఆత్రంగా చూస్తూ అడిగాను.

ఒక పక్కకు చూపించాడు. అక్కడ పిచ్చిమొక్కలూ, తుమ్మపొదలూ పెరిగి ఉన్నాయి!

అమ్మా నేనూ.. ఒకరికొకరమై పెరిగిన ఇల్లు! ఒకరి కన్నీరు ఒకరు తుడుస్తూ వెలుగురేక కోసం కారుచీకట్లో దేవుళ్ళా డుతూ కన్నీళ్ళు తాగుతూ గడిపిన ఇల్లు! నామరూపాలు కోల్పోయి పిచ్చిమొక్కల్తో మరుభూమిగా మిగిలింది!

కళ్ళు తుడుచుకుంటూ రంగడింటి కెళ్ళాను. దోవలో ఎవరెవరో పలకరిం చారు. ఏదేదో అడిగారు. యాంత్రికంగా జవాబిచ్చాను.

బీరకాయ పీచు బంధువులంతా వచ్చి చుట్టేశారు. ఏవేవో వరసల్తో పిలిచి విసు గెత్తించారు.

అవతల కోర్టులో కేసు ఏమయ్యిందోన్న ఆందోళన! ఇవతల మండువాలోగిల్ని నేల మట్టం చేశారన్న ఆవేదన! మధ్యలో వీళ్ల సుత్తికబుర్లు!

మా అమ్మ గురించీ, ఆమె పడ్డ కష్టం గురించీ చాలా చెప్పుకొచ్చారు. తామంతా ఆమెని ఎంత ఆదరంగా చూశారో చెప్పారు. తులసి నీళ్లెవరు ఎలా తెచ్చి పోశారో గొప్పగా చెప్పారు.

భోజనం వడ్డించారు. అన్నం కెలికి లేచాను. ఏదో బాధ, దిగులు గొంతుక్కి అడ్డంపడి ముద్ద దిగనివ్వలేదు.

"మన పిచ్చిగానీ పదిరకాల కూరల్తో తినేవాడికి మన ఇళ్లలోని కూరలూ, మన వంటలూ నచ్చుతాయేంటీ!" వాఖ్యానిం చిందో పెద్దావిడ.

సూరన్న రాగా వాళ్ళింటికీ వెళ్లి మర్యా దగా పలకరించి బయటపడ్డాను.

రోడ్డుమీద వెళ్తోంటే 'వేణుగోపాలరావు గారూ!' అంటూ పిలుస్తూ, పడుతూ లేస్తూ వచ్చారు శ్రీరాములుగారు.

అప్పుడెప్పుడో గ్రంథాలయ భవనానికి విరాళమివ్వమంటూ మా ఇంటికొచ్చిన సంగతి గుర్తొచ్చింది. ఆయనింకా బతికి ఉంటాడనుకోలేదు! ఒంటి మీద ఎనభై ఏళ్ళుంటాయేమో!

"ఆయ్! నిన్న వచ్చార్టగా! అంతా కులా సాయేనా? ఆయ్! ఇదేనండి ఊరి కుర్రా ళ్ళంతా చందాలు పోగుచేసి కట్టిన గ్రంథా లయం! రండి! చూద్దురు గాని..!"

"ప్రతి ఊరికీ గుడి, బడితో బాటు గ్రంథాలయమూ ఉండి తీరాలి! ఈ వయ

అ
క్ష
రం

నేను ఎవరితోనైనా
ఒకే విధంగా మాట్లాడతాను
అది సేవకుడు కావచ్చు
యూనివర్శిటీ ప్రసిడెంటు కావచ్చు

– ఆల్బర్ట్ ఐన్‌స్టీన్



స్కూలులో కూడా మీరు ఊరి కుర్రాళ్ళకి స్ఫూర్తినిస్తున్నారంటే నాకు చాలా ఆనందంగా వుంది"

"ఆయ్! ఇంకా చాలాచాలా చెయ్యాల్సుందండీ! ఆయ్! ఊళ్లో రక్షిత నీటి పథకమూ లేదు.. పైపులూ లేవు. హైస్కూలుకి సరైన భవనమూ లేదు. ఆయ్! నలుగురూ నాలుగు చేతులేసి కొత్త గ్రాంట్లు తెప్పిస్తే బావుణ్ణు! అంతా తలలాడిస్తారు గానీ ఎవరూ ముందుకు రారు.."

"సర్పంచీ, ఇతర నాయకులూ ఏం పట్టించుకోరా? అవన్నీ వాళ్ళు చేయాల్సిన పనులు కదా! పైగా ఇలాంటి పనుల కోసం ఎమ్మెల్యేలకీ ఎంపీలకీ బోల్డు ఫండ్స్ ఇస్తున్నారు"

"ఆయ్! మీకు తెలీందేముందీ! పై లెవెల్లోని రాజకీయాలు త్వరగా తెమలనీవు. నిధులు వచ్చినా కాంట్రాక్టర్లు మూడొంతులు మింగేస్తారు. ఆయ్! అంతేనండి! దీనికి పరిష్కారం ఏవిటంటే ఏ గ్రామం వాళ్ళు ఆ గ్రామానిక్కావాల్సినవన్నీ ఏర్పాటు చేసుకోవడమే! అసలు గాంధీ గారు చెప్పిన గ్రామ స్వరాజ్య సిద్ధాంతం అదేనండి! ఆయ్! ప్రతి గ్రామమూ తమక్కావలసిన పనులు తామే నిర్ణయించుకోవాలి. దగ్గరుండి చేయించుకోవాలి. ప్రతివారూ ఓ చేయివేస్తే కొండల్ని పిండి చెయ్యొచ్చు. ఆయ్! ఇహ ఇదెంత చెప్పండి? "

"పాయింటే.."

"ప్రతివారికీ 'మా ఊరు' అన్న అభిమానం ఉండాలి. దాంతో అనుబంధం ఏర్పరచుకోవాలి. ఆయ్! అంతెందుకు మీది ఏ ఊరని ఎవరైనా అడిగితే ఏ ఊరి పేరు చెబుతారు? "

"ఈ ఊరి పేరే" కించిత్తు ఖిన్నుడ్నవుతూ జవాబిచ్చాను.

"ఎంచేత? జన్మమూలం ఇక్కడ.. ఈ మట్టిలో వుంది గనుక! 'మా ఊరి వాళ్ళు' అన్న అనుబంధం వుందే అది చాలా గొప్పదండి. తమరేవంటారు? "

"మీ మాటలకి అప్పీలు లేదు"

"మీకు కుదిరినప్పుడు తృణమో ఫణమో ఇచ్చి ఏదో ఒకపని పూర్తి చేయండి! ఎంత చేసినా జనని రుణం, జన్మభూమి రుణం తీర్చుకోలేం. రోజూ ఎన్నో ఖర్చులు చేస్తుంటాం. ఆయ్! ఊరికి చేసింది ఎప్పటికీ నిలిచి పోద్దండి..!"

"నాకు చాతనైన సాయం చేస్తాన్లెండి!"

గోడకో ఫొటో వేలాడుతోంది. ఆసక్తిగా చూశాను. అది నా చిన్నప్పుడు శ్రీరాములుగారి ఆధ్వర్యంలో గ్రామ యువకులంతా శ్రమదానం చేసినప్పటిది. ఆ సొమ్ముతోనే గ్రంథాలయం స్థాపించారు.

నేనూ పాల్గొన్నాను. నా వయస్సప్పుడు ఎనిమిదో? తొమ్మిదో? ముందు వరుసలో నేలమీద కూర్చున్నవాళ్ళలో నేనూ, మూర్తీ ఉన్నాం. శ్రీరాములుగారు వరి మోపు మోస్తూ మధ్యలో నిలబడి ఉన్నారు.

నా ఫొటో వంక అపురూపంగా చూసుకుని బయటికి నడిచాను.

★ ★ ★

ధనేష్‌కి ఫోన్‌చేశాను. 'కోర్టులో ఉన్నాను' అని ఎస్సెమ్మెస్ పంపేడు.

ఆందోళన అధికమయింది.

కోర్టులో వాదోపవాదాలు ఏ తీరుగా నడుస్తున్నాయో! తీర్పు అనుకూలంగా వస్తే ఫరవాలేదు! లేకపోతే?

ముచ్చెమటలు పోస్తోంటే సన్నగా కంపించాను. మూర్తి ఇంటికి వెళ్ళబుద్ధి గాక ఊరి బయటి తోటల్లోకి నడిచాను.

అక్కడో దిమ్మమీద చతికిలబడ్డాను. క్షణమొక యుగంగా గడుస్తోంది. ఎట్టకే లకు ఫోన్ మోగింది.

"మన ఆస్తులు జప్తు చేయమన్నారు.."

"ఏ.. ఏవిటి? జప్తా? మైగాడ్..!"

దుఃఖం వరద కెరటమై ముఖాన్ని తాకింది. గుండెల్లో బడబాగ్ని ఒక్కసారిగా బద్దలైంది. చెవుల్లో సముద్రపు హోరు ఘీంకరించింది.

వార్త పేపర్ల కెక్కుతుంది. టీవీవాళ్లకి బ్రేకింగ్ న్యూసవుతుంది. రాష్ట్రమంతా తెలుస్తుంది. ఊళ్ళోని వారిక్కూడా!

వేణు ఇంత నీచుడా? మోసగాడా? అని మొకాన ఉమ్మేస్తారు! ఫలానా సీతమ్మ కడుపున చెడబుట్టాడని ఛీత్కరిస్తారు! దుర్మార్గుడంటూ కోడై కూస్తారు! అవన్నీ ఎలా ఎలా భరించి బతకడం?

గుండెల్లో సన్నగా నొప్పి మొదలైంది. ఉద్విగ్నత నిలువునా ఊపేస్తోంది.

రెండోసారి గుండెపోటు వస్తే ప్రమాదమని డాక్టర్లు చేసిన హెచ్చరిక చెవుల్లో మార్మోగింది. పైగా ఈ దరిద్రపుగొట్టు పల్లెలో సరైన డాక్టరూ లేడు!

గుండె వేగం హెచ్చింది. ఒంటి నుంచి చెమటలు ధారాపాతంగా కారిపోతున్నాయి. టై పీకేశాను. కోటు విసిరేశాను. షర్టుని కూడా తీసేశాను.

గాలి ధారాళంగా వీస్తోన్నా నాకు ఊపిరాడటం లేదు. అంతకంతకీ నొప్పి ఎక్కువైపోతోంది..!

ఖర్మకాలి ఇది గుండెనొప్పి అయితే? ఇక్కడే ఈ ఊళ్ళోనే ఆఖరిశ్వాస విడవాల్సొస్తుందేమో!

అసలందుకే ఇంత దూరం పారిపోయి వచ్చానేమో! మృత్యువు గేలం వేసి నన్నిక్కడికి లాక్కొచ్చిందేమో!

భగవంతుడా! ఏడుకొండలవాడా! నన్ను రక్షించు! నీకు నిలువు దోపిడీ ఇచ్చుకుంటాను స్వామీ! అంతర్వేది లక్ష్మీనరసింహ స్వామీ! నా మొర విను! కాపాడు! నిన్ను మర్చిపోయినందుకు క్షమించు తండ్రీ! రేపుటెల్లుండ్లో వచ్చి నీ దర్శనం చేసుకుంటాను. ముందు నన్ను రక్షించు! పాహిమాం! పాహిమాం!

మైగాడ్! గుండెల్లో సప్తసముద్రాలు పోటెత్తాయి.

కళ్ళు బైర్లుకమ్ముతున్నాయి.. ఒళ్ళు తూలుతోంది.. లేచి రెండడుగులు వేశానో? లేదో? మగత కమ్మి తూలి పడిపో..యా..ను!

★ ★ ★

కళ్ళు తెరచి భయం భయంగా చూశాను. గదిలో మంచం మీద క్షేమంగా ఉన్నాను.

వెర్రి సంబరం నిలువెల్లా పాకింది. కొండంత శక్తి వచ్చింది.

తోటలోంచి రక్షించి తీసుకొచ్చిన ఆ రక్షకుడెవరో? ఈ ఇల్లు ఎవరిదో? అని కలియజూశాను.

ఒకామె గదిలోకి తొంగిచూసింది.

## కొత్తగాలి...

**చీకట్లను చీలిస్తే**
**ఎర్రటి సూరీడు కనిపించలే!**
**స్వార్థజీవి వెగటు నవ్వు**
**ఎర్రగా వెలుగుతూ కనిపించింది!!**

*– చింతలపూడి శివశంకర్‌రెడ్డి,*
*శ్రీశైలం*

ఆమెని గుర్తుబట్టి విభ్రాంతిగా చూశాను. "నువ్వా రాకుమారీ!"

"గుర్తున్నా నన్నుమాట!"

"ఎలా మర్చిపోతాను? ఈరోజున నేనిలా ఉన్నానూ అంటే అందులో మీ అందరి పాత్రా ఉంది. మీ మేలూ.. మీ సాయం మరువలేనివి!"

"నిన్న మాస్టారింటి కొచ్చావని తెలిసింది. మా ఇంటికి వస్తావో? రావో? అనుకున్నాను" నిష్ఠూరంగా అంది

ఆమె సంగతెలా మర్చిపోయానో తెలీదు. అలా అని నిజం చెప్పి నొప్పించ దలచలేదు.

"అడ్డదారిన తోటల్లోంచి మీ ఇంటికే వస్తోంటే కళ్ళుతిరిగి పడ్డాను. ఈ ఇల్లు మీదైతే బావుడ్ననుకొంటోంటే నువ్వు ప్రత్యక్షమయ్యావు. బావున్నావా రాకుమారీ? "

"నిక్షేపంలా ఉన్నాను. నీ పనీ బాగుందిట కదా! తాశిల్దారుగారి అల్లుడివి! బాగుండ కేంజేస్తుందిలే! పిల్లలెందరు? పెళ్ళిళ్ళయ్యాయా? " గ్లూకోజ్ నీళ్ళు అందిస్తూ అడిగింది.

"ఇద్దరబ్బాయిలూ, ఒకమ్మాయి. అందరికీ పెళ్లిళ్లయ్యాయి. నీకెందరు పిల్లలు? "

"ఇద్దరు. ఒకబ్బాయి, ఒకమ్మాయి.. ఈ వేసవిలో అబ్బాయికి పెళ్లి చేసేద్దామనుకుంటున్నాం"

"అయితే పెళ్లిభోజనం టైముకి వచ్చేనన్న మాట" మందహాసం చేశాను.

"భోజనం సంగతలా వుంచు. సమయానికి నేనటు రాబట్టి సరిపోయింది గానీ లేకపోతే ఏమయ్యేవాడివో తెలుసా? బీపీలూ గట్రా వున్నవాడివి అడ్డదార్లు పట్టి అవస్థపడటం ఎందుకు? రాజమార్గాన నడవ్వొచ్చుగా!" చనువుగా కోప్పడింది.

ఆమె మాటల్లో శ్లేష ధ్వనించింది. భుజాలు తడుముకున్నాను.

"పాపం! డాక్టరూ ఫోన్‌చెయ్యగానే పరుగునొచ్చాడు. ఏవో ఇంజెక్షన్లు చేసి గాబరా పడాల్సిన పనిలేదని చెప్పెళ్లేడు.."

చెమ్మగిల్లిన నయనాలతో చూస్తూ "నీకు చాలా థాంక్స్ రాకుమారీ!" అన్నాను.

నవ్వింది. "మాటలు బాగా నేర్చావు. అవున్లే! మాటలే కదా నీ పెట్టుబడి"

విస్మయంగా చూశాను.

"వ్యాపారమంటే మాటలతో కోటలు కట్టటమేగా!" గట్టిగా నవ్వేసింది.

నడి వయస్సు దాటినా రాకుమారి అందమేమి తగ్గలేదు. మనిషింకా బింకంగా ఉండటం నిజంగా చిత్రమే.

ఆమె మోమునిండా ఎంత కాంతి పరచుకునుందీ! ఆమె నవ్వులో గర్వం, తృప్తి, సంతోషం కలగలిసి ఉన్నాయి.

వయస్సు పైబడ్డా జుట్టు ముడివేసినా ఆమెలో ఏదో గ్రేస్ - రాజసం కొట్టొచినట్టు కన్పిస్తోంది!

రాకుమారి! నా పెదాల మీద చిరునగవు మొలిచింది.

నేను నర్సాపురం కాలేజీలో చేరటం, తాశిల్దారుగారి అల్లుడ్నవటం, నా గీత మారిపోవటం చకచకా జరిగిపోయాయి. కానీ అలా జరిగి ఉండకపోతే ఈ ఇంటికి అల్లుడ్నయ్యే వాడ్నేమో? లేకపోతే కోయదొర జోస్యం అబద్ధమవదూ?

ఓసారి భద్రాచలం అడవుల్లోంచి వచ్చిన కోయదొరకి నా చెయ్యి చూపించింది మా అమ్మ. "చేతిలో ధనరేఖ జెర్రిపోతులా ఉంది. మధ్యలో కొట్టుకొస్తాది" అని చెప్పేడు.

అక్షరాలా అలాగే జరిగింది!

రాణి కాకపోతే రాకుమారిని పెళ్ళి చేసుకునుందునన్న మాటేకదా! పైకి తేలకపోయినా లోలోన రాకుమారి కూడా నన్ను ప్రేమించే ఉంటుంది. తను నా భార్య కాలేకపోయినందు కెంతో బాధపడే ఉంటుంది. అసలా అభిమానంతోనే ఇవాళ నన్ను ఇంటికి తీసుకొచ్చి సేవలు చేసి ఉంటుంది!

రాకుమారి ఇప్పటికీ నన్ను ప్రేమిస్తోందేమోనన్న వూహ నన్ను ఉల్లాసపరుస్తూ గర్వపడేలా చేస్తోంటే, సర్వం మరచి ఓ కునుకు తీశాను.

ఆ కునుకులో ఓ పగటికల కన్నాను.

'ఈ పల్లె వాతావరణం.. ఈ సంసారంలో ఇమడలేకపోతున్నానని వాపోయింది రాకుమారి. ఇది నరక సదృశంగా ఉందని కళ్ళ నీళ్ళు పెట్టుకుంది. కార్లూ, మేడలూ, క్లబ్బులూ, షికార్లూ, హైసొసైటీ కావాలని అర్థించింది. తన దగ్గరున్న డబ్బూ బంగారం తీసుకుని నాతో వచ్చేస్తానంది. హైదరాబాదుకి తీసుకెళ్ళి తనని రెండో భార్యగా స్వీకరించమంది. తనకి స్వర్గం చవి చూపించమనీ, నా మహారాజ్యానికి మహారాణిని చేయమనీ నన్ను బతిమాలింది!'

చిత్రమైన ఆ కల నాకెంతో ఊరట కల్గించింది. ఉత్సాహాన్నిచ్చింది. నాకు నేను మహారాజులా కన్పించసాగాను!

రాకుమారీ వాళ్ళది పెద్దడాబా. ఇంటి నిండా ఖరీదైన ఫర్నిచరూ సామగ్రీ వున్నాయి. టీవీ ఫ్రిజ్జులాంటివే కాదు, ఓ హీరో హోండా, రెండు కార్లు కూడా ఉన్నాయి.

ఇంటి ముందు కొబ్బరి తోట. మధ్యలో రాశులుగా కొబ్బరికాయలు. ఓ నలుగురు అవిశ్రాంతంగా కొబ్బరి కాయల డొక్కలు చకచకా ఒలుస్తున్నారు.

అడుగడుగునా పరచుకున్న సంపద, ఐశ్వర్యం, అడుగులకు మడుగులొత్తే నౌకర్లూ, చాకర్లూ.

ఆడింది ఆట.. పాడింది పాట! చెప్పింది వేదం.. చేసింది ఘనం! రాకుమారి అదృష్టానికి ఈర్ష్య పడకుండా ఉండ లేకపోయాను. నాకు ఆమెకన్నా అత్యధిక సిరి సంపదలున్నాయి. కానీ నాకున్న టెన్షన్లూ, ఒత్తిళ్ళూ, పరుగులూ, ఆరాటాలూ, మానసిక మథనలూ, అశాంతీ నిద్రపట్టకపోవడాలూ- ఏమీ ఆమెకి లేవు!

నా భార్య రాణి గుర్తొచ్చింది.

లక్ష్మీరాణి చామన ఛాయగా ఉంటుంది. కొంచెం పొట్టిగా, కాస్త భారీ శరీరంతో ఉంటుంది. అందాన్ని పెంచుకోడానికీ వయస్సు తగ్గించుకోడానికీ బ్యూటీ క్లినిక్కుల చుట్టూ తిరుగుతూంటుంది. అలంకరణ సామగ్రి అధికంగా ఉపయోగిస్తుంది. ఫ్యాషన్ దుస్తులు ధరిస్తూ తోటి హైసొసైటీ లేడీస్‌తో రాచుకు తిరుగుతుంది.

క్లబ్బులూ, కాంటెస్టులూ, పార్టీలూ, ఫ్యాషన్లూ, షోకులూ, సినిమాలు - తప్ప ఇతరవేమీ కన్పించవు. ఇంటి వ్యవహారాలు గానీ, పిల్లల ఆలనా పాలనా గానీ, ఆఖరికి నా మంచి చెడ్డలు గానీ పట్టించుకోదు. తన గురించే అంతా పట్టించుకోవాలనీ గౌరవమిస్తూ, అభినందిస్తూండాలనీ ఆశిస్తూంటూంది. తనొక్కతీ దివి నుంచి ప్రత్యేకంగా భువికి దిగి వచ్చినట్టు ప్రవర్తిస్తూంటుంది.

'బికారిని కోటీశ్వరుడ్ని చేసింది నేనే' అని ఆమె ఎన్నడూ అనలేదు. కానీ అంటుందేమోనన్న ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ నాలో ఉంది. అందుకని బహుమతుల్తో, ఆభరణాలతో ఆమెని ఆనందపరుస్తూంటాను. అందరి ముందూ గొప్పగా మెచ్చుకుంటూ ఆకాశానికెత్తేస్తూంటాను.

ఆ చేష్టలకి మురిసిపోయి నా అంత మంచి భర్త ఎక్కడా ఉండడంటూ లెక్చరిస్తూంటుంది!

రాకుమారితో రాణిని క్షణకాలం పోల్చి చూశాను. ఒకరు ఉత్తరం! రెండో వారు దక్షిణం!

పనిమనిషిని పిలిచి టీ బిస్కెట్లూ తెమ్మంది రాకుమారి.

ఇంతలో ఆమె కొడుకూ కూతురూ వచ్చారు. వాళ్ళని పరిచయం చేసింది.

కొడుకు పేరు అశోక్. కూతురి పేరు ప్రియదర్శిని. తల్లిలానే ఇద్దరూ అందగాళ్ళే!

# అసలు లక్ష్యం న్యూక్లియర్ పవర్‌ప్లాంట్స్!




అమెరికాలో 2001 సెప్టెంబరు 11న న్యూయార్కులో ట్విన్ టవర్స్ మీద జరిగిన 'నైన్ బై లెవెన్'గా పిలుచుకుంటున్న ఉగ్రవాద దాడికి సంబంధించిన కొన్ని విషయాలు..

★ న్యూయార్క్ టైమ్స్ దినపత్రిక ప్రతి నైన్ బై లెవెన్ బాధితుడి గురించి ఓ ఆర్టికల్ ని ప్రచురించింది.



★ అల్‌ఖైదా ఆ రోజు ట్విన్ టవర్స్ బదులు న్యూక్లియర్ పవర్ ప్లాంట్స్ మీద దాడి చేయాలని అనుకుంది.

★కూలిన ప్రదేశంలోని పంతొమ్మిది వేల నాలుగు వందల ముప్పైఐదు శరీర ఖండాలని, కోటి నలభైలక్షల టన్నుల భవంతి శకలాలని తరలించారు.

★ ఆ దాడిలో బతికి బయటపడ్డ టాన్యా హెడ్ తనలాంటివారి సపోర్టుగ్రూప్‌కి అధ్యక్షురాలైంది. తర్వాత ఆమె మోసగత్తె అని, ఆ సమయంలో ఆమె కూలిన భవంతుల్లో లేనేలేదని తేలింది.

★నైన్ బై లెవెన్ ఘటనకి ఓ నెల ముందే ఆనాటి అధ్యక్షుడు జార్జిబుష్‌కి 'బిన్‌లాడెన్ విమానాలను హైజాక్ చేసి, వాటిని న్యూయార్కు మీద ప్రయోగించొచ్చు' అనే ఇంటెలిజెన్స్ రిపోర్టు అందింది. ఆయన దానిమీద చర్య తీసుకోలేదు.

★ ఈ దుర్ఘటన గురించి తెలిసి కెన్యాలోని మసాయ్ అనే తెగకి చెందిన వారు 14 ఆవులని అమెరికాకి సహాయంగా పంపారు.

★ గాయకుడు మైఖేల్ జాక్సన్ ఆ దుర్ఘటన రోజు ఉదయం కూలిన భవనాల్లో మీటింగుకి హాజరు కావాల్సి ఉంది. కానీ అతనికి మెలకువ రాకపోవడంతో దానికి హాజరు కాలేదు.

★ దాడిలో కోట్ల డాలర్ల విలువైన పాబ్లో పికాసో చిత్రాలు అనేకం నాశనమయ్యాయి.

★ 18 మంది ఈ శకలాల మధ్య నుంచి సజీవంగా రక్షింపబడ్డారు.

బుద్ధిమంతుల్లానే ఉన్నారు.

"నా చిన్నప్పుడు మా ఇంట్లో సీతమ్మ అనే వంటలక్క ఉండేదనీ, అతడికో కొడుకుండేవాడనీ చెబుతూంటానే.. అతనే ఇతను. పేరు వేణు. మా సాయంతో బాగా చదువుకుని పైకొచ్చాడు. ఇప్పుడు హైదరాబాదులో ఏవో వ్యాపారాలు చేస్తున్నాడు. తాశిల్దారుగారి అల్లుడవడంతో వీడి దశ తిరిగింది. మీకు మావయ్య వరసవుతాడు"

ఒక పెనుకెరటం బలంగా ముఖాన్ని తాకినట్టు దిమ్మెరబోయాను. ఆమె నిజంగా రాకుమారే! నేను మాత్రం పనివాడ్ని!

ఆమె అభిమానాన్నీ, సానుభూతినీ, ప్రేమ అని భ్రమపడ్డ అమాయకుడ్ని! ఆమె తల్లి దయదలచి చేసిన సహాయస హకారాలతో చదువుకున్నాను. ఆ సంగతి మరచి విశ్వాసహీనుడ్నయి ఆ ఇంటికే అల్లుడ్నవ్వాలని అర్రులు చాచినవాడ్ని! ఆమె మంచితనాన్ని అర్థం చేసుకోలేక ఆమె నాతో లేచి వస్తానన్నట్టు కలగన్న నీచాతినీచుడ్ని!

నా తల భూమిలోకి కుంగిపోయింది!

ఇంతలో హీరో హోండా వచ్చి ఇంటి ముందాగింది. దాని మీంచొకతను దిగాడు. తెల్లని లాల్చీ పైజమాల్లో హుందాగా, ఎత్తుగా, బలిష్ఠంగా, ఎర్రగా వున్నాడతను.

"మా ఆయన! రాజ్ కుమార్!" చిన్నగా నవ్వుతూ పరిచయం చేసింది రాకుమారి.

"కొత్త హిందీ సినిమాలోని పాతతరం

హీరోలా వున్న ఇతడెవరో చెప్పుకోండి చూద్దాం!" నన్ను చూపిస్తూ అడిగింది.

"ఇంకెవరూ! రాకుమారికి రాకుమారుల కథలు విన్పించిన చిన్ననాటి దోస్తు"

తప్పట్లు కొట్టారు అశోక్, ప్రియదర్శిని. ఆహ్లాదం, ఆనందం నలుదిశలా పరిమళంలా వ్యాపించాయి.

నా ఇల్లూ దాంతోబాటే ఇల్లాలు పిల్లలూ గుర్తొచ్చారు. మా ఇల్లు ఒక మీటింగ్ ప్లేస్ లానో, లాడ్జిలానో ఉంటుంది తప్ప 'ఇల్లు' లా ఉండదు.

ఇక వెళ్తానంటూ లేచాను. "మా ఇంట్లో చెయ్యి కడక్కుండా నిన్ను ఎలా వెళ్లనిస్తాను? " చొరవగా అనేసి లోపలికి వెళ్ళిపోయిందామె.

## కొత్తగాలి...

**సూత్రం తెగిన**
**గాలిపటంలా**
**విమానం సముద్రంలోకి**
**ప్రాణాలు**
**అనంతవాయువుల్లోకి..!**

*– జి. శైలూషి, హైదరాబాద్*

"రాకుమారి ఆజ్ఞకి తిరుగులేదండోయ్!" రాజ్ కుమార్ చమత్కరించాడు.

"మీరేం చేస్తుంటారు? "

"వ్యవసాయం, కొబ్బరి కాయల వ్యాపారం, ఇల్లూ.. ఊరు.. ఇదే నాలోకం! ఒకరకంగా ఇల్లే తీర్థం.. వాకిలే వారణాసి.. కడుపే కైలాసం"

"భలేగా చెప్పేరు"

"నిజమే వేణూ! ఇంట్లోక్కావలసిన కాయగూరలన్నీ తోటలోనే పండుతాయి. ధాన్యం సరేసరి! వినోదానికి టీవీ వుంది. సంపాదించిన దానికి తృప్తి వుంది. మాకు పరుగులూ పందేలూ ఉండవు. భయాలు ఒత్తిళ్ళూ లేనిపోని తాపత్రయాలూ లేవు. హ్యాపీగా, ఆరోగ్యంగా ఉన్నాం"

★ ★ ★

"బహుజన హితాయ, బహుజన సుఖాయ- అన్నాడు బుద్ధుడు. సర్వేజనో స్సుఖినో భవన్తు- అన్నారు పెద్దలు. అంతా బావుండాలి. అంతా సుఖంగా ఉండాలని కోరుకోవాలి. కేవలం మనం మాత్రమే సుఖంగా ఉండాలనుకునే వారి జీవితాలకి ప్రయోజనం శూన్యం. మనకి మూడు పూటలా తిండి లభిస్తున్నప్పుడు పక్కవారికీ కనీసం రెండు పూటలైన కడుపు నిండాలని కోరుకోవాలి. అందుకు సమాజం బాధ్యత వహించాలి. అప్పుడే మనిషి బతుక్కి అర్థమూ పరమార్థమూ ఉంటుంది" అంది రాకుమారి.

"బాబోయ్! మరీ ఇంత బరువైన డైలాగ్ చెబితే ఎలాగోయ్!" భార్య వంకచూసి నవ్వేడు రాజ్ కుమార్.

"రాకుమారి చెప్పింది నిజమే! నదిలా నిస్వార్థంగా వుండాలి నరుడు. పరహితం కోరాలి. పరుల కోసం జీవించాలి. కానీ మనిషిలో స్వార్థం పెరిగిపోయింది. దాంతో దోపిడి చెయ్యడానికి, ద్రోహం చెయ్యడానికి ఆఖరికి మర్డర్ చెయ్యడానికీ వెనుకాడటం లేదు" రాకుమారి మెచ్చుకోలు కోసం గుండెలు పొంగించి మరీ చెప్పాను.

అనేశాక నేనెంత అనాలోచితంగా మాట్లాడానో అన్పించి, ఎర్రబడ్డ ముఖంతో ఎంబ్రాస్సింగా చూశాను.

"సమాజం బాగుపడటానికి అందరూ ఒక్క సూత్రం పాటిస్తే చాలు" అని చెప్పింది రాకుమారి.

"ఏమిటో ఆ ఏకసూత్ర పథకం? !"

"ప్రతీవాడూ అన్నం తినే ముందు 'భగవంతుడు నాకు ఆరోగ్యాన్నీ, సంపాదించే శక్తినీ ఇచ్చాడు. దాంతో ఈ ఆహారాన్ని ధర్మబద్ధంగా సంపాదించాను. దీన్ని నా మీద ఆధారపడ్డ భార్యాబిడ్డలకి, నన్ను

నమ్ముకున్న అందరికీ పెట్టి, నేను తింటు న్నాను' అని అనుకో గలిగితే చాలు!"

రాకుమారి మాటలకి నా తల గిర్రున తిరిగింది. ఆమె ఆ మాటల్ని జనరల్‌గా చెప్పిందో? నన్ను దృష్టిలో పెట్టుకుని చెప్పిందో? అర్థం కాలేదు.

"మా బుర్రలు వేడెక్కిపోయాయిగానీ, అమ్మాయ్ ప్రియా! చక్కని వీణ పాటతో వాటిని చల్లార్చు తల్లీ!"

"మా అమ్మ చిన్నప్పుడు హార్మోనీ వాయించేదిట కదా అంకుల్!" అడిగాడు రాకుమారి కొడుకు అశోక్.

"కేవలం వాయించడమే కాదురా! ఈ వీధిలోని అందరి చెవుల్లోని తుప్పు కూడా వదల గొట్టేదిట!" రాజ్‌కుమార్ నవ్వేడు.

"నేనంత దారుణంగా ఏమీ పాడేదాన్ని కాదు.. ఏం వేణూ!" అడిగింది రాకుమారి.

"నిజమే! బాగా పాడేది! చక్కగా వాయించేది"

"ఆ పాట సంగతేమోగానీ, మీ వంత పాట చాలా బాగుంది"

రాజ్‌కుమార్ మాటలకంతా నవ్వేరు.

ప్రియదర్శిని వీణ మీద రెండు కీర్తనలను వినిపించింది.

భోజనాల బల్ల దగ్గర అందరం కూర్చున్నాం. నేను చిన్నప్పుడు ఎలా వుండే వాడ్నో చెప్పమని గొడవ చేశారు పిల్లలు.

"బావోద్దర్రా, వేణు నొచ్చుకుంటాడు" అంది రాకుమారి.

"ఇందులో బాగోకపోవడానికేముంది! బాల్యాన్నీ, అప్పటి అమాయక చేష్టల్నీ, పిచ్చిఊహల్నీ గుర్తుచేసుకుంటే ఎవరికైనా సరే ఎంతో సరదాగా వుంటుంది. హాయిగా అన్పిస్తుంది. ఏవంటారు వేణూ? " అడిగాడు రాజ్‌కుమార్.

వెర్రిగా నవ్వేను. ఆమె అన్నీ అంతా చెప్పేస్తుందేమోనన్న భయమూ, ఆమె నా గురించేమనుకునేదో తెలుసుకోవాలన్న ఉత్సుకత - రెండూ కూడా నన్ను వాటేసుకుని కుదిపేస్తున్నాయి.

రాకుమారి నా బాల్యాన్ని వారి ముందు పరచింది.

మా బీదతనం గురించీ, మా అమ్మ వంటలక్కగా మారటం గురించీ తక్కువగా చెప్పింది. నా గురించీ, నా చదువు గురించీ, ప్రవర్తన గురించీ చెప్పింది.

నా కురచ బట్టల గురించి, చిరిగిన చొక్కాల గురించీ చెప్పింది. పిల్లలు ఆటపట్టిస్తే నేను ఏడ్చిన సంగతీ చెప్పింది. నా మార్కుల గురించీ చెప్పింది. గుడ్డిదీపపు మసక వెల్తురులో నేను చదివిన చదువు గురించీ చెప్పింది. నా బిడియం గురించీ, వెనకగా నిలబడి ఉండే నా మనస్తత్వం గురించీ చెప్పింది.

ఎవరైనా తినమని మా అమ్మకి పెడితే చీరకొంగులో ముడివేసి దాచి తెచ్చి నాకు ఆప్యాయంగా ఎలా పెట్టేదో చెప్పింది. అంతా నన్ను పొగడినప్పుడు ఆమె కళ్లలో కురిసిన మెరుపుల సంగతీ చెప్పింది.

రాకుమారి వాళ్ల నాన్నంటే నేను భయపడే వాడ్నంది. వాళ్ళ నాన్నకి తెలీకుండా నా పుస్తకాలకీ, ఫీజులకీ తను డబ్బు ఇచ్చిన విషయమూ చెప్పింది. అపుడు నా కళ్ళల్లో కదలాడే ఆరాధనా భావాల్నీ గుర్తు చేసింది.

నేను తనకి చెప్పిన కథల గురించీ, ఆ చెప్పిన పద్ధతి గురించీ, నా కథన కౌశలం గురించీ చక్కగా వివరించింది. తను కాకి ఎంగిలి చేసిస్తే నేను తిన్న కాయల గురించీ, చెరువులో దిగి మరీ నేను తెచ్చిచ్చిన తామరపూల గురించీ చెప్పింది.

ఆమె దుస్తుల వంకా, ఆభరణాల వంకా నేను అసూయగా చూట్టం, ఫలానా సినిమా బావుందని బులిపించి డబ్బులు తీసుకెళ్ళి సినిమా చూసొచ్చి ఆ కథ చెప్పిన వైనం, ఆమె స్నేహం కోసం పుస్తకాలవీ తెచ్చిస్తూ పోచికోలు కబుర్లు చెప్పడం, వాళ్ళ నాన్న కేకలేయగా నేను

పారిపోవడం వగైరా వగైరాలన్నీ పూసగుచ్చినట్లు చెప్పింది రాకుమారి.

అంతా సరదాగా విని ఎంజాయ్ చేశారు. కానది నేను మరచిపోవాలనుకుంటున్న గతం. దాన్ని తవ్వి నలుగురికీ ప్రదర్శించడం నాకిష్టం లేదు. ప్రస్తుతం నేనేమిటో కావాలి. రేపు నేనేం కాబోతున్నానో కావాలి. అంతేతప్ప నిన్న నేనేమిటో ఎందుకు తెలియాలి? ఎవరైనా ఎందుకు తెలుసుకోవాలి?

ఉక్రోషంతో ఉడికిపోయాను. కుంచించుకుపోయి కూర్చున్నాను. భోజనం సరిగ్గా చెయ్యలేకపోయాను.

అది గమనించి రాకుమారి నొచ్చుకుంది. "నీకిష్టమైన వంటకాలు చేయించాను. కోడి కెక్కిరించినట్టు ఆ తినడం ఏమిటి వేణూ!"

"నా ఇష్టాలిప్పుడు మారిపోయాయి"

చిత్రంగా చూసింది.

'వేణు ఇప్పుడు మీ వంటలక్క కొడుకు కాదు. కోట్లకి పడగెత్తిన కోటీశ్వరుడు' మనసులో అనుకున్నాను.

"అభిరుచి మారిందా? లేక ఆకలి మందగించిందా? కడుపునిండా ఆకలి, కంటినిండా నిద్రా ఉన్నవాడే అసలైన భాగ్యవంతుడు!"

"అంటే నాలాగ అన్నమాట" అన్నాడు రాజ్ కుమార్ జబ్బలు పొంగించి.

"చాల్లెండి సంబడం!" మురిపెంగా కసిరింది.

నాకు కొసరి కొసరి వడ్డించడంతో కాదనలేక కడుపులో పట్టకపోయినా కూరుకుని తిన్నాను.



ఒకప్పుడు అన్నం ముద్ద కోసం ఎంత ఆవురావుమని చూశామో? అమ్మా, నేనూ!

"అన్నం ముద్ద నోట్లో పెట్టుకునే ముందు అమ్మని తలుచుకున్నవాడే కొడుకు" రాకుమారి అంది.

వెండి పళ్లెంలో కొత్తబట్టలు పెట్టి కూతురి చేత ఇప్పించింది రాకుమారి.

అధికారులకీ మంత్రులకీ 'బహుమతులు' ఇవ్వడమే అలవాటుగానీ, ఇలా బంధుత్వాన్నో, స్నేహాన్నో తలచి బట్టలు పెట్టడం నాకు తెలీదు. నాకెవరూ పెట్టనూ లేదు!

నెయ్యి తాగకూడదు. అలాగే దాహం వేసినవాడు గోదావరి వైపు వెళ్ళాలిగానీ, సముద్రం వైపు కాదు. ఆ సంగతి గుర్తుంచుకుంటే మంచిది"

అశోక్ బైక్ మీద నన్ను మూర్తి ఇంటి దగ్గర డ్రాప్ చేశాడు.



"రాక రాక వచ్చావు. నీ ఆడబడుచు ఈ మాత్రం పెట్టకూడదా వేణూ"

"నువ్వు నిజంగా రాకుమారి 'ది గ్రేట్ వే" నవ్వింది - ఎప్పట్లానే మెస్మరైజ్ చేస్తూ! ఆమె నవ్వుకీ అందానికీ రాజసానికీ మరోసారి అభినందన పూర్వకంగా చూశాను.

"ఎందులోనైనా సరే తృప్తి ముఖ్యం వేణూ. తృప్తి లేనప్పుడు ఎంత సంపాదించినా సుఖముండదు. సంతోషముండదు. దాహం తీరాలంటే నీళ్ళు తాగాలి గానీ,

"ఎలా వుందిరా? " మూర్తి ఆదుర్దా పడ్డాడు.

"కళ్ళు తిరిగిపడ్డానంతే! మా బిజినెస్ వాళ్ళకి బీపీ, హార్ట్‌ఎటాక్‌లు కవచ కుండలాలు కదా!" నవ్వబోయాను.

"వ్యాపారపు రంధి తగ్గించుకో మరి!"

ఇంతలో శ్రీరాములుగారు గబగబా

వచ్చారు. "వేణుగారూ- ఆయ్! మీ ఆరోగ్యం ఎలా వుందీ? "

"పెద్దవారు! ప్రత్యేకంగా రావాలా!"

"అదేమన్నమాట! మీ రు మీ ఊరికి అతిథిగా వచ్చారు. ఆయ్! అతిథి బాగోగులు చూడాల్సిన బాధ్యత ఊరందరి దీనూ! ఇం తకీ సుస్తీ ఏమిటి? "

చిన్నగా గుండెనొప్పి. ఇప్పుడు బాగానే ఉంది లెండి!" అని ఆయన్ని పంపేసరికి నా తలప్రాణం తోకకొచ్చింది.

గదిలోకెళ్లి సెల్ బయటికి తీశాను. జప్తు వివరాలు తెలుసుకుంటేగానీ గుండెలు కుదుటపడవు.

ఛ్ఛ. చార్జి అయిపోయింది.

రకరకాల ఆలోచనలు మెదడుని పేడపురుగుల్లా తొలిచేస్తున్నాయి.

ఇంతలో గౌతమి వచ్చింది. "మీ కథ చెప్పండి బాబాయ్!"

శుష్కహాసం చేశాను "నా జీవితమేమీ పాఠం కాదు"

"పాఠమో, గుణపాఠమో తెలిసేది మీ గురించంతా తెలుసుకున్నాకే కదా! బాబాయ్"

"నా కథంటే ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి? "

బిందెడు నీళ్ళు పోస్తే నది కాదు. నిర్విరామంగా ప్రవహిస్తే నది అవుతుంది. జీవితమూ అంతే! ఒకటి రెండు ఘటనలు జీవితం కాదు. అదొక సజీవవాహిని. జీవితమంటే జీవించిందే కాదు, జీవించాలకున్నది కూడా! ఎలా అనుకుని ఎలా జీవించామో? ఎలా జీవించి ఇంకెలా అనుకున్నామో? అదంతా జీవితమే! కలలు, కన్నీళ్ళు, బాసలు, భావనలు, ఆశలు, ఆశయాలు, జయాలు, అపజయాలు అన్నీ- అంతా కలబోసిందే జీవితం!

సందేహం లేదు నా జీవితం చిత్రమైందే! కోనసీమలోని ఓ కుగ్రామంలో పుట్టిపెరిగిన ఓ నిర్భాగ్యుడు భాగ్యనగరంలోని కోటీశ్వరుడిగా ఎదగడం వరకూ గల ప్రస్థానం ఒక కావ్యమే. ఉత్కంఠ భరిత గ్రంథమే!

కానదంతా ఇతరుల ముందు పరచగలనా? లేదు లేదు. నేనే కాదు ఎవరూ ఉన్నదున్నట్లు చెప్పలేరు. ఎన్నో కథలూ, కల్పనలూ జోడించి తమకు తాము ఆదర్శంగా చిత్రించుకుంటూ ఉంటారు. జీవిత కథల్లో కన్పించేవన్నీ అర్ధసత్యాలే!

"ఇప్పుడు కాదులే! తర్వాతెప్పుడైనా చూద్దాం! మనస్సు బావోలేదు.."

ఆమె వెళ్ళిపోయింది. కానీ తేనెతుట్టె రేగింది. గతం తాలూకు ఆలోచనల తేనెటీగలు చెలరేగాయి.

ఈ దౌర్భాగ్యస్థితి ఈ నరకయాతన స్వయంగా నేను కొనితెచ్చుకుంది. స్వయంకృతాపరాధం!




**కాం**ట్రాక్టులూ, వ్యాపారాలూ తొలుదొల్త కొంత నిజాయితీగానే, కొంత నీతిమంతంగానే చేశాం.

కానీ తర్వాత్తర్వాత వివిధ డిపార్టుమెంట్ల లోటుపాట్లూ, అధికారుల బలహీనతలూ తెలిశాక, నాయకుల అండదండలు లభించేక లాభకాంక్ష మితిమీరింది. పూర్తి అవినీతిమయంగా వ్యాపారం సాగింది.

కాంట్రాక్టు పనులు లోపభూయిష్టంగా చేశాం. కొన్ని పనులు చెయ్యకుండానే చేసినట్లు రికార్డులు సృష్టించాం. కమీషన్

లిచ్చి గ్రాంటుల్ని స్వాహా చేశాం.

డబ్బు కుప్పతెప్పలుగా వచ్చిపడింది. పేరూ పలుకుబడీ విపరీతంగా పెరిగింది.

మెల్లగా రియల్ఎస్టేట్, చిట్‌ఫండ్, ఫైనాన్స్ రంగాల్లోకి విస్తరించాను. అబ్బాయిలిద్దరూ మరో రెండు చేతులయ్యారు.

మరికొందరు భాగస్తుల్ని కలుపుకున్నా మేనేజింగ్ పార్టనర్నీ, ప్రధాన సూత్రధారుడ్నీ నేనే. అధికార అనధికార ప్రముఖుల్తో ఉన్న సంబంధ బాంధవ్యాల వల్ల ఇట్టే అల్లుకుపోయాను.

నగరంలో ప్రముఖ వ్యాపారవేత్తగా మారిపోయాను. రాజకీయపార్టీలకి భారీగా చందాలివ్వడం, కొందరు ఎమ్మెల్యేలని పోషించడం వరకూ ఎదిగాను.

ఎన్నో బ్రాంచీలు ప్రారంభించాం. టర్నోవర్ ఐదు వందల కోట్లు దాటింది.

మానవ రక్తం రుచిమరిగిన పులిలానే మేం కూడా అడ్డదార్లని, అక్రమ సంపాదనని వదల్లేకపోయాం.

స్థానిక నాయకుల, గూండాల సాయంతో అనేక భూముల్ని కబ్జాచేశాం. దొంగ పట్టాలూ, ఫోర్జరీ పత్రాలూ సృష్టించి హౌసింగ్ ప్లాట్లు విభజించి అమ్మేం.

చిట్‌ఫండ్స్‌లో స్కీములూ, ప్రైజులూ పెట్టి అత్యధికంగా ప్రచారం చేసి, మార్కెటింగ్ స్టాఫ్‌ని నియమించి మార్కెట్లో మంచి షేర్ సంపాదించాం. సినిమా తారలని తీసుకొచ్చి బంపర్‌డ్రాలతో ఖాతాదారుల్ని బురిడీ కొట్టించాం.

ఇక ఫైనాన్స్ కంపెనీలో డబ్బు దాచుకునే వారిని ఆకర్షించడానికి అత్యధిక వడ్డీని ఎరవేశాం.

వారికంత వడ్డీ చెల్లించాలంటే మేం మరింత ఎక్కువ వడ్డీ సంపాదించాలి. అప్పుడే కంపెనీ వారికి చెల్లించ గలుగుతుంది. కానది కష్టసాధ్యమైన పని అని మాకు తెలుసు. అయినప్పటికీ కల్లబొల్లి కబుర్లు చెప్పి ఇన్వెస్టర్లని ఆకర్షించాం.

ఫైనాన్స్ కంపెనీ సేకరించిన డిపాజిట్లని సినీనిర్మాతలకీ, ప్రముఖ కాంట్రాక్టర్లకీ, బిల్డర్లకీ, రాజకీయనాయకులకీ అధిక వడ్డీకి అప్పులిచ్చాం. కొన్ని బాకీలు వసూలు కావని తెలిసి కూడా కొన్ని సంబంధాలు మెరుగు పరచుకోవడానికి ఇచ్చాం.

చిట్‌ఫండ్ డబ్బు ఫైనాన్స్‌లో, ఫైనాన్స్ డబ్బు రియల్ఎస్టేట్‌లో పెడుతూ అన్నివిధాలా వ్యాపారాల్ని అభివృద్ధిచేస్తూ వచ్చాం. మా ఆస్తుల్ని ఇబ్బడిముబ్బడిగా పెంచుకున్నాం.

కానీ ఫైనాన్స్ కంపెనీ ద్వారా ఇచ్చిన అప్పులు మేం ఆశించినట్టు సమయానికి వసూలు కాకపోయేసరికి టర్నోవర్‌కి ఇబ్బంది ఏర్పడింది.

పెద్ద డిపాజిటర్లకి సకాలంలో డిపాజిట్ సొమ్ము తిరిగి చెల్లించలేక కొంత జాప్యం చేస్తూవచ్చాం. మార్కెట్లో మా సంస్థకు ఉన్న పేరుప్రతిష్ఠలకి భంగం వాటిల్లే పరిస్థితి వచ్చిపడింది.

దానిని అధిగమించడానికి కొత్త డిపాజిట్ స్కీం ప్రవేశపెట్టాం. గిట్టుబాటు కాకపోయినా ఇరవై శాతం వరకూ వడ్డీని ఆఫర్ చేశాం. పాతిక వేలు డిపాజిట్ చేసిన వారికి గోల్డ్ డాలర్ బహూకరించాం. ఆ ట్రిక్ బాగా పనిచేసింది. కోట్లాది రూపాయలొచ్చిపడ్డాయి.

ఆడపిల్లల పెళ్లిళ్ళకీ, మగపిల్లల పైచదువులకీ, సొంత ఇల్లు ఏర్పరచుకోవడానికీ దాచుకున్న సొమ్ముని మా కంపెనీలో మదుపుచేసేట్టు ఆకర్షించగలిగాం. రిటైరైన ఉద్యోగుల రిటైర్మెంట్ బెనిఫిట్స్‌నీ మధ్యతరగతి జనం కడుపు కట్టుకుని చేసిన పొదుపు సొమ్మునీ లాగేసుకోగలిగాం.

మార్జిన్ అస్సల్లేకపోయినా, నష్టాలు పెరిగిపోతున్నా కల్లబొల్లి బ్యాలన్స్‌షీట్లతో ఖాతాదారుల్ని మోసగిస్తూ ముమ్ముందుకు సాగిపోతూ వచ్చాం.

హఠాత్తుగా సిటీలో రియల్ ఎస్టేట్ కుప్పకూలింది. ప్లాట్లలో, అపార్ట్‌మెంట్ల నిర్మాణంలో చాలా సొమ్ము చిక్కుబడిపో యింది. అమ్మకాలు ఆశించిన స్థాయిలో లేకపోయేసరికి రుణభారం హౌసింగ్ కంపెనీకి గుదిబండగా మారింది!

అదే సమయంలో చిట్ ఫండ్ వ్యాపారం కూడా మందగించింది. పోటీని తట్టుకోడా నికీ, గొప్పకోసమూ ఏకంగా పదిలక్షల చిట్ ప్రారంభించాం. అది బాగా దెబ్బతీ సింది. ఈ సంస్థ సొమ్ము మా ఇతర సంస్థలకి మళ్ళించడం వల్ల చీటీలు పాడిన వాళ్లకి సకాలంలో డబ్బు చెల్లించలేని దుస్థితి దాపురించింది.

అసలే ఊపిరాడటం కష్టంగా వుంటే, మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్టు రిజర్వ్‌బ్యాంక్ కొన్ని ఆంక్షలు విధించింది. డిపాజిట్ల మీద ఇచ్చే వడ్డీరేట్ల గురించీ, కేపిటల్ గురించీ, రానిబాకీల గురించీ కొత్త నిబంధనలు ప్రవేశపెట్టింది.

దారుణమైన 'లిక్విడిటీ సమస్య' వచ్చిప డింది. మేం పూర్తిగా చతికిలబడిపోయాం.

డిపాజిటర్లు దాచుకున్న సొమ్ము తిరిగి చెల్లించలేని అసహాయులమయ్యాం. వడ్డీ రేటు తగ్గించినందున గడువు పూర్తయిన వెంటనే డిపాజిటర్లు సొమ్ము వాపసు ఇచ్చేయమని భీష్మించుకు కూర్చున్నారు.

తిమ్మిని బమ్మిని చెయ్యాలని చూశాం. కుదరలేదు.. గొడవలూ, కేసులూ, నోటీ సులూ, అనుమానాలూ, అపనమ్మకాలూ వ్యాపించాయి!

మీడియా డేగకన్ను మా మీద పడింది. రకరకాల కథనాలు రాశాయి. అది అగ్నికి ఆజ్యంపోసింది. మరింత డ్యామేజ్ జర క్కుండా డబ్బు వెదజల్లి వారి నోళ్లు మూయించాం.

కానీ మంటలు చల్లారలేదు. ఖాతాదా రులు మా సంస్థల మీద దాడి చెయ్యసా గారు. దాంతో కొన్ని బ్రాంచీలు మూసె య్యక తప్పలేదు.

పెద్దనోరున్న వాళ్ళకి డబ్బులు చెలిస్తూ, దువ్వుతూ, గొడవ పెద్దది కాకుండా చూడ టానికి ప్రయత్నిస్తున్నాం.

మా దురదృష్టం కొద్దీ ఎవరూ ఊహిం చని విధంగా ఓ ఘోర సంఘటన జరిగి పోయింది. అదీ నా కళ్ళముందే జరి గింది. దాంతో మా పరిస్థితి పూర్తిగా చెయ్యిదాటిపోయింది!

మా సంస్థలో డబ్బుదాచుకున్న ఒక డిపాజిటర్ తిన్నగా నా ఛాంబర్‌లోకి దూసుకొచ్చాడు.

తన భార్య ఆపరేషన్ ఆగిపోయే పరి స్థితి వచ్చిందనీ, వెంటనే తనకి రావాల్సిన సొమ్ము ఇప్పించమని వేడుకుంటూ నా కాళ్ళమీద పడ్డాడు.

మా బ్రాంచిల్లో, ఆఫీసుల్లో డిపాజిటర్లు గొడవ చేశారు గానీ, ఎవరూ నా దగ్గరకి రాలేదు. మావాళ్ళు రానివ్వలేదు.

కానీ ఇతడు దూసుకురావటమే గాక, నా కాళ్ళు పట్టుకుని వదల్లేదు.

"రికార్డులు చూడనియ్! నీకివ్వాల్సొస్తే పువ్వుల్లో పెట్టి ఇప్పిస్తాను" అన్నాను.

వెంటనే తన చంకలోని బ్యాగ్‌లోంచి ఫిక్సెడ్ డిపాజిట్ రశీదులు బయటికి తీసి నా చేతిలో పెట్టాడు.

"నా భార్యకు ఆయుష్షుపోయండి! మీకీ సొమ్ము ఎక్కువ కాదు. నాకు మాత్రం చాలా ఎక్కువ. ఈ సొమ్ము చేతికందక పోతే ఆపరేషన్ ఆగిపోతుంది. నేను ఎలా గోలా డబ్బు తెస్తాననీ, తనని బతికిస్తాననీ ఆసుపత్రిలో ఆశగా ఎదురుచూస్తోంది నా భార్య. కరుణించండి. నా భార్యకు పచ్చని బతుకు ప్రసాదించండి!" దీనంగా కాళ్ళా వేళ్ళా పడ్డాడు.

పోనీలే అని అతడికి చెల్లిస్తే మర్నాటికి వేలాదిమంది వచ్చిపడతారు. అందరికీ డబ్బుచెల్లిస్తూపోతే మాకు చిప్పే గతి!

'చూస్తాను'.. 'చేస్తాను' అని ఎంత

చెప్పినా వినలేదు. ఒళ్ళుమండి, "వీడ్నెలా లోపలికి రానిచ్చారు?" అంటూ సెక్యూరిటీ మీద కళ్ళు మూసుకుని పడ్డాను.

మరుక్షణం వాళ్ళతడ్ని ఒకరకంగా బయటికి ఈడ్చుకుంటూ పోయారు.

మా ఆఫీసువాళ్ళంతా చూస్తూండగానే అతడు సెక్యూరిటీ వాళ్ళ పట్టు విడిపించుకుని క్షణాల్లో అద్దాల గోడలోంచి బయటికి దూకేశాడు.

అయిదో అంతస్తు నుంచి దూకాడేమో అక్కడికక్కడే చచ్చాడా పిచ్చోడు!

నన్నక్కడ్నుంచి వేగంగా తప్పించేసి.. పోలీసులకీ, అంబులెన్సుకీ ఫోన్ చేశారు.

ఎవరో 'పిచ్చోడు' అని చిత్రించారు. పోలీసులు ముక్కు ఎగబీల్చారు. డబ్బు కట్టల వాసన చూపించాక గానీ వాళ్ళు శాంతించలేదు.

చనిపోయినవాడి కూతురు తన తండ్రి డిపాజిట్ సొమ్ము వాపస్ చెయ్యమని నిలదీసినందుకు కక్షకట్టి పైనుంచి తోసేశారని పేపర్లకెక్కింది. కేసు పెట్టబోతే పోలీసులు తీసుకోలేదు. హైకోర్టుకి లేఖ రాసింది.

సుమోటో పిటీషన్‌గా స్వీకరించారు. అది తెలిసి డిపాజిట్‌దార్లంతా పొలోమంటూ హైకోర్టులో తలో పిటీషన్ తగిలించారు దానికి.

శతవిధాలా ప్రయత్నించాం గానీ, ఏ ప్రలోభానికీ.. ఒత్తిడికీ ఆ జడ్జి లొంగలేదు.

మూడునెలల్లోగా అందరికీ డబ్బు చెల్లించమని ఆదేశించారు.

మా ఆస్తులన్నీ అమ్మితే గానీ అందరికీ చెల్లించలేం.

అందుకని కొందరికి చెల్లించి, అందరికీ చెల్లించినట్లు దొంగ రశీదులు సృష్టించి కోర్టుకు సమర్పించాం.

జడ్జి ఆగ్రహిస్తే తక్షణం నన్ను అరెస్టు చెయ్యమని ఆదేశించవచ్చన్న భయంతో నన్ను దూరప్రాంతానికి వెళ్ళిపొమ్మన్నారు.

మా ఊరికన్నా సురక్షిత ప్రదేశం ఉండదని ఇక్కడికి వచ్చేశాను!

చాలా రశీదులు బోగస్‌వని తేలిందిట. దాంతో జడ్జి ఆగ్రహించి నా కంపెనీ ఆస్తులన్నిటినీ జప్తు చేయాలని ఆదేశించినట్లు ధనేష్ చెప్పాడు.

దాన్ని ఆపాలంటూ పిటీషన్ పెడతామని ప్లీడరు చెప్పారట! రేపు ఏమవుతుందో మరి?

జప్తు చేసేస్తే? కంపెనీ ఆస్తులన్నీ పబ్లిగ్గా వేలంవేస్తే? అదీ చాలక నన్ను అరెస్టు చేస్తే? జైల్లో చిప్పకూడు తింటూ..!

"నో" బిగ్గరగా అరిచాను.

మూర్తి పరుగున వచ్చాడు "ఏం జరిగిందిరా? .."

**కొత్తగాలి...** 

**అత్తాకోడళ్లు**
**సజాతి ధ్రువాలు**
**అందుకేనేమో మరి**
**వికర్షించుకుంటారు!**

– వాసాల నరసయ్య,
మెట్‌పల్లి, కరీంనగర్ జిల్లా

"అదీ..! మరీ..!"

"నాక్కూడా చెప్పకూడని రహస్యమా? సరేలే ముందు నువ్వు ధైర్యంగా వుండు చాలు! ఊహ తెలిసినప్పట్నుంచీ గోదావరిని చూస్తున్నాం. ఎన్నిసార్లు వరదలు రాలేదు? ఎన్నిసార్లు ఉగ్రగోదావరియై భయపెట్టలేదు? కానది తాత్కాలికమే. మళ్ళీ యథాప్రకారం ప్రసన్న గోదావరిగా మారిపోతుంది. మనల్ని ఎప్పట్లా చల్లగా చూస్తుంది. జీవితంలో కూడా ఒక్కోసారి వరదలొస్తాయి. గాలివానలొస్తాయి. తుపానులూ వస్తాయి. కానీ ఎంతటి తుపానైనా రెండు మూడురోజుల్లో శాంతిం

చక తప్పదు. అవొచ్చినప్పుడు తట్టుకుని ధైర్యంగా నిలబడాలి. అంతేతప్ప, భీరువై వెన్నిచ్చి పారిపోతే ఎలాచెప్పు? "

'నిజమేరా! నీ మాటలకి నాకూ ధైర్యం వస్తోంది. ప్రస్తుత పరిస్థితి ఒక తాత్కాలిక దశ మాత్రమే. సముద్రానికి ఆటపోటులె లాగో మనిషికి ఒడిదొడుకులు అలాగా! ధైర్యంగా నిలబడితేనే పరిష్కరిలంచగలం. ఇక నా మనోధైర్యాన్ని సడలనివ్వను.. ప్రామిస్!' అనుకున్నాను.

సెల్ మోగింది. గబుక్కున వెళ్ళి చేతుల్లోకి తీసుకున్నాను.

"కోర్టు ఫైనాన్స్ సంస్థల ఆస్తులు జప్తుచెయ్యమంది. అవేమీ పెద్దగా లేవు. ఉన్నదంతా రుణాల రూపంలో ఉన్న సంగతి మీకు తెలుసుగా డాడీ! మీరేం వర్రీ కాకండి. మన సొంత ఆస్తుల జోలికి రాకపోవడం మనం అదృష్టం. గండం గడిచినట్టే! ఇక రారు..!"

పెద్దోడి మాటలకు ఉప్పొంగిపోయాను.

"గుడ్ న్యూసా? " అడిగాడు మూర్తి.

"గుడ్.. గుడ్డర్.. గుడ్డెస్ట్ న్యూస్..!" బిగ్గరగా నవ్వేను.

"స్కూల్ రోజుల్ని మర్చిపోలేదు" తనూ నవ్వుతూ అన్నాడు.

★ ★ ★

"రేపు నిన్ను చూసుకోవడానికి పెళ్లివాళ్లొస్తున్నార్టగదా గౌతమీ!"

చేతిలోని పని వదిలిపెట్టి చతికిలబడిపోయిందా అమ్మాయి.

"అమ్మ గుర్తొస్తోంది బాబాయ్!"

"ఆడపిల్లలకి పెద్దమనిషయినప్పుడు, పెళ్లయినప్పుడు, పురుడొచ్చినప్పుడు తల్లే కదా పెద్దదిక్కు"

"ఎన్ని జన్మలెత్తినా తల్లిరుణం తీర్చుకోలేం. మనం బతుకంతా సేవ చేసినా, మనల్ని కనేప్పుడు ఆమె పెట్టిన పురుటి కేకల్లో ఒక్క కేకకి కూడా సరిపోదు. తల్లి ప్రేమకి పరాకాష్ఠ అయిన కథ మీకు తెలుసు కదా బాబాయ్? "

"నీకు తెలిసింది చెప్పు"

ఈ తండ్రీ కూతుళ్ళు భలేవాళ్ళు. వినేవాళ్ళుంటే గంటకో హరికథ చెబుతారు!

"కన్న తల్లికోసం అమృతం తెచ్చిన గరుడిడి కథ కాదు. ఇంకో కథ. ప్రియురాలి ప్రేమలో పడి ఆమె కోరిక ప్రకారం తల్లి గుండెని కానుకగా ఇవ్వడానికి తీసుకెళుతున్నాడో బిడ్డ. ఎదురుదెబ్బ తగిలింది. ముందుకి తూలి పడి పోబోతోంటే ఆ తల్లి గుండె 'నాన్నా! దెబ్బ తగుల్తుందిరా! జాగ్రత్తగా చూసి నడవరా కన్నా!' అందిట!"

నా గుండె బరువెక్కింది.

"బాల్యం అమ్మతో పెనవేసుకున్నందునే ఎంతో మధురంగా వుంటుంది. వీలుచిక్కితే మళ్ళీ బాల్యంలోకి వెళ్ళిపోవాలనిప్పిస్తోంది" అంది చిరునవ్వులు చిందిస్తూ.

నవ్వేను "బావుందమ్మా! చాలా బావుంది! ఇంకో ఏడాదిలో నీ పిల్లలకి బాల్యాన్నివ్వబోతూ ఇప్పుడు బాలగా మారిపోవాలనుందా!"

తెలివైన పిల్ల! మంచి మొగుడు లభిస్తే బావుణ్ణు!

గౌతమిని చూసుకోవడానికి పెళ్లివాళ్లొచ్చారు. అయిష్టంగానే 'పెద్దమనిషి'గా నిలబడక తప్పలేదు.

కుర్రాడు బావున్నాడు. ఏదో బ్యాంకులో చేస్తున్నాట్ట! అతడి మేనమామ 'దొంగమాదొచ్చోద్'లా ఉన్నాడు. తండ్రికి నోరూ వాయీలేవు.

"అమ్మాయ్! ఏదైనా కీర్తన పాడతావూ! ఏవిటి.. సినిమా పాటలొద్దు సుమా!" మేనమావ చెంచు రామయ్య అన్నాడు, సకిలింపు నవ్వు నవ్వుతూ..

మా అమ్మ గుర్తొచ్చింది.

పాట పాడమంటే చాలు తీయని గొంతెత్తి కోయిలలా పాడేది. మా నాన్న పోయాక ఆమెని ఒక్కరూ పాడమన్లేదు. మా ఇంట్లో రాత్రివేళ ఒంటరిగా విషా

అక్షరం

అపజయం అనే జబ్బును
నయం చేయడానికి సరైన మందులు
నమ్మకం, శ్రమ..
అవే నిన్ను అజేయుడిగా నిలుపుతాయి

– అబ్దుల్ కలాం



దాన్ని నొక్కిపట్టి నాకు చిచ్చుకొడుతూ పాడిన పాట ఇంకా నా గుండెల్లో మారు మోగుతూనే వుంది.

"అదివొ అల్లదివొ శ్రీహరి వాసమూ.." కమ్మగా పాడుతోంది గౌతమి.

శ్రీహరి వాసం ఎక్కడుంది? తిరుపతి కొండమీదా? బంజారాహిల్స్‌లోనా? గోదావరి గుండెల్లోనా? కోనసీమ ఆకుపచ్చని ఒడిలోనా? మనిషి శ్రమలోనా? ఎక్కడుంది? తృప్తిలోనా? తృష్ణలోనా? త్యాగంలోనా? సేవలోనా? స్నేహంలోనా? ప్రేమలోనా? మంచిలోనా? మమతలోనా? మనిషిలోనా? శ్రీహరి నివసించేదెక్కడ? ఎక్కడ?

"మావాడి కోసం ఓ సినిమా పాట- ఏవిటి చక్కని సినిమా పాట పాడమ్మాయ్" గుర్రపు సకిలింపులు నవ్వుగాడే అడిగాడు.

"వేదంలా ఘోషించే గోదావరి.."

ఆ పాటలో గోదావరి ఉరకలు కన్పించాయి.. గలగలలు విన్పించాయి. ఆరుద్ర రాసిన ఆ పాట గుండెలోతుల్ని తడుముతోంది. గోదావరి ప్రాంత వాసులకి గోదావరి మీద గల అభిమానాన్నీ, ఆరాధననీ, కృతజ్ఞతనీ, పవిత్రభావనన్నీ కలగలిపి అక్షరరూపం ఇచ్చాడా మహాకవి!

అబ్బాయితోనూ అతడి తండ్రితోనూ గుసగుసలాడాడు చెంచు రామయ్య.

"అమ్మాయి నచ్చిందనే అంటున్నాడు మావాడు. ఏవిటి, ఇహ ఇచ్చి పుచ్చుకోవటాల గురించి ఓ మాట అనుకుంటే శుభం అనేసుకోవచ్చు"

"నాకు రెండెకరాల కొబ్బరితోట, నాలుగెకరాల ఊడ్పు భూమి, ఈ ఇల్లూ వున్నాయి. ఎకరం తోటా, ఈ ఇల్లూ తప్ప మిగిలినదంతా మా అమ్మాయి పేరున రాసిచ్చేస్తాను. పెళ్లి ఖర్చుల నిమిత్తం యాభై వేలిస్తాను"

"ఈ ఇల్లూ, ఎకరం తోటా మీ తదనంతరం పిల్లకి చెందేలా రాస్తారా ఏవిటి? "

"రాయను! అది మా అమ్మాయికి ఇవ్వటోవటం లేదు! ఎవరైనా డాక్టర్ ఇక్కడికొచ్చి ఈ ఇంట్లో ప్రాక్టీసు పెడతానంటే అతడికీ ఇంటినీ, దీని నానుకుని ఉన్న ఎకరం కొబ్బరి తోటనీ రాసివ్వాలని మా కోరిక.. మా నిర్ణయం"

"ఏవిటో మీకు తోచి చావడం లేదు. ఎకరం తోటంటే ఇరవై లక్షలు!"

"ఎంతయినా కానివ్వండి! మేం ఒక కార్యానికి వినియోగించాలనుకున్నాం! దయచేసి దానికడ్డు పడొద్దు!" చేతులు జోడించాడు మూర్తి.

"మీ పద్ధతేం నాకు నచ్చలేదు. ఏవిటి.. ఇంటిని డాక్టరుకి రాస్తారో నర్సుకి రాస్తారో రాసుకోండి. కానీ తోటని మాత్రం రాయొద్దు! ఏవిటి.."

"మన్నించండి..!"

"నీ కూతురి పెళ్లిరా! మరీ ఇంత మొండితనం పనికిరాదు..!" నచ్చ చెప్పబోయాను.

"మీరెళ్లొచ్చు..!"

మూర్తి మాటలకు రుసరుసలాడుతూ వెళ్ళిపోయారు. మధ్యవర్తి మాత్రం మిగిలిపోయాడు.

"నేనివ్వబోయేదేమిటో వాళ్ళకి ముందే

చెప్పేను. అందుకిష్టపడి, వచ్చేక మళ్ళీ తిర గదోడడం ఎందుకు చెప్పు? "

"మగపెళ్లివాళ్ళు నాలుగు రాళ్ళు గుంజుకోవాలని చూడటం సహజమేరా. పెళ్లిచూపుల దాకా వచ్చి ఆగిపోతే మనకు తలవంపులురా! పోనీ అరెకరం తోట గౌతమికి రాసిస్తానని చెప్తే? "

"వీలుపడదురా! రాతకోతలవ్వలేదన్న మాటేగానీ మానసికంగా ఎప్పుడో దఖలు చేసేశాను. ఏటా తోటమీద వచ్చే ఫలసాయం ఇన్సెంటివ్‌గా పనిచేస్తుందనీ యంబీబీయస్ డాక్టర్ని ఆకర్షిస్తుందనీ నా ఆశ. ఆ రకంగా ఈ ఊరికి వైద్యసదుపాయం కల్పించిన వాడ్నవుతానని నా తాపత్రయం"

"ఫూలిష్‌నెస్! వైద్యసౌకర్యం కల్పించడం ప్రభుత్వ బాధ్యత. దాన్ని నీ నెత్తికెత్తుకోవడం మూర్ఖత్వం. మంది సుఖం కన్నా, మన సుఖం ముఖ్యం. ఈ కారణం వల్ల సంబంధం తప్పిపోతే ఎంత అప్రతిష్ఠో ఆలోచించు. నా మాట విను!"

"వినను! నేను తలపెట్టిన కార్యంలో కించిత్తు రాజీకూడా సహించను. మల్కిపురం నుంచి డాక్టరు రావడం ఆలస్యమయ్యుంటే నువ్వేమయ్యేవాడివో ఒక్క క్షణం ఆలోచించు.."

మరి నోరెత్తలేకపోయాను. బీపీ గనుక బతికి బట్టకట్టాను గానీ, అది హార్ట్‌ఎటాక్ అయితే ఇంతే సంగతులయ్యేవి!

★ ★ ★

గౌతమి ఇంట్లో కన్పించలేదు. మూర్తి స్కూలుకెళ్ళిపోయాడు. 'పెళ్లిచెడిపోయిందని అఘాయిత్యం చేసుకోలేదు కదా?' ఇల్లూ తోటా వెదికి గోదావరి దగ్గరకు పరుగుతీశాను.

నదితో మాట్లాడుతూ కనిపించింది.

తల్లిలేని బిడ్డ! ఎన్నోవిషయాలు తల్లితో పంచుకోవాలని తల్లి ద్వారా ఎన్నెన్నో తెలుసుకోవాలనుకునే వయస్సు!

ఆ అవకాశం లేకపోయేసరికి గోదావరిలోనే తల్లిని చూస్తూ తన దుఃఖాన్ని నదితో పంచుకుంటోంది!

గుండెలు బరువెక్కాయి. తల్లి విలువ.. తల్లిలేని ఆమెకి తెలిసింది. తల్లి బతికుండగా ఆమె విలువ నాకు తెలీలేదు!

అసలు నా విజయయాత్రలో ఎప్పుడూ అమ్మని తలచుకోలేదు. కనీసం నా పిల్లలకెవరికీ అమ్మ పేరు పెట్టుకోలేదు. అత్తగారి పేరూ మావగారి పేరూ పెట్టానంతే!

అమ్మ వుండి వుంటే ఆమె ఒడిలో తలవాల్చి సేదదీరేవాడ్ని. ఎవ్వరికీ చెప్పుకోలేక లోలోపల రగుల్తూ కాల్చేస్తోన్న వ్యథ.. మథన అన్నీ అంతా అమ్మకి చెప్పి గుండె బరువు దించుకునేవాడ్ని! ఆమె పాట వింటూ ప్రశాంతంగా నిద్రపోయేవాడ్ని!

ఎంత గొప్పవాడైనా సరే తల్లిలేని వాడు దుఃఖితుడే! దురదృష్టవంతుడే!!

తల్లిలా లాలిస్తూ ఆమెలేని లోటు భర్తీ చేయాల్సిన భార్య కూడా నన్నర్థం చేసుకునే మనిషి కాకపోవడం నా దౌర్భాగ్యం!!

ఎందుకో రాకుమారి గుర్తొచ్చింది. ఆ వెంటనే అశోక్ గుర్తొచ్చాడు. గౌతమిని అతడికిచ్చి పెళ్లిచేస్తే?

★ ★ ★

మూర్తి అంగీకారం తీసుకొని రాకుమారి వాళ్ల ఇంటికి వెళ్లాను.

"మేనమామ బాధ్యత తీసుకొని ఈ పెళ్లి కుదుర్చు వేణూ" అంది రాకుమారి.

వచ్చిన పని అదే అయినా ఏం చెప్పాలో తోచలేదు. ఎంచేతో ఒక చిన్న బాణం వదిలి గాయపర్చాలన్పించింది.

"నీకు బోల్డంత కట్నం కావాలిగా!"

"అంతా నీలాగే డబ్బు వెంట పరుగెడతారనుకున్నావా ఏవిటి? !"

చాచి లెంపకాయ కొట్టినట్టన్పించింది. వెర్రినవ్వు నవ్వుతూ అన్నాను "నీ కళ్ళకి డబ్బు పిచ్చోళ్ళా కనబడుతున్నానన్నమాట!"

"అది నీకే తెలియాలి"

రాజ్‌కుమార్ వంక తిరిగి అన్నాను "న్యాయం మీరే చెప్పండి. చిన్నప్పుడు తనేమో రాకుమారుడు కావాలి.. రావాలి.. అంటూ ఉవ్విళ్ళూరేది. ఆ సంగతి మరచి పోయి నన్ను డబ్బు మనిషంటూ నింది స్తోంది. ఎవరు డబ్బు మనిషో మీరు తేల్చిచెప్పండి"

అతడు నోరు విప్పేలోగానే ఆమె అందు కుంది "నేను రాకుమారుడు కావాలనుకు న్నాను గానీ రాజ్యాలూ.. భోగాలూ కావా లని కోరుకోలేదుగా. నువ్వేమో ధనరాజ్యం కోరుకున్నావు"

"ఆ రూట్లో వచ్చేవా? నీకో నమస్కారం గానీ తల్లీ నన్నొదిలెయ్" అంటూ సరదాగా చేతులు జోడించాను!

"మా రాకుమారి మాటకి తిరుగులేదను కోండి!" రాజ్‌కుమార్ అన్నాడు.

"అక్కడికి పెత్తనం మొత్తం నా చేతికిచ్చే సినట్టు మాట్లాడతారేం!" సరదాగా కోప్ప డిందామె భర్త మీద.

"అధికారం కావాల్ట, ఇచ్చెయ్యండి రాజ్ కుమార్‌గారూ! ఇహ మీరు నవాబులా హాయిగా హుక్కా పీలుస్తూ నిశ్చింతగా గడిపేయొచ్చు!"

నా మాటలకి పగలబడి నవ్వేరిద్దరూ.

"ఇవాళే మాస్టారితో మాట్లాడు వేణూ!" అని కోరింది.

"నువ్వు నిజంగా రాకుమారివే! నీ ఔదార్యం, నీ డిగ్నిటీ, నీ చొరవ, నీ డెసి షన్ మేకింగ్ - ఎవరికీ ఉండవు!"

"కొత్తగా భజన కార్యక్రమం మొదలుపె ట్టావేంటి సంగతి? ఇదివరకు నోట్లోంచి మాటే వూడిపడేది కాదు!"

అందంగా నవ్విందామె.

"మూర్తిని ఒప్పించే పూచీనాది. కానీ నాకు కట్నంలో పదిశాతం కమీషనివ్వాలి"

"మాకేం కట్నం అక్కర్లేదు, అంతా నువ్వే తీసేసుకో"

# చతుర ప్రవేశిక

## సెప్టెంబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. వేణుగోపాలరావు తల్లి?
జ.
2. వేణుగోపాలరావు బాల్యమిత్రుడు?
జ.
3. మూర్తి పెళ్లి ఎక్కడ జరిగింది?
జ.
4. మూర్తి కూతురు?
జ.
5. గౌతమి గొయ్యిలో ఏం నాటింది?
జ.
6. వేణుగోపాలరావుకు ఎందరు కొడుకులు?
జ.
7. నాగేసర్ తండ్రి?
జ.
8. నాగేసర్ తమ్ముడు?
జ.
9. లాటిన్‌లో ఆనియన్ అంటే?
జ.
10. 'అనుభవం' నవలారచయిత?
జ.

పంపినవారి పేరు: ------------------------------------ వయసు (   )

చిరునామా: ---------------------------------------------------

------------------------- పిన్‌కోడ్ :      ఫోన్ నెం :

చిరునామా : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

గడువు తేదీ 17

"అయితే ఇంకేం? పెళ్లి ఖాయం! పప్పన్నానికి ఏర్పాట్లు చేసెయ్యండి!" ఉత్సాహంగా అన్నాను.

"వేణుగారూ! మాకు కట్నం పట్టింపులేం లేవు. మాకున్నది మాకు చాలు! వాళ్లమ్మాయికి ఏమిచ్చినా, ఇవ్వకపోయినా అభ్యంతరం లేదు. ఈ వేసవిలోనే ముహూర్తం పెట్టుకోవచ్చని చెప్పండి. కుదిర్తే మీరుండగానే ఈ నెలలోనే పెట్టేసుకుందాం!"

అవాక్కయి చూశాను! అభినందిస్తూ చూశాను! మా ధనేష్ పెళ్లిని ఓ పావుగా ఉపయోగించుకున్నాను. వ్యాపారాభివృద్ధికి తోడ్పడే సంబంధమే చేశాను!

కానీ వీళ్ళు..!

దానికేంలే- ఒక్కో నదిది ఒక్కోతీరు! ఒక్కో ప్రయాణం! పోలికలనవసరం.

"ఏకంగా ముహూర్తం పెట్టించుకొచ్చేస్తాను చూడండి" అని చక్కా వచ్చాను.

★ ★ ★

'హరేరామ హరేకృష్ణ...' అంటూ జపం చేస్తూ ఇంటి ముందు నుంచి వెళ్తోందో ముసలావిడ.

నేవచ్చినప్పట్నుంచీ ప్రతిరోజూ ఏదో ఒక సమయంలో ఆమె కన్పిస్తూనే ఉంది.

కన్పించిన ప్రతిసారీ మడిగట్టుకుని గుడి కెళ్తూనో.. గుడి నుంచొస్తూనో ఉంది. నుదుట శ్రీచూర్ణపు నిలువుబొట్టు, తెల్లటి అడ్డబొట్టూ ధరిస్తోంది. చేతిలోని పళ్ళెంలో కొబ్బరికాయా, పువ్వులూ ఉంటాయి. ఏదీ పట్టించుకోదు. తన మానాన తను 'హరే రామ హరేరామ రామరామ హరేహరే! హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే!' అంటూ వల్లిస్తూంటుంది.

ఆవిడెవరో తెలుసుకోవాలన్న కుతూహలం కలిగింది.

"ఆవిడ్ని గుర్తుపట్టావా? శిథిలాల్ని

చూసి కోటని పోల్చుకోవడం కష్టమే అనుకో! కాంచనమాల.. రాయుడుగారి ఉంపుడుగత్తెరా!" అన్నాడు మూర్తి.

"మైగాడ్! ఆవిడిలా..!"

"'ఏవి తల్లీ! నిరుడు కురిసిన హిమస మూహములు? ' అని ప్రశ్నిస్తే ఏం లాభం చెప్పు? ఇదీ అంతే! గంగానది గురించి చెప్పిన 'ఆకాశంబున నుండి శంభుని శిరం బందుండి..' అన్న పద్యం ఒక్కసారి గుర్తు చేసుకో చాలు!"

"నమ్మలేకపోతున్నాను"

"కొన్ని జీవితసత్యాలు నమ్మలేం! కానీ నమ్మక తప్పదు!"

ఎలాంటి తడబాటూ లేకుండా నెమ్మ దిగా, తాపీగా నడిచెళుతున్న ఆమె వంక విస్మయంగా చూశాను.

వడలిన శరీరం, నేత చీర, మెడలో తులసిమాల, ముగ్గుబుట్ట లాంటి తల - ఇలా వున్న ఈమె ఎక్కడ? వగలూ వయ్యారాలూ పోయిన ఆ యౌవన సౌంద ర్యరాశి ఎక్కడ?

ఒకప్పుడు వర్షాకాలంలోని కొండవాగులా ఉన్న ఆమె ఇప్పుడు ఎండిన డొక్కల్తో దైన్యాన్నంతా నింపుకొన్న వేసవి వాగులా ఉంది! ఎంతచిత్రం!

"ఆ వైభోగం మంత్రించినట్టు ఎలా మాయమైంది? " మూర్తిని అడిగాను.

"రాయుడుగారు బతికున్నంతకాలం ఓ వెలుగు వెలిగింది. అప్పట్లో ఆయన దగ్గర్నుంచి రాబట్టి తన వాళ్ళకి అందిం చింది. రాయుడుగారు చనిపోయాక ఆయన కొడుకు ఆమెని తరిమేశాడు. ఆమె డబ్బు మూటలందుకున్న వాళ్ళెవళ్ళూ ఆమెని దరి చేరనివ్వలేదు. ఆమె సొమ్మునీ అప్పగించలేదు. 'నువ్వెలా పోతావో? ఫో!' అని తరిమేశారు. అయినవాళ్ళ మోసానికి గురై అలమటిస్తోంటే రాయుడిగారి భార్య చేరదీసింది"

ఆశ్చర్యంగా.. అపనమ్మకంగా చూశాను.

"తల్లిమాట కాదన్లేక కొడుకు అయిష్టం గానే ఆవిడకేదో ఇంత ఇస్తున్నాడు. మేడ వెనుకనున్న చిన్న ఇంటిలో ఉండనిచ్చాడు. మిథ్యా ప్రపంచపు మాయ గురించి తెలిసి నందున కాబోలు భక్తిలో పడింది. నిత్యం పూజలూ పునస్కారాలూ.. భజనలూ ఆరాధనలూ చేస్తూంటుంది. ఆ మాట ఆమెతో అంటే సుఖంగా, తృప్తిగా, భయర హితంగా, పాపభీతి లేకుండా, నిశ్చింతగా ఉన్నానంటూ చిద్విలాసంగా నవ్వుతుంది!"

శిలాప్రతిమనయ్యాను. అప్రయత్నంగా రమామణి గుర్తొచ్చింది.

నిర్మాతగామారి సినిమా తీశాక ఆమె జీవితమూ తల్లకిందులైపోయింది. ఆ దెబ్బ నుంచి మరి కోలుకోలేక పోయింది. హఠాత్తుగా బుక్కింగులూ తగ్గిపోయాయి. ఇన్‌కంటాక్స్‌వాళ్ల కళ్ళుకప్పడానికి అయి నవాళ్ల పేరున పెట్టిన ఆస్తుల్ని తిరిగివ్వడా నికి వాళ్లు నిరాకరించారు. దాంతో కోర్టు కెక్కింది. ఆ తర్వాతామె సంగతి ఎవరికీ తెలీలేదు. కోర్టు కేసు తెమల్లేదనీ, కర్ణాటక లోని ఏదో ఆశ్రమంలో బతుకు వెళ్ళదీ స్తోందనీ ఈమధ్యే ఎవరో చెప్పేరు!

ఇంతలో నన్ను కలవడానికి చిన్ననాటి మిత్రులొచ్చారు. వారిలో పండుని చూసి పరమానందపడిపోయాను.

"నువ్వేం చేస్తున్నావురా? వ్యవసా యమా? " ఆప్యాయంగా వాడి చేతులు నొక్కుతూ అడిగాను.

"లేదురా! చిల్లరకొట్టు పెట్టాను. కిరాణా వ్యాపారం. నీ బోటివాళ్ల దయవల్ల బాగానే వుంది. మా ఇంటిదాని పేర్న చౌకడిపో డీలర్‌షిప్ కూడా తీసుకున్నాను. ఈమధ్యే పంచాయితీ బోర్డు మెంబరుగా ఎన్నికయ్యాను! "

"గుడ్! గుడ్!! నాకు చాలా చాలా ఆనం దంగా వుందిరా పండూ! మనం హైస్కూల్లో చదువుతున్నప్పుడు కొబ్బరి చెట్టు మీంచి పడి మీ నాన్న చనిపోతే

మీరేమైపోతారోనని ఎంత తల్లడిల్లిపోయానో చెప్పలేను. చిన్నచిన్న చెల్లెళ్ళున్నారు. వెనకేమీ ఆథరవు లేదు.. ఆధారం లేదని ఎంతో ఆవేదన పడ్డాన్రా!"

కళ్ళు తుడుచున్నాడు పండు. బహుశా ఆ రోజులు గుర్తొచ్చి ఉంటాయి!

"చాన్నాళ్లు ఆ ఫీలింగ్స్ వదల్లేదనుకో! తర్వాతెప్పుడో రంగనాయకమ్మ నవల 'కూలిన గోడలు' చదివాను. అది చదివేక కూలిన గోడలు కూలినట్టే వుండిపోవనీ, లేస్తాయనీ నమ్మకం కుదిరింది"

"నేను మొదట్లో నిలదొక్కుకోడానికి ఊరివాళ్లు బాగా సాయపడ్డారు"

"అదే మన సంస్కృతి గొప్పదనం! బతుకు.. బతుకించు అంటుంది" మధ్యలో కల్పించుకుంటూ అన్నాడు మూర్తి.

"అందుకే నడిచొచ్చిన దార్లు మరచిపోకూడదంటారు పెద్దలు"

నుదురు ముడివేసి చూశాను. నా గురించి అన్యాపదేశంగా ఈ అర్భకుడూ ఎత్తిపొడుస్తున్నాడా?




"ఇవాళ శ్రీరామనవమిరా వేణూ! ఊరూరా వాడవాడనా సీతారామకళ్యాణం చేసేది లోకకళ్యాణం కోసమే! 'రామో విగ్రహవాన్ ధర్మః' అన్నారు. అదీగాక ప్రేమిస్తే రాముడిలాంటి వ్యక్తినే ప్రేమించాలి. పాలిస్తే రాముడిలాంటి నాయకుడే పాలించాలి. కొడుకంటే రాముడిలా ఉండాలి. అన్నంటే రాముడిలా ఉండలి. ఇహ మిత్రుడంటే రాముడే. అన్నివిధాల పరిపూర్ణుడు శ్రీరాముడు. ఆయన నడక.. నడత.. వ్యక్తిత్వం.. విలువలు.. ధర్మాచరణ ఏనాటికీ ఆచరణీయాలే!"

మేం వెళ్లేసరికి ఊరు ఊరంతా రామాలయం దగ్గర చేరి సీతారాముల కళ్యాణాన్ని కనులారా తిలకిస్తోంది.

తెలిసినవాళ్లు, తెలియనివాళ్లు చాలా మంది పలకరించారు. యోగక్షేమాలు కనుకున్నారు. క్లుప్తంగా బదులిచ్చాను.

"జన జీవన స్రవంతిపై రామాయణమంత బలవత్తరమైన ముద్రవేసిన కావ్యం మరొకటి లేనేలేదండి. ఆయ్! దేశంలో ఏ మూలకి ఏ ప్రాంతానికి వెళ్లినాసరే రాముడీ ప్రాంతంలో తిరగాడనీ, సీత ఈ కొలనులో స్నానమాడిందనీ కథలుగా చెబుతారండి!" అన్నారు శ్రీరాములుగారు

నాకేమీ తెలీదనుకుంటున్నారో? ఏమో?

"అందుక్కారణం రాముడు ధర్మానికి ప్రతీక. రాముడు ధర్మాన్ని ఉపదేశించలేదు. ఆచరించి చూపాడు. అందుకే అందరికీ ఆదర్శ పురుషుడయ్యాడు. పురుషోత్తముడయ్యాడు!" అందుకున్నాడు మూర్తి.

ఎట్టకేలకు కళ్యాణ కార్యక్రమం పూర్తయింది. రామయ్యకీ సీతమ్మకీ జనం పోటిపడి చదివించారు. ఆ డబ్బుతో పేదసాదలకి అన్నదానం చేస్తారట! నేనూ ఘనంగా చదివించాను.

దేవుడు ఏదో అదృశ్యరూపంలో వచ్చినట్టు వచ్చి, నన్ను ఆదుకోకపోతాడా? అనే ఆశ నన్నందుకు పురిగొల్పింది.

చలిమిడీ వడపప్పు అరటిపళ్లు పంచారు. పానకాలు పోశారు.

ఆ రాత్రి కోలాటం, భజన, తోలుబొమ్మలాట ఉన్నాయంటే మళ్లీ వెళ్లక తప్పలేదు.

కాళ్ళకు గజ్జెలు, మొలకి ఎర్రపంచె, మెడలో దండలు, నుదుట నామాలు

ధరించి యువకులు లయబద్ధంగా తిరుగుతూ కోలాటం భజన చేస్తోంటే నాకు తెలీయకుండా లీనమైపోయాను.

మా చిన్నతనంలోనూ ఇలాగే మధ్యలో పొడుగాటి దీపపు సెమ్మె పెట్టుకొని ఆ దీపపు వెలుగులో భజన చేసేవారు. మేం ముందువరుసలో కూర్చునేవాళ్ళం. మధ్యలో ఇచ్చే టీ కోసం; ఆఖర్న పంచే ప్రసాదం కోసం పోటీపడేవాళ్ళం!

"శ్రీరామచంద్రమూర్తికీ జై.. కాటన్ మహాశయుడికీ జై.."

అదిరిపడ్డాను. అమితాశ్చర్యంగా మూర్తి ముఖంలోకి చూశాను.

"కాటన్‌దొర మన ప్రాంతానికి చేసిన మేలు గురించి మనతరం కన్నా ఈనాటి యువతరం ఎక్కువ గుర్తుచేసుకుంటోంది. అందుకిదే నిదర్శనం"

"నిజమే! కానీ మరీ ఇంత ఇదిగా దేవుడితో సమానంగా..? !"

"కాటన్‌దొర ధవళేశ్వరం వద్ద గోదావరిపైన ఆనకట్ట కట్టకముందు ఈ డెల్టా ప్రాంతమంతా ఆకలి చావులకు, కరువు కాటకాలకు నిలయంగా ఉండేది. అప్పట్లో వచ్చిన పెద్ద కరువుబాధకి కన్నబిడ్డల్ని సైతం అమ్ముకున్నారు. ఉత్తరకోస్తా రోడ్డు ఒక పొడవైనా శ్మశానంగా మారింది. బతికున్న మనిషికీ, శవానికి పెద్దతేడా లేని దురవస్థలో ఆకలితో ప్రజలు అలమటించారు. అప్పట్లో పోలీసు రక్షణ లేకుండా ధాన్యం రవాణా చెయ్యడమే అసాధ్యంగా ఉండేది. ఆకొన్న జనం దాడిచేసి దోచుకునేవారు. అలాటి మరుభూమిలో మల్లెలు పూయించాడు సర్ ఆర్థర్ కాటన్! మనకీ, మన పొలాలికి నీరందించి, మన ప్రాంతానికి జీవం పోసిన ప్రాణదాత ఆయన!"

భారతదేశానికి సంబంధించిన నీరు బంగారంతో సమానమన్నాడు. ప్రతీ నీటి బొట్టును సక్రమంగా ఉపయోగంలోకి తీసుకురావాలని తపించిన మహోన్నత మూర్తి కాటన్ మహాశయుడు.

ఎన్నిజన్మలెత్తితే మాత్రం మనం ఆయన రుణం తీర్చుకోగలం చెప్పు? అలాటి మహోన్నతుల్ని ప్రతి సందర్భంలోనూ గుర్తు చేసుకోవడం నివాళులర్పించడం ఈ గడ్డ మీద పుట్టిన ప్రతి ఒక్కడి కర్తవ్యం. అలాటి మహనీయుల స్ఫూర్తితో యువత ఉన్నత ఆదర్శాల్ని అలవర్చుకుంటారని నా విశ్వాసం"

ఆ సంగతులు నాకు కొత్త. అబ్బురంగా విన్నాను.

"నీకింకో సంగతి తెలుసా? 'నిత్య గోదావరీ స్నాన పుణ్యోదయో మహామతిః- స్మరామ్యాంగ్లేయ దేశీయం కాటనుం తం భగీరథమ్' అంటూ పూర్వం సంధ్యావందనంలో ఒక మంత్రంగా ఆయనను స్తోత్రం చేసి, పుణ్యోదకాలతో అర్ఘ్యం ఇచ్చేవారు!"

చరిత్రలో మిగిలేది చరిత్రగల మహనీయులే! కోట్లు గడించిన వారంతా చరిత్రకెక్కలేరు!

★ ★ ★

"సత్తెయ్య ఆత్మహత్య చేసుకున్నాడు. సత్తెయ్యంటే ఎర్రోడు. మీ తాతకి మేనల్లుడు.." వేదనతో చెప్పాడు మూర్తి.

"ఇప్పుడంత ప్రమాదమే వచ్చిందట? "

"అప్పుల పాలయ్యాట్ట! త్వరగా రా!"

"అప్పుల పాలైనంత మాత్రన ఆత్మహత్య చేసుకోవాలా? అప్పుల్లేని వాళ్ళు ఎంత మంది ఉంటారు చెప్పు? అసలు దేశమే పీకల్లోతు అప్పుల్లో ఉంది!"

"కోట్లకి కోట్లు బ్యాంకు అప్పులు ఎగ్గొట్టినవాళ్ళూ, ప్రభుత్వానికి టోకరా వేసిన వాళ్ళూ హాయిగా కార్లలో తిరుగుతూనే వున్నారు. వాళ్ళని రక్షించడానికి కోర్టులూ, అధికారులూ, నాయకులూ ఎందరో వున్నారు. ఎన్నో చట్టాలున్నాయి. కానీ రైతుని రక్షించే వాళ్లెవరు? ఆదుకునే నాథుడెవరు? "

"మరీ దారుణంగా మాట్లాడకొరేయ్!

పత్తి పండిస్తే బోల్డు లాభం వస్తుందని అధికపెట్టుబడి పెట్టారు. అప్పుచేసి పెట్టుండొచ్చుగాక! నష్టం వస్తే భరించాలి తప్ప, ఇలా ఆత్మహత్య చేసుకుంటే ఎలా? అంతా ఇలాగే చేసుకుంటే ప్రపంచంలో ఒక్కళ్లూ మిగలరు తెలుసా? "

"లోకానికి అన్నం పెట్టే రైతు తనకి లోకం రుణపడి ఉండాలని తలపోస్తాడు తప్ప, తను ఇతరులకి రుణపడిపోవాలని చూడడురా వేణూ! తల తాకట్టుపెట్టయినా గొడ్డూ గోదా అమ్మి అయినా అప్పు తీర్చాలని చూస్తాడు తప్ప, ఎగెయ్యాలని చూడడు. అందుకే రైతుల బతుకులిలా తెల్లారిపోతున్నాయి!"

గుండె బరువెక్కింది.. మరి మాట్లాడలేకపోయాను.

శ్మశానం.. చితిమంటలు.. కాలుతోన్న శవం.. నాలో వైరాగ్యపు భావనల్ని రగిలించాయి.

'నదీనాం సాగరో గతిః' గోదావరి నది నాసికా త్రయంబకంలో పుట్టినా, ఎన్నెన్ని మైళ్లు ప్రయాణించినా, ఎన్ని వంకలూ వాగులుగా మారినా, కడకి సముద్రగర్భంలోకి చేరాల్సిందే!

మనిషి ఎక్కడ ఎలా పుట్టినా పెరిగినా హంసతూలికాతల్పాల మీద పవ్వళించినా పంచభక్ష్యాలను భుజించినా, కోట్లకి పడగెత్తినా కడకి ఈ శరీరం విడిచి పంచభూతాల్లో కలవాల్సిందే!

పుట్టిన ప్రతిప్రాణీ గిట్టక తప్పదు. మరణానంతరం ఎవరూ ఎర్రని యాగాని గానీ, పూచిక పుల్లని గానీ తమతో తీసుకుని పోలేరు. వచ్చేప్పుడు ఒట్టిచేతుల్తో ఈ లోకానికి ఎలా వచ్చామో, వెళ్ళేప్పుడూ అలాగే ఒట్టిచేతుల్తోనే వెళ్ళాలి.

ఆఖరికి చితి మీద కాల్తున్నప్పుడు ఒంటి మీద బట్టకూడా ఉంచరు! బంగారమూ ఉంచరు!

రెప్పపాటు జీవితం కోసం, నీటి బుడగ లాంటి బతుకు కోసం.. వంచనలూ, మోసాలూ, యుద్ధాలూ, హత్యలూ.. ఇవన్నీ అవసరమా?

మంచిగా మనిషిగా ఎందుకు బతకలేకపోతున్నాం?

"ఆయ్..! ఏవిటో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టున్నారు" అంటూ వచ్చారు శ్రీరాములు గారు అక్కడికి.

"ఆయ్..! మానవసేవే మాధవసేవ అని నరేంద్రునికి రామకృష్ణ పరమహంస ప్రబోధించారు. ఆ సంగతి మనమంతా ఎప్పుడో చదువుకున్నాం. అయినా అలా చూడం. తోటివాడ్ని మనం పైకెక్కే మెట్టుగానే భావిస్తాం. నేనూ నా కుటుంబం ముఖ్యం అనుకుంటాం"

విస్మయంగా చూస్తుండిపోయాను.

"అవినీతి, ఆశ్రిత పక్షపాతం జాతి మూలుగుల్ని పీల్చి పిప్పి చేస్తోంది కదండీ! ఆయ్! ఎటు చూసినా స్కాములే. అటు సహారా గొడవ, ఇటు శారదా స్కాం, మధ్యలో బొగ్గూ, టూజీలూ! ప్రపంచంలో అత్యంత అవినీతికరమైన దేశాల జాబితాలో మనదేశం ఎనిమిదో స్థానంలో వుందని ఎక్కడో చదివాను. విశిష్టసంస్కృతి, సంప్రదాయం, ఆధ్యాత్మిక దృక్పథం గల మనదేశం అలాటి జాబితాలో చేరిందంటే ఎంత బాధాకరం!"

"నిజమే! సిగ్గుచేటైన సంగతే!"

"నిన్నటి పేపర్లో వచ్చిన వార్తని మీరు చూశారో? లేదో? ఆయ్! మీ హైదరాబాదులోని రాణిఫైనాన్స్ కంపెనీ జనం నెత్తిన టోపీ పెట్టిందని రాశాయి. వాళ్ళకింకా ఇతర సంస్థలున్నాయిట! అన్నీకూడా బోగస్‌వేనట! జనాన్ని నిలువునా దగా చేస్తున్నాయిట! అలాంటి వాళ్ళని నడిబజార్లో ఉరితీస్తేగానీ దేశం బాగుపడదండీ ఏవంటారు..? "

గుండెల్లో పిడుగు పడింది. అదిరిపడ్డాను. నోటి తడారిపోయింది. బెదురు

చూపులు చూశాను. గుండెల్లో వణుకు మొదలైంది.

అయితే ఆ వార్తలు ఈ పల్లెటూరి వాళ్ళూ తెలుసుకుంటున్నారన్నమాట! వాటిల్లో నా పేరు వచ్చే ఉంటుంది. ఆ వేణుగోపాలరావుని నేనేనని వీళ్ళు గుర్తుపట్టారా? గుర్తుపట్టనట్టుగా నటిస్తున్నారా? !

ముచ్చెమటలు పోశాయి. ఇన్నాళ్ళుగా మూసి ఉంచిన గుప్పెట ఇపుడు తెరుచుకుంటోంది.

'జనానికి కుచ్చుటోపీలు పెట్టిన రాణిఫైనాన్స్ కంపెనీ వ్యవహారాలపై ప్రత్యేక కథనం ఈ రాత్రి 9.30 గం. లకు చూడండి..' టీవీలో వచ్చిన ప్రకటనకి నా గుండె గుభేలుమంది.

రేపట్నుంచి అటు సిటీలో, ఇటు పల్లెలో మోసగాడిలా ఒకటో నెంబరు బద్మాష్‌గా ముద్రవేస్తారు. ఫోర్‌ట్వంటీగా పిలుస్తారు. వెకిలిగా నవ్వుతారు. వ్యంగ్యంగా మాట్లాడుకుంటారు.

ఇప్పుడేవిటి చెయ్యడం? ఇక్కడ్నుంచి జెండా ఎత్తేస్తే?

ఎక్కడికెళ్ళగలడు? ఎంత దూరం పారిపోగలడు? మనిషనేవాడు లేని అడవుల్లోకో, ఎడారుల్లోకో, హిమాలయాల్లోకో వెళ్ళిపోవాలి.

ఇంత బతుకూ బతికి ఇంటెనకాల చచ్చినట్టు అనామకుడిగా..!

సత్తెయ్య గురించి మూర్తి అన్న మాటలు గుర్తొచ్చాయి.

చనిపోయాక కూడా గౌరవప్రదంగా బతకాలి. చిరకాలం జనం జ్ఞాపకాల్లో బతకాలి. ప్రకృతిలో భాగమై బతకాలి. అందుకేనేమో చితాభస్మాన్ని నదుల్లో కలిపేది!

సాధ్యమైనంత త్వరగా ఊర్నుంచి వెళ్ళిపోవాలని నిర్ణయించుకున్నాక గానీ గుండెలు కుదటపడలేదు!

★ ★ ★

"అవతల గౌతమి పెళ్ళి పెట్టుకుని ఇప్పుడీ ప్రయాణం ఏవిట్రా? "

## ఆగస్టు - 2015
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ ఐదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **టి.యన్. లత**
   - మంచిర్యాల, ఆదిలాబాద్ జిల్లా
2. **అవధూత అన్నపూర్ణ**
   - శేరిలింగంపల్లి, హైదరాబాద్
3. **పి.వి. సుబ్బలక్ష్మి**
   - ఆటోనగర్, విశాఖపట్నం
4. **లక్ష్మయ్య శ్రీదాస్యం**
   - హన్మకొండరోడ్, హుస్నాబాద్
5. **కె. ప్రభావతీదేవి**
   - వేదాయపాలెం, నెల్లూరు

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. పర్ది తెగ | 6. పులి |
| 2. శ్రద్ధ | 7. దత్తు |
| 3. సంజయ్ కొఠారి మాస్టారు | 8. కుందన్ షేటే/ ముఖేష్ బాంగ్డియా |
| 4. ధనుంజయ్ వంజారి | 9. రతన్ సింహ్ |
| 5. కులకర్ణి | 10. వి.డి. ప్రసాదరావు |

"అర్జంటుగా వెళ్ళాలి. నాకు చాలా ముఖ్యమైన పనులున్నాయి. పెళ్ళి టైముకి తప్పకుండా వస్తాగా!"

బయల్దేరుతోంటే, "మీ ఆశీస్సులు మాక్కావాలి బాబాయ్!" అంది గౌతమి నా కాళ్ళకి నమస్కరిస్తూ.

తలూపి టాక్సీలో బయల్దేరాను.

సఖినేటిపల్లి రేవులో రెండు పడవల్ని కలిపి ఏర్పాటు చేసిన బంటా మీదకి కారుని ఎక్కిస్తోంటే చూస్తూ సిగరెట్టు

కాలుస్తున్నాను.

ఈ బాదరాబందీ లేకుండా రాజోలు, చించినాడ బ్రిడ్జి మీంచి వెళ్దామన్నాడు డ్రైవరు. నేనే ఒప్పుకోలేదు. ఒకప్పుడు ఇలానే పడవల మీద అద్దరికెళ్ళాను. చదువులో రాణించాను. మళ్ళీ అలాగే వెళ్తే అదృష్టం కలిసొస్తుందని పిచ్చి నమ్మకంగా ఉంది.

కొంచెం దూరంలో ఓ ఇద్దరు పోలీసులు నా వంకే చూస్తున్నారు. మళ్ళీ మళ్ళీ చూశాను. నన్ను చూపిస్తూ ఎవర్నో ఏదో అడుగుతున్నారు.

వెర్రిభయం ఊపేసింది. నాలిక పిడచకట్టుకు పోయింది.

వాళ్ళు నా కోసం రాలేదని రూఢి అయ్యేసరికి, నాకు తెలీకుండానే నిట్టూర్చాను. గుండెల మీది పెద్ద బరువేదో తొలగిపోయినట్లు ఎంతో ఊరడిల్లాను

ఇంతలో "ఓరి ఓరి నువ్వట్రా వేణూ!" అంటూ దగ్గరికొచ్చి వాటేసుకున్నంత పని చేశాడొకడు.

చిరాగ్గా చూశాను. వాడి నవ్వు పట్టిచ్చింది. హీరోగాడు! కాలేజ్ మేట్!

"ఇప్పుడేం చేస్తున్నావురా? చేనేత నూలూ, రంగులూ అమ్మే దుకాణం పెడతాననేవాడివి.. పెట్టావా? "

"లేదురా! కట్ పీసెస్ షాపు పెట్టేను"

"ప్రయాణమా? " అతడి చేతిలో బేగ్ వంక చూస్తూ అడిగాను.

"అవున్రా! సాయంత్రం హైదరాబాద్ వెళ్తున్నాను. రేపు మావోడు అమెరికా వెళ్తున్నాడు. ఎం.సి.ఎ. చేశాడులే! అమెరికాలో ఉజ్జోగం వచ్చింది. రేపు రాత్రికి విమానంలో వెళ్తున్నాడు"

"గుడ్!"

"అంతా కొండాలమ్మ దయ! ఆ తల్లినే నమ్ముకున్నాను. నన్ను ఒడ్డున పడేసింది. వ్యాపారం కూడా బాగానే వుందిలేరా! రాయపేటలో చిన్న డాబా కట్టాను"

"ఇక నర్సాపురానికి హీరోవి నువ్వే! నీ కొడుకు రెండు చేతుల్తో సంపాదించి పంపితే ఇక్కడ పొలాలూ అవీ కొనేసెయ్యడమే నీ పని"

"పెద్ద ఆఫీసరువి అయినట్టున్నావు! ఏం చేస్తున్నావురా? "

"బిజినెస్ మాగ్నెట్ నిలే! మీ నాన్న మగ్గం మీద నేతనేస్తూ నిన్ను కాలేజీలో చదివించాడు. నువ్వు క్లాత్ షాపు నడుపుతూ నీ కొడుకుని ఎం.సి.ఎ. చదివించి విదేశాలకి పంపిస్తున్నావు. నిన్ను చూస్తోంటే చాలా సంతోషంగా వుంది. విదేశానికెళ్తోన్న నీ కొడుక్కి ఏం ఇచ్చి పంపిస్తున్నావేంటి? "

"ఇక్కడి మట్టీ, గోదావరి నీళ్ళూ, కొండాలమ్మ కుంకుమా ఇస్తున్నాన్రా! ఇంతకంటే గొప్పవి ఎక్కడుంటాయి చెప్పు? "

చిత్రంగా చూశాను. 'పిచ్చోడు!' అనుకుంటూ 'బై' చెప్పి పడవ ఎక్కాను.

గోదావరి మధ్యలో కొచ్చాం. అటు తూర్పు గోదావరి జిల్లా. ఇటు పశ్చిమ గోదావరి జిల్లా.

రెండింటికీ సరిహద్దు రేఖ గోదావరి.

రెండు ప్రాంతాలకీ జవం ఇచ్చి, జీవం పోసి, చైతన్యంతో నింపిన పుణ్యనది గోదావరి. నీటి లభ్యతపైనే ఆయా ప్రాంతాల ప్రజల సంస్కృతి, జీవన విధానమూ ఆధారపడి ఉంటాయి. ఈ డెల్టాలో సంస్కృతీ వికాసానికి ముఖ్యకారణం గోదావరి నీళ్ళే!

చిత్రమేమిటంటే ఒకప్పుడు పాతసైకిలుకి పాలబిందెలు కట్టుకుని ఈ నదిని దాటిన నేను, ఇవాళ కారుతో దాటుతున్నాను.

ఒకప్పుడు సరైన తిండీ బట్టా లేనివాడ్ని, ఇప్పుడు కోట్లు ఆర్జించాను. నా కృషికీ, పట్టుదలకీ.. మావగారి సహకారమూ, అదృష్టమూ తోడయ్యేసరికి చుక్కల్ని చూసేను.

మధ్యలో ఆర్థిక అవకతవకలూ, వాటి తాలూకు సమస్యలూ, కోర్టు కేసులూ లాంటివి జరక్కుండా వుంటే మరింత

ఉన్నత స్థానంలో ఉండేవాణ్ని. ప్చ్! గ్రహ స్థితి బాగోక అలా జరిగిపోయిందంతా!

శనిత్రయోదశికో లేక ఏదో ఓ శనివారం మందపల్లి వెళ్ళి శనీశ్వర పూజచేసి రావాలి. ఏల్నాటిశని ఏదైనా ఉంటే తుడుచుపెట్టుకు పోతుంది. దానికోసం సాధ్యమైనంత త్వరలో మళ్ళీ రావాలి!

కొద్ది దూరంలో కన్పిస్తోన్న నర్సాపురాన్ని చూస్తోంటే సెల్ మోగింది.

"మీరెక్కడున్నారు.. డాడీ? "

"గోదావరి దాటుతున్నాను"

"ఖర్మకాలి ఇక్కడికి రావట్లేదు కదా మీరు? వద్దు వద్దు రావద్దు.. అసలా ఊరి పొలిమేర దాటి రావద్దు! ఎవరికంటా పడకుండా మీ స్నేహితుడి ఇంట్లోనే ఉండిపోతే ఇంకా బెటర్!"

"ఏంరా ఏవయ్యింది? " నవనాడులూ కుంగిపోతోంటే ఆదుర్దాగా అడిగాను.

"ఆ జడ్జి మొండిమనిషి! దొంగ పత్రాలు సబ్మిట్ చేశామని గరం గరంగున్నాడు. తరువాతి విచారణకు మిమ్మల్ని కోర్టులో హాజరు పర్చాలంటూ ఇవాళ ఆర్డరేశారు"

"మైగాడ్! సరే! నేనెలాగూ బయల్దేరాను కదా! వచ్చాక ఆలోచిద్దాంలే!"

"రానివ్వొద్దని మరీ చెప్పేడు మన ప్లీడరు. కోర్టుకొస్తే అక్కడికక్కడే అరెస్టు చేయించి జైలుకి పంపేస్తారంటున్నారు"

నిలబడే శక్తిలేక కూలబడిపోయాను.

ఎన్నో గౌరవమర్యాదలు అందుకుంటున్న వాడ్ని, సంఘంలో ఒక స్థాయి వెలగబెట్టిన వాడ్ని, ఇహ చంచల్‌గూడ జైల్లో దొంగలూ.. ఖూనీ కోర్లతో బాటు 'చిప్పకూడు' తింటూ.. మోకాళ్ళ మధ్య మొహాన్ని దాచుకుని కుళ్ళికుళ్ళి ఏడుస్తూ..!

వద్దొద్దు! అలాంటి దారుణస్థితి రాకూడదు. దానికన్నా ఆత్మహత్య చేసుకోవడం ఎంతో నయం!

కన్నీళ్ళు పొంగాయి. శరీరం కంపిస్తోంది. గుండెల్లో 'బతుకుచిత్రం' పగిలి పెళ్లలు వూడి పడుతున్నాయి.

★ ★ ★

ఇంట్లో అడుగుపెడుతూనే "గౌతమి పెళ్లి అయ్యాకే వెళ్తాన్రా! అందుకే తిరిగి వచ్చేశాను" అడక్కముందే చెప్పాను. వాడు నా వంక 'అదోలా' చూస్తూండిపోయాడు.

తిన్నగా గదిలోకెళ్ళి దుప్పటి ముసుగు పెట్టాను. గౌతమి, మూర్తి ఎంత బతిమాలినా అన్నం తినలేదు.. నీళ్ళు తాగలేదు.. నిద్రపోలేదు!

అర్థరాత్రివేళ సెల్ మోగింది. భయం గుప్పిట్లో నలిగిపోతూ రిసీవ్‌చేసుకున్నాను.

అవతల మా ప్లీడరు మాట్లాడుతూ "ఎలా ఉన్నారు సార్? " అన్నాడు.

"పలకరింపులు తర్వాత, న్యూసేంటో చెప్పండి ముందు"

"ఒక లింకు దొరికింది. మీరింక ధైర్యంగా ఉండొచ్చు! అది చెప్పడానికే ఫోన్‌చేశాను"

"అదేంటో త్వరగా చెప్పండి!"

"జడ్జీగారి వియ్యంకుడి ద్వారా ప్రయత్నిస్తున్నాం. ఆయన మెత్తబడ్డాడు. ఇహ నరుక్కొచ్చేస్తాళ్ళే.."

"జడ్జి వింటాడంటారా? "

"నా మాటా, మీ మాటా వినడు. కానీ కూతురి మావగారి మాట కాదనెలా అనగలడు? ఇహ మీరు ఒడ్డున పడిపోయినట్టే! నిశ్చింతగా ఉండండి! హాలిడేస్ అనుకుని హాయిగా ఎంజాయ్ చెయ్యండి"

"గండం గడిచిందంటారా? "

"గండాలకో గోలీమారో! ఇహ మీదంతా శుక్రమహాదశే!"

ఆనందం.. పరమానందం ఉప్పెనలా పొంగివచ్చాయి. రాహువు విషపు కోరల్నుంచి బయటపడ్డాను. ఇంక నాకు ఢోకా ఉండదు గాక.. ఉండదు!

ఒడలో అత్యంత విలువైన సంపదతో ఒక వ్యాపారి బంగాళాఖాతంలో ప్రయాణిస్తున్నాట్ట! హఠాత్తుగా తుపాను చెలరేగ

అ
క్ష
రం

ఉన్నదానితో సంతృప్తి పడటం
ఉత్తమం
మనకున్న జ్ఞానం చాలని భావించడం
అజ్ఞానం

– సర్వేపల్లి రాధాకృష్ణన్



డంతో ఓడ తల్లకిందులై పోసాగింది. జల సమాధి కావడం ఖాయమనుకుని అందరూ భయపడిపోయారట!. ఓడలోని ఒకరు దగ్గర్లో ఉన్న లక్ష్మీనరసింహ స్వామికి మొక్కుకోమని ఆ వ్యాపారికి సలహా ఇచ్చేట్ట! అతడు వెంటనే ఈ గండం గడచి గట్టెక్కితే స్వామికి ఆలయం కట్టిస్తానని మొక్కుకున్నాట్ట! వెంటనే తుపాను శాంతించిందిట! అంతా సురక్షితంగా స్వస్థలం చేరారట!.

ఇది చిన్నప్పుడు నేను విన్న కథ.

ఎంతో శక్తిమంతుడైన ఆ స్వామి కూత వేటు దూరంలోనే ఉన్నా, వెళ్ళి దర్శించుకోలేదు. ఆ మహాపరాధమే నన్నిన్ని చిక్కుల్లో పడేస్తోంది. ఆ మర్నాడే స్వామి దర్శనానికి వెళ్ళాలని గట్టిగా నిశ్చయించుకున్నాను. చాన్నాళ్ళ తర్వాత ప్రశాంతంగా నిద్రపోయాను.

★ ★ ★

"అంతర్వేది చూసి చాలా ఏళ్ళయ్యిందిరా మూర్తీ! ఇవాళెళ్ళి స్వామిని, సముద్రాన్నీ చూసొద్దాం!" అన్నాను మూర్తితో.

మూర్తి ఆశ్చర్యపోలేదు. గ్రహించగలన్లే అన్నట్టు చూశాడు.

రాకుమారివాళ్ల కారు తీసుకొని అంతర్వేది వెళ్ళాం! గౌతమి తనతోబాటు శీనునీ తీసుకొచ్చింది.

లక్ష్మీనరసింహస్వామి ముందు కళ్ళు మూసుకుని చేతులు జోడించాను.

"స్వామీ! జీవితంలో ఎన్నో తప్పులు చేశాను.. మోసాలు చేశాను.. పాపాలూ చేశాను. డబ్బే సర్వస్వం అనుకున్నాను. నన్ను క్షమించు తండ్రీ! ఎలాగైనా నా వ్యాపారాలు దారిలో పడేట్టుచూడు! మాకు చేయూతనివ్వు! ఇక బుద్ధిగా వుంటాం! నీ కళ్యాణం నాటికి వెండి కిరీటం సమర్పించుకుంటాను స్వామీ!"

ఆ కథలోని ధనిక వర్తకుడ్ని రక్షించినట్టే, నన్నూ రక్షించి 'దరి' జేర్చమని స్వామిని ప్రార్థించాను.

స్వామికి అభిషేకం చేయిస్తూ స్వామి దివ్యమంగళ స్వరూపాన్నే చూస్తూ కూర్చుండిపోయాను.

ఒక కాంతిమంతమైన ఉదయం వెయ్యి చీకటి రాత్రుల్ని పటాపంచలు చేసినట్లు స్వామి అదృశ్య శక్తి నా పాపాల్ని తుడిచేసి, అద్దంలా చేసేస్తే ఎంత బావుణ్ణు! మళ్ళీ ఈ మట్టిలో పుట్టినవాడిగా కొత్త జీవితం ప్రారంభించేవాడ్ని!

ఆలోచనా యువనికల మధ్య నిశ్శబ్దంగా కూర్చున్నాను. నిజంగా కొత్త మనిషినయితే ఎంత బావుణ్ణు!

ఏ దేవుడో, దివ్యపురుషుడో దిగి వచ్చి నా గతాన్ని పూర్తిగా తుడిచేసి, ఆ గతం తాలూకు నీడల్లేకుండా చేసేసి, సరికొత్త జీవితాన్ని, స్వచ్ఛమైన భవిష్యత్తుని ప్రసాదిస్తే ఎంత బావుణ్ణు!

కానది సాధ్యమా? ఏమో? ఏం చెప్పగలం? ఏదైనా సాధ్యం కావొచ్చు!

కూలిన గోడలు మళ్ళీ లేవవా? పడిన కెరటం తిరిగి లేవదా? ఘోరంగా ఓడిపోయినవాళ్ళు, దారుణ నష్టాల్లో కూరుకుపోయినవాళ్ళు విజేతలైన ఘటనలెన్ని లేవు? !

లక్ష్మీ సమేత నరసింహస్వామి పరమ

శాంత స్వరూపుడై ఆశీర్వదిస్తున్నట్టు అభయమిస్తున్నట్టు అనుభూతి కలిగింది.

మనస్సులోని అశాంతిని చేత్తో తీసేసినట్టుగా అనుభూతించాను.

"సముద్రాన్నీ, అన్నాచెల్లెలి గట్టునీ, లైట్ హౌస్‌నీ చూసొద్దాం" అన్నాను.

"నాకు గోదావరి ఎంతిష్టమో సముద్రం అంత అయిష్టం బాబాయ్! గోదావరి పౌర్ణమి వెన్నెలలానూ, సముద్రం అమావాస్య చీకటిగానూ అన్పిస్తుంది. సముద్రం అనంతమైందైనా గుక్కెడు నీళ్ళు కూడా తాగడానికి పనికిరావు కదా అని బాధేస్తుంది"

"అది నిజమే! కానీ అనంతమైన సముద్రాన్ని చూస్తే ఆనందానుభూతి, వైరాగ్యం ఒక్కసారే కలుగుతాయి. సముద్రమూ ఆకాశమూ నీలంగా వుంటాయి. వాటిలానే అనంతమైనవాడు గనుక భగవంతుడ్నీ నీలమేఘశ్యాముడని వర్ణిస్తారు. సముద్రపు టొడ్డున నిలబడి చూస్తే చాలు మనమెంత అల్పులమో తెలిసొస్తుంది!"

"సముద్రంకాడికి వెళ్దాం అక్కా! శంఖాలూ, గవ్వలూ ఏరుకుంటాను.." శీను గొడవచేశాడు.

"ఇందాకా వచ్చి సముద్రం చూడకుండా ఎలా వెళ్తాంరా! పద కారెక్కు, వెళ్దాం!"

దారిలో బెస్తల పూరిళ్ళు, పాకలు చూశాను. 'ఎంత దౌర్భాగ్యులో!' అనుకున్నాను మనసులో.

నా చిన్నప్పుడెలా ఉన్నారో, ఇప్పుడూ అలాగే ఉన్నారు. నన్నడిగితే వీళ్ళు చేపల వేట మానేసి ఇతర వృత్తుల్లోకి మళ్ళటం బెటర్. అసలు ప్రభుత్వానికి బుద్ధిలేదు. మరపడవలొచ్చాక ఈ మత్స్యకారుల్ని ప్రోత్సహించడం శుద్ధ దండగమారిపని.

ఇంకే వృత్తిలోకి మారినా హాయిగా మేడలు కట్టుకుందురు. ఇలా సముద్రాన్ని అంటిపెట్టుకుని బతుకుల్ని దైవాధీనం చేసి బతకాల్సిన కర్మ పట్టేదేకాదు! వాళ్ళనీ, వాళ్ల బతుకుల్నీ చూసి జాలిపడకుండా ఉండలేకపోయాను.

అసలు మైళ్ళకొద్దీ విస్తరించి ఉన్న ఈ ఇసుక పర్రల్ని ఇలా వదిలెయ్యడం ప్రభుత్వ బుద్ధిహీనతకు నిదర్శనం. ఈ గుడిసెల్ని పీకేసి, పల్లెకారుల్ని తరిమేసి, సముద్రతీరంలో రిసార్ట్స్ కట్టాలి. రకరకాల వాటర్ స్పోర్ట్స్‌కు ఏర్పాట్లుచేసి టూరిస్ట్‌స్పాట్‌గా మారిస్తే డబ్బేడబ్బు!

అన్నాచెల్లెలిగట్టు దగ్గర ఆగాం! అన్న సముద్రుడు. చెల్లెలు గోదావరి. ఆ రెంటి సంగమ ప్రదేశాన్ని అన్నా చెల్లెలిగట్టు అంటారు.

ఒక పక్క పంటనీరు. మరో పక్క ఉప్పునీరు. ఒకటి జీవధార. మరొకటి అనంత జలరాశి.

రెండు విభిన్న రంగులూ, లక్షణాలూ గల జలాల అపూర్వ సమ్మేళనా దృశ్యం..! అద్భుతం అన్పిస్తోంటే చాలాసేపు అలాగే చూస్తుండిపోయాను.

"మీరేమీ అనుకోనంటే నేనోమాట చెప్పనా బాబాయ్!"

"చెప్పమ్మా!"

"అందరికీ డబ్బు ఆరోప్రాణం. కానీ మీరు పంచప్రాణాలూ దానిమీదే పెట్టుకుని జీవిస్తున్నట్టున్నారు!"

నివ్వెరపోయి ఆమె ముఖంలోకే చూస్తూండిపోయాను.

"దారేషణ పుత్రేషణ ధనేషణ - అనే ఈషణత్రయం ఎలాటి వారికైనా మోహం కలిగిస్తుంది. ఎంతటి వారినైనా మోహంలో పడేస్తుంది. ఆ మోహంలో కూరుకుపోయిన వారికి యుక్తాయుక్తాలు కన్పించవు. పాపం.. పుణ్యం గుర్తురావు. ఆ మోహపు పొరల్ని చీల్చుకోగలిగిన వారే మనీషి అవుతారు"

నా వయస్సులో మూడోవంతు కూడా లేని, గౌతమి నోట వచ్చిన ముత్యాల పలుకులకి విస్తుబోయాను.

ఆమె మూర్తి కూతురు! జీవనం, జీవితం

గురించి తన విభిన్న దృక్పథాన్నే కూతురికీ నూరిపోశాడు!

ఏమైనా పల్లెల్లో ఇంకా తాత్త్విక దృక్ప థమూ, వేదాంత దృష్టీ కనిపిస్తున్నాయి. పరోపకారమూ, సర్వజన శ్రేయఃకాంక్షా బతికున్నాయి.

ఊరు పెద్దదయ్యేకొద్దీ అవన్నీ కుంచిం చుకుపోయినట్టు నగరవాసినైన నాలో అవి మచ్చుకి కూడా లేకుండా పోయాయి. వాటి స్థానే 'స్వార్థం' అనే రెండక్షరాలు మర్రిచెట్టులా ఎదిగి ఊడలు దింపి మరీ విస్తరించింది!

కడలి ఎంచేతో చాలా ఉగ్రంగా వుంది. మిట్టమధ్యాహ్నం కావడం వల్ల కాబోలు కెరటాలు ఉవ్వెత్తున లేచి పడుతున్నాయి. కాళ్ళ కింది ఇసుక కదిలిపోతూంటే కెరటా లొచ్చి కాళ్ళని ఢీ కొడుతూంటే చిత్రమైన అనుభూతికి లోనవుతూ నిలబడ్డాను.

సముద్రపు హోరు అంతకంతకీ అధిక మవుతూ భయపెడుతోంది.

ఇది వరకెప్పుడూ ఇంతగా భయప ళ్ళేదు. సముద్రం లోపలికెళ్ళి స్నానాలు చేస్తూ కేరింతలు కొట్టినవాళ్ళమే మరి!

ఇప్పుడు ఒంటరిగా సముద్రం ముందు నిలబడేసరికి గుండెలు జారి పోతున్నాయి!

గౌతమి, శీనూ శంఖాలకోసం ఒడ్డున వెదుక్కుంటున్నారు. కన్నాల్లోంచి బయ టికొచ్చి పరుగులు తీస్తోన్న ఎర్రపీతల్ని తరుముతున్నారు. సముద్రపు అలల దగ్గ రికెళ్తూ, వాటి కందకుండా వెనక్కొస్తూ దోబూచులాడుతున్నారు. వాళ్ళ లోకం వేరైపోయింది.

సముద్రం మా వ్యాపారపు స్కాంలా కన్పిస్తోంది! నా పాపపు జలరాశిలా అన్పి స్తోంది! నన్ను ముంచెత్తి, కబళించేసే చట్టపు పొడుగు చేతుల్లా.. కెరటాలు నన్ను చుట్టెయ్యడానికి నా మీదకు వస్తున్న ట్టుగా ఉన్నాయ్!

అది జల సముద్రంలా కాదు, జన సముద్రంలా కన్పిస్తోంది!

సముద్రపు హోరు నా గుండెల్లో భూకంపం సృష్టించడానికొస్తున్న పగబట్టిన కాలపు బుసబుసల్లా - నా కంపెనీల్లో డబ్బు దాచుకుని మోసబోయిన వారి హాహాకారాల్లా - అంతిమ క్షణాల్లో మా అమ్మ పడిన వేదనాస్వరాల ఘోషలా - అమ్మో! వచ్చేస్తోంది! సముద్రం పొంగి.. ఉప్పొంగి వచ్చేస్తోంది!

నన్ను చుట్టేయ్యడానికి, నన్ను ముంచె య్యడానికి, నన్ను నిలువునా కబళించెయ్య డానికి, నన్ను జలసమాధి చేసెయ్యడానికి ఉరుకులు పరుగుల్తో ఉప్పొంగి మీదకు వచ్చేస్తోంది!

"గౌతమీ! శీనూ! వచ్చెయ్యండొచ్చె య్యండి! సముద్రం పొంగి వస్తోంది! మనల్ని ముంచేస్తుంది! వచ్చేయండి! వచ్చే యండి!" బిగ్గరగా అరుస్తూ వారికోసం ఆగ కుండా పరుగందుకున్నాను.




గౌతమి పెళ్ళిపనులు చురుగ్గా సాగు తున్నాయి.

ఒకావిడొచ్చింది పెట్టే బేడాతో. అచ్చమ్మ కంటబడేసరికి నా ముఖంలోని రక్తమంతా పాలిపోయింది.

ఆమె నా వంక గుచ్చిగుచ్చి చూసి పెర ట్లోకెళ్ళింది.

మూర్తి అక్క అచ్చమ్మ అదో తరహా మనిషి! మా చిన్నప్పుడే ఆమెనందరూ

తిట్టిపోసేవారు.

నేను మూర్తి కోసం వాళ్లింటికెళ్తే చాలు, కళ్ళల్లో నిప్పులు పోసుకునేది. నేనేదో పట్టుకుపోడానికి వచ్చినట్టు అనుమానంగా చూసేది! వాళ్ళమ్మ మాత్రం దేవతే! ఆఖరికి మరమరాలు పెట్టినా ఎంత ఆప్యాయంగా పెట్టేదనీ!

'అచ్చమ్మ ఎదురుబడి మసలడం ఎలారా బాబూ!' అని ఇదవుతోంటే ఆవిడే నా ఎదుటికి వచ్చింది. 'పిల్లికి చెలగాటం ఎలక్కి ప్రాణసంకటం' అన్నట్టుగా వుంది నా పరిస్థితి!

"మన వేణుయే! చిన్నప్పుడు మనింటికి ఎక్కువగా వచ్చేవాడు గుర్తులేదూ!"

కొత్తగాలి...

**వీక్షించేవి**
**కళ్లు**
**వీధికెక్కి అరిచేవి**
**నోళ్లు**

**– వి. మురళీకృష్ణ,**
నార్త్ కమలానగర్, హైదరాబాద్

మూర్తి మాటలకి ముఖం చిట్లించి గద్దకళ్ళతో చూసింది. "సీతమ్మ కొడుకా! పాలకుండలో మీగడ ఉండనిచ్చేవాళ్ళు కాదు వాడూ, నువ్వూ కలిసి. ఎందుకు గుర్తులేడూ. ఏరా ఏం చేస్తున్నావురా? " నా ఎదుటి కుర్చీలో కూర్చుని కాళ్ళాడిస్తూ అడిగింది.

"బిజినెస్.. హైదరాబాద్‌లో..!" కష్టం మీద గొంతు పెగుల్చుకున్నాను.

"కొట్టుకు తినేవాళ్ళకి వ్యాపారాలు అచ్చొస్తాయిలే! బాగానే కూడబెట్టి వుంటావు..!"

ఆవిడ ముందు చిత్రంగా మరుగుజ్జునై పోయాను.!

"ఇక్కడికేం పని మీదొచ్చావు! ఇక్కడ చవగ్గా దొరికేవి కొని అక్కడ అమ్మి డబ్బు సంపాదిద్దామనొచ్చావా? "

ఇబ్బందిగా కదిలాను.

అది గమనించి మూర్తి "ఒక ముఖ్యమైన పనిమీద వచ్చాళ్ళేవే" అన్నాడు.

"అక్కడెక్కడో వ్యాపారం చేసుకునేవాడికి ఇక్కడ రాచకార్యాలేవిటో!"

ఆవిడ దేవాంతకురాలని తెలుసు గనుక, మరేమన్లేక వెర్రిగా నవ్వేను.

"సమాధానం చెప్పకుండా ఆ నవ్వేమిట్రా? ఇంతకీ ఎప్పుడు దిగబడ్డావేంటి? "

నేవచ్చి పదిహేను రోజులైందన్న నిజం చెబితే 'బాగానే తిష్ఠవేశావే' అని వాతలు పెడుతుందేమోనని భయపడి దిక్కులు చూశాను.

"మొన్ననే! మన గౌతమి పెళ్లి కుదిర్చింది వీడే" అని మూర్తి చెప్పాడు.

"వ్యాపారం చెయ్యడవేఁగాక పెళ్లిళ్ళు కూడా కుదురుస్తున్నావా! ఏదో కలిసి రాకపోతే అలాటివి చెయ్యడు. లాభం గుంజే ఉంటాడు ఏరా? " బుగ్గలు నొక్కుకుంది.

అది పొగడ్తో? తెగడ్తో? బోధపళ్ళేదు.

"అప్పట్లో చల్లయ్యతాత ఇంటి చుట్టూ తిరిగి రాకుమారిని బులిపించి అన్నీ పట్టుకుపోయేవాడురా! అవున్నాకు తెలీకడుగుతానూ.. వ్యాపారాన్ని కాకులకీ కుక్కలకీ వదిలేసి ఇక్కడికొచ్చి ఇన్నాళ్లెలా ఉండిపోయావురా? ఇలా అక్కడా ఇక్కడా దేకేవాడివి వ్యాపారం ఏం చేస్తావు నా మొఖం! అయినా తిథి మారకుండా వెళ్లిపోయేవాడే అతిథి గానీ, రోజుల తరబడి తిష్ఠ వేసిన వాడు అతిథి ఎలా అవుతాడు? "

"గౌతమి పెళ్లయ్యేదాకా నేనే ఉండమన్నాను గానీ, నువ్వు లోపలికి వెళ్లి పెళ్లిపనులు చూడు!" మూర్తి తొందరపెట్టాడు.

"కాస్త అలుపు తీర్చుకోనీరా! ఇప్పుడే కదా వచ్చిందీ! అన్నట్టోరేయ్! ఆ కోటిగాడి సంగతేమైనా తెలిసిందట్రా? " అడిగింది.

"ధాన్యం కమీషనర్ కోటిగాడా? "

"వాడేరా! మంది సొమ్ము మింగి పరార య్యాడుగా!"

"కేరళలో ఉన్నాడన్నారెవరో! మళ్లీ ఇటు కేసి రాలేదు. పెళ్లాం బిడ్డల్ని పట్టించు కోనూ లేదు" మూర్తి అన్నాడు.

"ఎందుకొస్తాడూ! అక్కడింకో చిన్నిల్లు పెట్టే ఉంటాడు. అలాంటి బద్మాష్‌లని నిలువునా చీరి, ఉప్పూ కారం పెట్టాల్రా! ఒఖర్నా? ఇద్దర్నా? దగ్గర దగ్గర ఇరవై మంది రైతుల్ని ముంచేసుండడూ? !"

"ఇంకా ఎక్కువే ఉంటారు. చాలా మొత్తం లెక్కతేలింది"

"మందిని ముంచిన వాడేం బాగుపడతా ళ్లేరా! పురుగులు పడిపోతాడు! కుక్కచావు చస్తాడు! ఆఖరికి మున్సిపాల్టీవాళ్లు దయద లిచి, తాడుకట్టి ఈడ్చుకుపోవాల్సిందే!"

ఇంకక్కడ ఉండలేక ఏదో పనున్నట్లు వీధిలోకి వెళ్లేను.

ఆవిడ చూపుల్ని ఎదుర్కొంటూ.. మా టల ఈటెల్ని భరిస్తూ.. ఇంకో నాలుగైదు రోజులెలా వుండగలనో? ఏమో ఖర్మ!

★ ★ ★

గ్రామంలోని శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయం ముందు పెద్ద పందిరి వేశారు.

గౌతమి అశోక్‌ల వివాహానికి బంధు వులూ ఊరిజనమే కాదు, పొరుగూళ్ల నుంచి కూడా చాలామంది వచ్చారు. అన్ని కులాలవాళ్లూ, మతాలవాళ్లూ వృత్తు లవాళ్లూ ఉన్నారు. మూర్తి మాస్టారుగానే గాక డాక్టరుగా కూడా అందరికీ సుపరిచి తుడు! ఆప్తుడు!

పాలు, కాయగూరలు, మోరి జీడిపప్పు- ఇలా ఎన్నో వచ్చాయి. ఇంచుమించు ప్రతి ఇంటి నుంచీ ఏదోటి వచ్చింది. అలాగే పెళ్లిపనుల్లో ప్రతివాళ్లూ ఒక చేయివేశారు. అంతా తమింటి కార్యంలానే భావించి చక్కబెడుతున్నారు.

నన్ను చూసి, "ఆయ్! నిలబడే వున్నారు. రండి! కూర్చోండి..!" అంటూ శ్రీరాములుగారు తన కుర్చీ నాకివ్వబోతోం టే వారించి ఇంకో కుర్చీలో కూర్చున్నాను.

"మీ గురించో కొత్తసంగతి మధ్యాహ్నమే తెలిసింది. స్వాతంత్ర్య పోరాటం రోజుల్లో చెడుగుడు ఆడుతూ 'వందేమాతరం' అం టూ కూతపట్టేవారట కదా!

ఆ రోజులు అలాటివి! ఆయ్..! ప్రతి వారూ స్వాతంత్ర్య పోరాటం స్ఫూర్తితో ఉప్పొంగేవారు. యువకులు మరీనూ. 'వందేమాతరం' అన్న పదాన్ని దేశభక్తి చిహ్నంగా, చైతన్యానికి గుర్తుగా, విప్లవానికి సంకేతంగా భావించేవాళ్లం! ఆయ్..! ఆ పదం వింటేచాలు మా మనస్సూ, శరీ రాలు ఉప్పొంగేవి. కదను తొక్కాలన్పిం చేది. ఆసేతుహిమాచలం జాతిని జాగృతం చేసి కదనుతొక్కించిన తారకమంత్రం కదండీ వందేమాతరం"

ఆయన కళ్లల్లో మెరుపులు మెరుస్తోంటే కళ్లప్పగించి చూస్తుండిపోయాను.

"ఆయ్..! ఆనాటి ఘటనల్ని తలచు కుంటే అవన్నీ చేసింది మేమేనా అన్పిస్తుం దొక్కోసారి. 'ఉప్పు తయారుచెయ్యండి' అని గాంధీజీ పిలుపిచ్చారో లేదో పొలోమంటూ కదిలెళ్లాం. విదేశీవస్త్ర దహనం చెయ్యమనగానే ఇంట్లో ఉన్న విదేశీ వస్తువులన్నిట్నీ తగలబెట్టాం. అప్ప ట్నుంచి ఖద్దరు తప్ప మరోటి ధరించెర గను. ఇప్పటివాళ్లేమో విదేశీవి తప్ప, స్వదేశీ సరుకుల్ని వాడటమే లేదు!

"మీరు లెక్కల్లోని మనిషి!" నా మాటలు పట్టించుకోకుండా చెప్పుకుపోయారు!

"ఆయ్..! ఈనాటి యువతలో దేశభక్తి ఎందుకు ఉండాల్సినంతగా లేదంటారు? బానిస బతుకంటే ఏవిటో అనుభవించ లేదు కనకనా? లేక దేశమూ, దేశప్రయో జనమూ కన్నా స్వార్థం ముఖ్యమన్న భావన పెరగటం వల్లనా? ఆ చివరిదే నిజమేమోనని ఒక్కోసారి భయమేస్తోం టుంది. ఎటు చూసినా స్వార్థం.. అవినీతి

స్కాములు. ఒకటా? రెండా? తవ్వే ఓపి కుంటే రోజుకో స్కాము పాము బయటప డుతుంది. ఆయ్..! స్విస్ బ్యాంకుల్లో దాచిన లక్షల కోట్లు దేశానికి తీసుకొచ్చే ప్రయత్నం గట్టిగా చెయ్యాలి. ఈమధ్యే మోడీ ప్రభుత్వం ఓ కమిటీని వేసిందను కోండి! అది చిత్తశుద్ధితో పనిచేస్తుందని నమ్మకంగా ఉంది మరి! ఏమవుతుందో చూడాలి!"

ఇంకాస్సేపుంటే మా రాణి ఫైనాన్స్ గురించీ కామెంట్ చేస్తారేమోనని భయ మేసి మరో పక్కకెళ్లిపోయాను. ఇంతలో ఎవరో 'బ్యాంక్ మేనేజరు గారు వచ్చారని అరవడంతో రాజ్‌కుమార్ ఎదురెళ్లి సఫారీ సూటతన్ని ఆహ్వానించాడు.

"టైముకొస్తినబ్బా!" అన్నాడతడు చుట్టూ చూస్తూ.

కొందరొచ్చి అతడ్ని విష్ చేశారు. కొందరి దగ్గరికెళ్లి అతడు విష్ చేశాడు. "ఎల్లారకు వణక్కం! నమస్కారం..!" అన్నాడు. అతడ్ని నా దగ్గరికి తీసుకొచ్చి పరిచయం చేశాడు రాజ్‌కుమార్.

"వీరు వేణుగారనీ మాకు బాగా కావాల్సి నవారు. హైదరాబాద్‌లో పెద్ద వ్యాపార వేత్త. అస్తమానూ డిపాజిట్లు వేయించండి అంటూ పీకేస్తుంటారుగా! ఈయన్ని పట్టు కోండి.. దండిగా వేస్తారు"

వెంటనే షేక్‌హేండ్ ఇచ్చి తనని తాను పరిచయం చేసుకున్నాడు. "రొంబ సంతోషం! నానుదా చిదంబరం. ఇక్కడ బ్యాంక్ మేనేజర్‌గా ఉండాను. మా బ్యాంక్‌ల వడ్డీ జాస్తి ఇస్తిమి. మీరు డిపా జిట్ ఇయ్యండి సామీ!"

"చూస్తాన్లెండి!"

"అట్లదా కాదు! నన్ను చూడాలె! మీది ఏమి బిజినెస్సు? "

"ఫైనాన్స్ బిజినెస్! రియల్ఎస్టేట్ బిజి నెస్ కూడా ఉంది"

"అట్లనా! నాను లక్కీ! నాకు డిపాజిట్ ఇయ్యాలి సామి! టార్గెట్‌కి ఫార్టీలాక్స్ షార్టు ఉండాది..!"

"ట్రై చేస్తాన్లెండి" అతడ్ని త్వరగా వది లించేసుకోవాలని చూశాను.

"మీది విజిటింగు కార్డు ఇవ్వు సామి"

ఇచ్చాను.

"ఏమి? ఆ 'రాణి ఫైనాన్స్ కంపెనీ' నీదిదా? " అత్యంత ఆశ్చర్యంగా చూస్తూ గట్టిగా అరిచాడు.

ముచ్చెమటలు పోశాయెుక్కసారే! కంగా రుపడుతూ అతడ్నోపక్కకి లాక్కెళ్లాను. "మీకు తెలుసా? "

"తెలియును సామీ! ఆ మధ్య పేపర్ల వచ్చింది. కంపెనీ నిండా గొడవల్ల వుంది. నైటుకి నైటు బోర్డు తిప్పే ఫైనాన్సు కంపె నీలు తమిళనాడులో చాల చూస్తిని. ఆ మాదిరి నీది కూడా డిపాజిటర్స్‌ని ముంచింది కాదా!"

నిలువునా వణికిపోయాను. అతడి ద్వారా సంగతి ఊరందరికీ తెలిస్తే నాది గజ్జికుక్క బతుకైపోద్ది!

"అహహ! అలాటిదేం లేదు. ఏవో తప్పుడు వార్తలు. కాంపిటీటర్స్ పన్నిన కుట్ర. దట్సాల్! రేపు కలుద్దాం మీకు పెద్ద డిపాజిట్ ఇస్తాన్లెండి.." అక్కడ్నుంచి దూరంగా వెళ్లడానికి ప్రయత్నించాను. కానతడు నా చొక్కా పట్టుకుని మరీ లాగాడు. "ఆగు సామీ! పని ఉండాది. మాది బ్రదర్ మీ కంపెనీల మనీ పెట్టేడు. టూ లాక్స్! చెన్నయ్‌ల వీడు అమ్మేడు. ఇంట్రెస్ట్ జాస్తిగా ఇస్తురని మీ కంపెనీల పెట్టినాడు. వానికి పిల్లకాయ లుండారు. వాపసు ఇప్పించు సామీ! ప్లీజ్ హెల్ప్ హిమ్" చేతులు పట్టుకున్నాడు.

"పేరూ ఎడ్రస్సూ రాసివ్వండి. వెంటనే ఏర్పాట్లు చేస్తాను"

"రొంబ థేంక్సు! మరిసిపోకు సామీ!" గబగబా రాసిచ్చాడు.

పెళ్లిమంటపానికో పక్క గుంపుగా ఉన్న

అక్షరం

సమాజంలో
మార్పు చూడాలనుకుంటే..
ముందుగా మీరు మారండి

– మహాత్మా గాంధీ



టీనేజ్ అబ్బాయిలూ అమ్మాయిల దగ్గరికి తీసుకెళ్లి పరిచయం చేసింది రాకుమారి.

"వీరే వేణుగోపాలరావని ప్రముఖ వ్యాపారవేత్త. ఇప్పుడిలా సూటూ బూటూ వేసుకున్నాడు గానీ ఒకప్పుడు సరైన బట్టలు కూడా ఉండేవి కాదు. స్వయంకృషితో పైకొచ్చాడు. నిజం చెప్పాలంటే వేణు అనే మొక్కని నిలబెట్టిందీ, నీరుపోసి ఎదిగేందుకు దోహద పడిందీ మనఊరే. ఎవరైనా గొప్పవారయ్యారంటే, దాని వెనుక ఎందరెందరో ఉంటారు. ఉత్తగాలే అయినా వేణువులో దూరితే నాదమవుతుంది. వేణుగానమవుతుంది. సమాజం నుండి అవసరమైన శక్తుల్ని తీసుకోండి. కానీ తిరిగి సమాజానికి ఎంతో కొంత ఇవ్వడం మాత్రం మర్చిపోకండి!"

నిరుత్తరుణ్ణయ్యాను. నేను చెప్పిన కథలు విని పెద్దదైన రాకుమారి ఎంత చక్కగా విశ్లేషిస్తోంది!

యువతీ యువకులు నన్ను స్ఫూర్తిగా తీసుకుంటున్నామనేసరికి భుజాలు నాలు గంగుళాలు పెరిగాయి. ఇదే ఇదివరకైతే అరగంటసేపు ఉపన్యాసం ఇచ్చేవాడ్ని. అయినా, చకచకా నిచ్చెన మెట్లెక్కి పైకెళ్లడం గురించి నాలుగు ముక్కలు చెప్పి వారి ప్రశంసాపూర్వక చూపులు మూటగట్టుకున్నాను.

పెళ్లిమండపం ముందుకి తీసుకెళ్లి మరీ కూర్చోబెట్టాడు రాజ్‌కుమార్.

నా పెళ్లి ఊసులు గుర్తుచేసుకున్నాను.

తాశిల్దారుగారు ఖర్చంతా తనే భరించి మా పెళ్లి చాలా ఘనంగా చేశారు. బంధుమిత్రులకన్నా ఉద్యోగులు, నాయకులు, వ్యాపారులు, మునసబు కరణాలూ పెద్దఎత్తున తరలివచ్చారు. ఎన్నో కానుకలు చదివించారు.

లక్ష్మీరాణి ముందు నేను బాగా తేలిపోయాను. తనది కొంచెం స్థూలకాయం. నేను బక్కగా అర్భకంగా ఉన్నాను.

రాణి పెళ్లిపీటల మీద ఎలాంటి సిగ్గూ లేకుండా ఠీవిగా కూర్చుంటే, నేను మాత్రం నీళ్లునములుతూ దిక్కులుచూస్తూ కూర్చున్నాను. అతిథుల్లో తొంభైశాతం తాశిల్దారు గారి తరపువాళ్లే! వచ్చిన కానుకలూ, చదివింపులూ అన్నీ రాణికే వచ్చాయి.

బంగారు నగల్తో మెరిసిపోతున్న రాణి పక్కన, నేను దిష్టిబొమ్మలా ఉన్నానని తాశిల్దారుగారి బంధువెవరో అన్నారని అమ్మ ఎంతో బాధపడింది.

"నేరక ఈ సంబంధం చేశాన్రా! నన్ను తిట్టుకోకురా నాన్నా!" అంది అమ్మ కళ్ల నీళ్లుపెట్టుకుని.

"ఇప్పుడేమైందనీ! ఎవరో ఏదో అంటే మనకేం పోతుంది? మొఖం మీద ఉమ్మేసినా తుడిచేసుకుని ముందుకెళ్లిపోవాలి గానీ, మనస్సులో పెట్టుకోకూడదు. బాగుపడే లక్షణం అదే!"

అప్పుడు అమ్మ కళ్లల్లో కదిలిన 'విస్మయం' ఇప్పటికీ నాకు గుర్తుంది.

పెళ్లిళ్లు స్వర్గంలో జరుగుతాయి. మాపెళ్లీ అలాగే జరిగింది. కనుకే నేనీ స్థాయికి ఎదగగలిగాను. ఇంత ఉచ్ఛస్థితికి చేరుకోగలిగాను. ఊరేదో నాకు ఉపకారం చేసిందని రాకుమారి కబుర్లు చెబుతోంది

గానీ, నిజానికి నా ఉన్నతి వెనుక ఉన్న ఏకైక వ్యక్తీ.. శక్తీ మా మావగారు తాశిల్దారు గారే!

పురోహితుడు మంత్రాలు చదువుతూ వాటి అర్థాలు వివరిస్తూ మధ్య మధ్య వ్యాఖ్యానాలు చేస్తోంటే ఆసక్తిగా విన్నాను.

"ధర్మప్రజాపత్యర్థం స్త్రయముద్వహే.. అంటే ధర్మమయమైన, గుణ వంతమైన సంతానం కోసం ఈ స్త్రీని పెళ్లాడుతున్నాను- అని అర్థం. ఇక్కడ గ్రహించాల్సిన విషయం ఏవిటంటే ఏదో ఒక సంతానం కోసం వివాహమాడటం లేదు. గుణవంతులైన సంతానం కావాలి. అలాటి వాళ్లవల్లే కన్నవాళ్లు తరిస్తారు. కన్నదేశం సుసంపన్నమవుతుంది. దుర్యోధనుడిలాంటి వాడ్ని కంటే గర్భశోకం, కులనాశనం మిగుల్తాయి" శాస్త్రులుగారు చెప్పుకుపోతున్నారు.

**కొత్తగాలి...**

**తొలి సందెలో ఎరుపు**
**పుల్లట్టులో పులుపు**
**పదహారులో వలపు**
**మా బాపు!**

– బి. రాజు,
జగ్గంపేట, తూ.గో. జిల్లా

ఉలిక్కిపడ్డాను. నేనూ అలాంటి సంతానాన్నేనా? నా పిల్లలు కూడా అలాంటి సంతానమేనా?

కాదు..! కాదు..! అయినా ఈకాలంలో ఆ చాదస్తపు భావాలెక్కడ చెల్లుతాయి! వాటికెప్పుడో కాలం చెల్లింది!

రెండు నిమిషాలకి వధూవరుల చేత జీలకర్రా బెల్లం పెట్టించారు.

మూర్తి కళ్లు తుడుచుకున్నాడు. అతడికెంత ఉద్విగ్నంగా ఉందో నాకు తెలుస్తూనే ఉంది.

★ ★ ★

ఎవరూ వినకూడదని కొబ్బరి తోటలో కెళ్లి రాణికి ఫోన్ చేశాను.

"అయ్యోరామా! ఫోనెందుకు చేశారూ! మీరు ఎక్కడున్నదీ తెలిసిపోదూ! పెట్టెయ్యండి! పెట్టెయ్యండి!" అంటూ కట్ చేసింది.

పోలీసులు ఫోన్ల మీద నిఘా పెట్టారా? అంటే పరిస్థితి మళ్లీ దిగజారిందా?

ప్లీడరుకి ఫోన్‌చేసి "అసలేం జరుగుతోందో సూటిగా చెప్పండి" అనడిగాను.

"ఒక్కముక్కలో చెప్పాలంటే ఎటు అడుగేస్తే ఏం ఎదురొస్తుందోనని భయంభయంగా ఉంది!"

"జడ్జిగారి వియ్యంకుడ్ని కొనెయ్యలేకపోయారా? "

"కొన్నాం! కానీ జడ్జీగారే ఎదురుతిరిగారు. మన మీద పోలీసు కేసు పెడతానని రంకెలేశారు"

"మీరేమన్నారు? " గుండెలు జారిపోతోంటే అడిగాను.

"ఏమంటాం? లెంపలేసుకున్నాం!"

"మరైతే కేసు పరిస్థితేమిటి? "

"కంపెనీ ఆస్తులు జప్తుచేశారు. డిపాజిట్లన్నీ తిరిగి చెల్లించాలంటే అవి ఒకమూలకి కూడా రావు. ఇక మీ మీదకి వస్తారేమో! వచ్చేవారం మీరు బోనెక్కాల్సి ఉంది! వస్తున్నారా? "

"నన్ను రమ్మనలేదే!"

"మీ అబ్బాయిలు ఇంకేదో ఎత్తు వేద్దామంటున్నారు! హనుమంతుడి ముందు కుప్పిగంతులు సాగవంటే వినరు!"

"వాళ్ల ఆలోచనేంటిట? "

"కేసుల గొడవల వల్ల మీకు మతి తప్పి ఎక్కడికో వెళ్లిపోయారనీ, వెదుకుతున్నామనీ కోర్టుకి విన్నవిస్తారట"

తుళ్లిపడ్డాను! "అలాటి పిచ్చి ఆలోచన వాళ్లకెలా వచ్చింది? "

"మీరు కోర్టుకు హాజరుకాకుండా తప్పిం

చవచ్చనీ, జడ్జి సానుభూతి సంపాదించొచ్చనీ ఎవరో సలహా ఇచ్చినట్టున్నారు..!"

కన్నీళ్లు వచ్చాయి. "దటీజ్ టూ మచ్..!"

"డాక్టర్లని కలుస్తున్నారు. మీకేదో ట్రీట్‌మెంట్ చేసినట్లు సర్టిఫికెట్లు సంపాదిస్తున్నారు. కేసు ఇంకే మలుపు తిరుగుతుందో చూద్దాం!"

"వాళ్లవల్ల ఏం కాదుగానీ, నేను రేపే బయల్దేరి వచ్చేస్తాను!"

"వద్దొద్దు! డిపాజిటర్లు ఆగ్రహావేశాల్లో ఉన్నారు. ఇక కోర్టు సరేసరి! జనాన్ని నిలువునా ముంచారని జడ్జికి మీ మీద పీకలదాకా కోపముంది. మీ బిల్డింగులోంచి దూకినవాడి భార్య చనిపోయింది. మీరు డబ్బిచ్చి ఉంటే, ఆపరేషన్ జరిగి ఉంటే బతికేదంటున్నారు. మీరు కన్పిస్తే మిమ్మల్ని బతకనివ్వరు"

క్షణకాలం నోటమాట రాలేదు. "అందరికీ నా మీద అంత కసిగా ఉందా? " కంపిస్తూ అడిగాను.

"ఒకరూ ఇద్దరూ కాదు వేలాదిమంది. వందలూ వేలూ విషయం కాదు కోట్లకు కోట్లు..!"

చేష్టలు దక్కి కూర్చుండిపోయాను. ఏడ్వాలని ఉంది. కానీ ఏడ్వలేని పరిస్థితి!

సాంఘిక బహిష్కరణకి గురైనట్టుగా ఉంది! నవరంధ్రాలని ఒక్కొక్కటిగా బంధిస్తున్నట్టుగా ఉంది! ఇదేం రకం శిక్ష? ఎవరు, ఎందుకు విధించారు?

"నీ చోద్యం సంతకెల్లా! ఇక్కడే గుడ్డి గుర్రం పళ్లు తోముతున్నావురా? " అంది అటుగా వచ్చిన అచ్చమ్మ.

గబగబా వీధిలోకెళ్లాను.

"అలా ఉన్నావేం వేణూ!" అడిగాడు మూర్తి.

శుష్కహాసం చేశాను.

గుండెల్లోని బాధని ఎవరికీ చెప్పుకోలేను. ఆవేదనని ఎవర్తోనూ పంచుకోలేను. ఇంతకంటే నరకయాతన ఉండదేమో!

"నీలో నువ్వే మథనపడతావేంటిరా? ఏదైనా అనారోగ్యమా? " అడిగాడు మళ్లీ!

అయితే వాడు నాకేదో ప్రాణాంతక రోగం వచ్చి, విశ్రాంతి కోసం ఇలా వచ్చాననుకుంటున్నాడా?

మనస్సు తేలికపడింది "అలాంటిదేరా! అలా ఊళ్లోకెళ్లి వస్తాను!"

కాళ్లు గుడివైపుకి లాక్కెళ్లాయి.

గీతోపన్యాసాలంటూ బ్యానర్ కట్టిఉంది.

స్వామీజీని ఆశ్రయిస్తే? ఏదో ఒక దారి చూపుతారేమో?

స్వామీజీ పద్మాసనం వేసుకుని ధ్యానంలో నిమగ్నమై ఉన్నారు. ఆయన్నే చూస్తూ కూర్చున్నాను.

ఆయన మోము ఎంత ప్రశాంతంగా ఉంది!

ఇదెలా సాధ్యపడింది? భవబంధాలని తెంచుకున్నందునా? తామరాకు మీది నీటిబొట్టులా ఉండగలగటం.. చెప్పినంత తేలికైన పనేనా?

ఆయన కళ్లు తెరిచారు. నమస్కరించాను. మందహాసం చేశారు.

"అశాంతిగా, అలజడిగా ఉన్నావేం బిడ్డా? "

నివ్వెరబోయాను! మరుక్షణం ఏడ్చేశాను. ఆయన వారించలేదు.

"ఎందుకంత దిగులుగా ఉన్నావు? "

"జరక్కూడనిది జరుగుతుందేమోనని భయంగా ఉంది స్వామీ!"

"జరక్కూడనిదా? జరక్కూడదని అనుకుంటున్నదా? "

అర్థం కాలేదు. అయోమయంగా చూశాను.

"వేప విత్తు నాటి, మామిడి మొక్క మొలవలేదనుకోవడం అజ్ఞానం నాయనా!"

"అది నిజమే స్వామీ! కానీ..!"

"దుర్యోధనుడు నిస్సహాయస్థితిలో ఉండగా అతడి తొడలు విరగ్గొట్టాడు

భీముడు. ఆ దురవస్థ అకస్మాత్తుగా వచ్చిందంటావా చెప్పు? "

మరెలా వచ్చిందన్నట్టు చూశాను.

"నిండు సభలో నిస్సహాయురాలైన ఒక స్త్రీని తన తొడలపై కూర్చోమన్నప్పుడే ఈ ఊరు భంగ పర్యవసానం ప్రస్తావనకు వచ్చింది. అంటే అతడి ప్రవృత్తిలోనే అతడి భవిష్యత్తు ఉందన్నమాట!"

నోటి తడారిపోగా పిచ్చిగా చూశాను. చిన్నగా నవ్వేరు.

నా గురించి, నా స్వభావం గురించి, నా వ్యాపారం గురించి, నా ముగింపు గురించి అన్నీతెలిసిన సర్వజ్ఞునిలా కన్పించారు. మళ్ళీ చేతులు జోడించాను.

"నీ భయం దేని గురించి? "

"ఆస్తులన్నీ కొట్టుకుపోతాయేమోనని? "

నవ్వేరు "నీ ఆస్తిపాస్తులా? "

"నావే స్వామీ! కష్టపడి సంపాదించినవి.."

"అంత శ్రమించి సంపాదించింది ఎందుకు పోతుంది? "

"ఎందుకంటే.." నీళ్ళు నమిలాను.

"నీది కానిది దగ్గరుంచుకున్నావు గనుక!"

"అదేవిటి స్వామీ? నా దగ్గరి కొచ్చిందంతా నాదే కదా!"

"నీదా? నువ్వీలోకంలోకి వస్తూ తెచ్చేవా? "

"ఎవరైనా అంతేగదా స్వామీ! పుడుతూ వెంట ఏమీ తెచ్చుకోం!"

"పోనీ, వెళ్ళేప్పుడేమైనా పట్టుకెళ్తావా? "

"ఊహుc..!"

"మరెందుకీ తపన, తాపత్రయం? "

"అది కాదు స్వామీ! నా ఆస్తి పోతే మేం రోడ్డున పడిపోతాం!"

"అది నీ ఆస్తి ఎలా అవుతుంది? దాన్ని నువ్వు తీసుకురాలేదు. అలాగని కొత్తగా సృష్టించనూ లేదు. ఇక్కడున్నదాన్నే పోగుజేశావు. అంటే ఇతరుల దగ్గర్నుంచి తీసుకున్నావు. ధర్మబద్ధంగా తీసుకుని వుంటే జీర్ణమయ్యేది. అవినీతి మార్గాన తీసుకున్నావు గనుక బాధపడుతున్నావు. ఇతరుల సొత్తుని చేజిక్కించుకున్నంత మాత్రాన అది నీదయిపోతుందా చెప్పు!"

తల అడ్డంగా ఊపాను.

"నీదికాంది నీ దగ్గర్నుంచి పోతున్నప్పుడు భయమెందుకు? బాధ ఎందుకు? "

మిర్రి చూశాను.

"నీది నీకు రాకపోయినా బాధపడతావు. ఇంకొకరిది వారికివ్వడానికీ బాధపడతావు. చిత్రంగా లేదూ? "

ఏం చెప్పాలో తెలీక కళ్ళప్పగించాను.

"నీ వెంట ఏది వస్తుందో, అది మాత్రమే నీ సొంతం"

అయోమయంగా చూశాను.

"నీటిబొట్టు వేడినూనెలో పడితే ఆవిరి అవుతుంది. తామరాకు మీద పడితే తళతళా మెరుస్తుంది. ముత్యపుచిప్పలో పడితే ముత్యమవుతుంది. జీవితం కూడా అంతే! ముత్యమవ్వాలంటే మురికి కాలువలో కాదు ముత్యపు చిప్పలో పడాలి!"

"నిజమే స్వామీ! కానీ.. విధిరాత వల్ల అన్నీ అలా తోసుకొచ్చాయి. నేను నిమిత్త మాత్రుడ్ని! అయినా ప్రాణాంతక ఊబిలో చిక్కుకుపోయాను. ఏం చేయాలో దిక్కు తోచటం లేదు. అంతా అయోమయంగా.. అగమ్యగోచరంగా వుంది"

చిద్విలాసంగా నవ్వేరు.

"జీవితమంటే ఏడుస్తూ పుట్టి, ఏడిపిస్తూ పోవడం కాదు. మనిషి జీవిత లక్ష్యం కేవలం జీవించడం కాదు! ఉన్నతంగా జీవించడం!" అర్థమైందన్నట్టు తలూపి తమ శలవేమిటన్నట్టు ఆశగా చూశాను.

"గోదావరికి వరద వచ్చినప్పుడు చూశావా? "

"చూశాను స్వామీ! నాది ఈ ఊరే!"

"వరదలో ఏమేం కొట్టుకుపోతాయి? విరిగిన కొమ్మలు, కొయ్యలు, చెక్కలు, చెప్పులు, చెత్తాచెదారం. అంటే ఏవిటన్న

# కొవ్వు అస్సలుండని ఆహారపదార్థం?

చతుర సమగుళికలు

ప్రతిరోజూ మనం తినే ఆహారపదార్థాలు, వాటికి సంబంధించిన కొన్ని అరుదైన విశేషాలు..

★ మనుషులంతా పుట్టుకతోనే ఇష్టపడే ఏకైక ఆహార పదార్థం చక్కెర.

★ ఇంగ్లీషులో అరటిపండ్ల గుత్తిని 'హేండ్' అని, ఒక అరటి పండుని 'ఫింగర్' అని పిలుస్తారు.

★ ప్రతీ అనాస చెట్టు ఏడాదికి ఒక పండుని మాత్రమే ఇస్తుంది!

★ లాటిన్ భాషలో ఆనియన్ అంటే పెద్ద ముత్యం అని అర్థం.

★ ద్రాక్షలో అరవై, జామలో ఎనిమిది వేల రకాలు ఉన్నాయి.

★ అమెరికాలో అత్యధికంగా అమ్ముడయ్యే తాజా కూరగాయ లెట్యూస్.

★ ఇరవై ఏళ్ళ క్రితంకంటే, నేడు తొమ్మిదొందల శాతం బ్రోకలీ (ఒకరకం తోటకూర)ని అధికంగా తింటున్నారు.

★ అమెరికాలో గుమ్మడి పూలని తింటారు!

★ టమాటాలలో పది వేలకి పైగా రకాలున్నాయి!

★ యాపిల్ పండ్లలో ఏడు వేలకి పైగా రకాలున్నాయి!



★ క్యారెట్‌లో కొవ్వు అసలు ఉండదు!

★ ఒక పౌండ్ తేనె సేకరించడానికి తేనెటీగ 20 లక్షల పూల మీద వాలుతుంది!

మాట! కొట్టుకుపోవడం నిర్జీవ లక్షణం. నదిలో చేపలూ ఉంటాయి కదా! అవీ కొట్టుకుపోతాయా? పోవు! ఎదురీదుతాయి! ఎదురీదటం జీవలక్షణం!"

నా మొఖం విప్పారింది.

ఎదురీదాలి! ఎస్! ఎదురీదుతాను!

"ధన్యుడ్ని స్వామీ!"

ఇంట్లో అడుగుపెడుతోంటే అచ్చమ్మ ఎదురైంది.

"తోచీతోచనమ్మ తోడికోడలు పుట్టింటికెళ్ళిందిట! అలా వుందిరా నీ వరస! పెళ్ళికొచ్చినవాళ్ళయితే పెళ్ళవ్వగానే వెళ్తారు. పనిమీదొచ్చిన వాళ్ళయితే పనవ్వగానే వెళ్తారు. తిష్ఠ వేయడానికొచ్చిన వాళ్ళయితే ఎందుకెళ్తారూ!" అంటూ సాగదీసింది.

★ ★ ★

"అలా గోదావరి ఒడ్డు కెళ్ళొద్దాం రారా వేణూ! మాట్లాడాల్సిన పని ఉంది పద!"

గోదావరి గట్టెక్కాం! నీరెండ పడి గోదావరి మెరుస్తోంది. నది మీంచి వీస్తోన్న చల్లగాలి ఆహ్లాదపరుస్తోంది.

మూర్తి ఏం అడిగితే, ఏం సమాధానం చెప్పాలా? అని ఆలోచిస్తూండిపోయాను.

"ఎలాంటి దాపరికాలూ లేకుండా మాట్లాడుకుందాం. నేన్నీ బాల్య స్నేహితుడ్ననీ, నీ మేలు కోరేవాడ్ననీ గుర్తుంచుకుని చెప్పు. నీ సమస్యేంటి? ఎందుకిక్కడి కొచ్చి ఉంటున్నావు? ఎందుకంత అశాంతిగా, ఆందోళనగా ఉంటున్నావు?"

గతుక్కుమన్నాను. ఆ వెంటనే తేలిక చేస్తూ నవ్వేశాను. "అలాటిదేం లేదే!"

నా వంక జాలిగా చూశాడు. "ఏం జరిగిందో నాకు చెప్పడానిక్కూడా ధైర్యం చాలటం లేదన్నమాట!"

"అసలేమైనా ఉంటేగా చెప్పడానికి!"

"ఉందో? లేదో? నీకు తెలుసు. నీ

అంతరాత్మకు తెలుసు. బుకాయించకుండా చెప్పు! దానివల్ల ఎంతో కొంత ప్రయోజనం ఉంటుంది. నీలోకి నువ్వు తొంగిచూసుకునే అవకాశం కలుగుతుంది. సింహావలోకనం చేసుకోవచ్చు. ఏది రాజమార్గమో తెలుసుకోవచ్చు"

ఏదోటి చెప్పితే తప్ప, వాడి 'ఇగో' తృప్తి పడదని అర్థమైంది.

బాధగా మొహం పెట్టి, కాస్సేపు మౌనంగా ఉండి, మెల్లగా లోగొంతుకతో అన్నాను "నా ఆరోగ్యం బావోటం లేదురా! లివర్ క్యాన్సర్! ఎక్కువ కాలం బతకను! ఎలాంటి ఒత్తిళ్లూ లేకుండా, పుట్టిన ఊళ్ళో ప్రశాంతంగా గడిపి, ఆయుష్షు కొన్నిరోజులైనా పొడిగించుకుందామని వచ్చాను. ఈ సంగతి బయటపెట్టి మీ అందర్నీ బాధపెట్టడం ఇష్టంలేక చెప్పలేదు"

అపనమ్మకంగా చూశాడు. "అప్పటికీ ఇప్పటికీ నువ్వు మారలేదురా వేణూ! ఉన్నది ఉన్నట్టు చూడవు! ఊహల రంగు లద్ది చూస్తావు! అదే నిజమని భ్రమపడతావో? లేదో? కానీ అందర్నీ భ్రమించమంటావు!"

"నీ మాటలు ఒక్క ముక్కా నాకు అర్థం కావట్లేదు"

"నువ్వు మారేవనుకున్నాను. ఊహుఁ! మారలేదు. అంత జరిగినా నీలో మార్పు రాలేదంటే నువ్వు కరడుగట్టిన డబ్బు మనిషివన్నమాటే!"

క్షణకాలం గుండెచప్పుడు ఆగిపోయింది!

"డబ్బుకీ, నా రోగానికీ సంబంధం ఏవిటి? " నోరు పెగల్చుకుని అన్నాను.

"నీది డబ్బురోగం గనుక! చిన్నప్పుడు టాల్‌స్టాయ్ కథ 'మనిషికెంత భూమి కావాలి? ' చదివాం. అందులో అత్యాశాపరుడే కరక్టని నువ్వూ, కాదని నేనూ వాదించుకున్నాం! గుర్తుందా? "

గుర్తుంది! కానీ తల అడ్డంగా ఊపాను.

"కనీసం కథయినా గుర్తుందా? మరచిపోయుంటావులే! గుర్తుచెయ్యనా? "

"అహ! గుర్తొచ్చింది! గుర్తొచ్చింది..!!" ఇంకేమనాలో తోచక అన్నాను.

"హఠాత్తుగా ఊళ్ళోకి ఊడిపడ్డావంటే జరక్కూడనిదేదో జరిగిందని గ్రహించాను. నీ అంతట నువ్వే బయటపడతావని ఇన్నాళ్లూ ఓపికపట్టాను. ముసుగులో గుద్దులాట అనవసరమని ఇక్కడికి తీసుకొచ్చాను. గోదావరి సాక్షిగా నిజం చెబుతావని ఆశించాను!"

"గాలిలో అనుమానపు మేడలు కట్టేస్తున్నావు" అఫెన్స్‌లోకి వెళ్ళడమే మార్గమన్పించి ఎదురుతిరిగాను.

బాధగా నవ్వేడు. "నీది చాలా చిత్రమైన మనస్తత్వంరా వేణూ! ఏరు దాటేక తెప్ప తగలెయ్యడానికి సిద్ధపడతావు. నువ్వు అందలం ఎక్కడం కోసం అందర్నీ ఉపయోగించుకుని ఆ తర్వాత కాలితో తన్నేస్తావు. 'ఎల్లేరమ్మ కళ్ళెప్పుడూ ఎండుచేపల మీదే' అన్నట్టు నీ కళ్ళెప్పుడూ డబ్బు మీదే! అందలాల మీదే! వాటి ముందు ఎవ్వరూ కన్పించరు. ఆఖరికి కన్నతల్లితో సహా ఎవర్నీ లెక్కపెట్టవు. ఇక విలువలకి ముందే తిలోదకాలిచ్చేశావు!"

ఒంట్లోని రక్తమంతా అమాంతం ఇంకిపోయిన అనుభూతి కలిగింది.

"మనిషి కోరికల పుట్ట! కోరికలుండటం తప్పుకాదు! అత్యాశ మాత్రం ముప్పే!"

## కొత్తగాలి...

**వనిత ఒడిలో వెచ్చదనం**
**ఏసీ కారులో చల్లదనం**
**ఓ శునక రాజమా!**
**ఆహా! ఏమి నీ వైభోగం!**

*– డా. యండపల్లి పాండురంగ,*
*గణపవరం, ప.గో. జిల్లా*

ఒక క్షణం ఆగి, తిరిగి అన్నాడు "అత్యంత ప్రమాదకరమైన మూడు కోర్కెలేమిటో తెలుసా? ధన వ్యామోహం, స్త్రీ వ్యామోహం, కీర్తి వ్యామోహం. వాటి వెంటబడితే మూడటం ఖాయం!"

సర్రున కోపం, ఆవేశం తన్నుకొచ్చాయి.

"నువ్వసలు నా గురించి ఏమనుకుంటున్నావ్? నువ్వేదో ఆకాశంలోంచి దిగొచ్చినట్టు లెక్చర్లు దంచుతున్నావేంటి? నేన్నీలాటి వాళ్ళని వందమందిని కాదు, వెయ్యి మందిని కొనగలను తెలుసా? "

నా ధోరణికి నివ్వెరబోయాడు మూర్తి.

"చేతకాని వాళ్ళూ, చేవలేని వాళ్ళూ చేసే మొదటి పనేంటో తెలుసా? నీలా నీతులు వల్లించడం!"

"ఆహా! చేతనైన వాళ్ళేం చేస్తారట? గోతులు తీస్తారా? "

గుండుకు చెమటలు పడుతోంటే సన్నగా కంపిస్తూ మిర్రి చూశాను.

"లోకంలో బంగారు లేడి వుండదని తెలుసు. అయినా బంగారు లేడిని చూసి, అది కావాలని కోరుకుంది సీత! పర్యవసానం ఏమిటో నీకు తెలుసు? రాముడు పెళ్లయినవాడని తెలుసు. అయినా అతడ్నీ మోహించి కావాలనుకుంది శూర్పణఖ! తన రాక్షస కోరికకి ప్రతిఫలం ఏమొచ్చిందో నీకు తెలుసు! పరస్త్రీని తన పడకటింటికి చేర్చుకోవాలని సీతని చూసి ఆశపడ్డాడు రావణుడు. అతడి పదితలలూ ఏమయ్యాయో నీకు తెలుసు!"

వెర్రిగా చూశాను.

"పిల్లి కళ్ళుమూసుకుని పాలుతాగుతూ, తననెవరూ చూడటం లేదనుకుంటుందిట! నువ్వూ అలాగే అనుకుంటున్నావు! నువ్వు కళ్ళకి గంతలు కట్టుకున్నావేమో గానీ, మేం కట్టుకోలేదు. నీ గురించి, నీ వ్యాపారాల గురించీ పేపర్లలో చదువుతున్నాం. టీవీలో చూస్తున్నాం..!"

బ్రమాన్పడిపోయాను. నిస్త్రాణగా వాలిపోయాను. అంతమాత్రాన ఓటమిని ఒప్పుకోదలుచుకోలేదు.

బిగ్గరగా నవ్వుతూ లేచాను. "నువ్వింత అమాయకుడివి అనుకోలేదురా మూర్తీ! మొత్తానికి పల్లెటూరివాడివి అన్పించుకున్నావు. పేపర్లూ, న్యూస్ ఛానల్సూ కొందరి కొమ్ముకాస్తాయి. మరి కొందర్నీ తెగడటమే పనిగా పెట్టుకుంటాయి. అవి కాకమ్మ కబుర్లని అందరికీ తెలుసు. చూసి వినోదిస్తారు తప్ప, ఎవరూ విశ్వసించరు. టీవీఛానళ్ల రేటింగ్ మత్తుకు బానిసలని తెలీకపోవడం నీ అజ్ఞానం. అన్నట్టు, నా గురించో న్యూస్‌ఛానల్ ఎన్నో ప్రత్యేకకథ నాలు ప్రసారం చేస్తూంటుంది. ఎందుకో ఊహించగలవా? "

అతడి దగ్గరికెళ్ళి స్వరం పెంచి ప్రశ్నించాను. అతడు నోరు తెరిచే లోపల తిరిగి నేనే అన్నాను. "తెలీదు! వాళ్ళు నా ఫైనాన్స్ బిజినెస్ గురించి అవాకులూ చవాకులూ ప్రసారం చేస్తామంటూ బెదిరించారు. బ్లాక్ మెయిల్ చెయ్యాలనీ చూశారు. యాభై లక్షలిమ్మన్నారు! ఇవ్వను పొమ్మన్నాను! కనీసం కోటి రూపాయల యాడ్స్ ఇమ్మన్నారు. 'నో' అన్నాను. దాంతో కక్షగట్టి గాలి విత్తి, సుడిగాలి మొలిపిస్తున్నారు. పిచ్చోళ్ళు! తాటాకుల చప్పుళ్ళకి బెదరడానికి నేను కుందేలుని కాదని వాళ్ళకి తెలీదు!"

"ఇదీ కట్టుకథేనంటావు!" ఓ పేపర్ కటింగు జేబులోంచి తీసి నాకందిచ్చాడు.

'రాణి ఫైనాన్స్ కంపెనీ మోసానికి ఓ కుటుంబం బలి' అని హెడ్డింగ్ పెట్టి రాసిన వార్తని గబగబా చదివాను.

అమ్మాయి పెళ్లి నిమిత్తం ఉన్నది అమ్మి, చీటీలు పాడి పోగుజేసిన డబ్బు రాణి ఫైనాన్స్‌లో అధిక వడ్డీ వస్తుందని ఆశపడి దాచుకున్నారు. పెళ్ళి కుదిరిందిట! దాచుకున్న డబ్బు కోసం రాణి ఫైనాన్స్ కంపెనీ చుట్టూ కాళ్ళరిగేలా తిరిగారట! కంపెనీ

తెరవకపోవడమే కాదు, సరైన సమాధానం లభించ లేదుట! సమయానికి కట్నం ఇవ్వనందున పెళ్లి చెడిపోయిందిట! ఆ అవమానం భరించలేక ఇంటిల్లపాదీ విషం తాగి ఆత్మహత్య చేసుకున్నారట!

"ఇలా వార్తలకెక్కని విషాద ఘటనలు ఇంకెన్ని వున్నాయో! వాళ్ళ ఉసురు పోసుకుని నువ్వేం బావుకుంటావురా వేణూ? పోనీ పోతూ పోతూ నువ్వేం పట్టుకుపోతావో? అదైనా చెప్పు!" తీవ్ర స్వరంతో ప్రశ్నించాడు.

సమాధానం తోచలేదు. మౌనాన్నాశ్రయించాను.

"మనిషి జీవితం గొప్పది! నీ జీవితం కన్నా ఇతరుల బతుకులు విలువైనవి! వాళ్ళని రక్షించటం నీ బాధ్యత. అందులోనే నీకు సాఫల్యం వుంది! మోక్షం వుంది!"



"బస్! ఇక ధర్మపన్నాలు కట్టిపెట్టు! జనం ఊరికే నా సంస్థల్లో డబ్బు దాచుకోలేదు. అధిక వడ్డీకి ఆశపడి దాచుకున్నారు. ఎక్కువ వడ్డీ కావాలంటే ఎక్కువ రిస్కు తీసుకోక తప్పదు. వాళ్ళు రిస్కు తీసుకున్నారు. దెబ్బతిన్నారు. దట్సాల్! నా వంక వేలెత్తి చూపడానికీ, నన్ను నిందించడానికీ నీ అర్హత సరిపోదు! మైండిట్..!"

గర్జించి విసవిసా ఊరివైపు నడిచాను.

సగం దూరం వెళ్ళానో? లేదో? సెల్ మోగింది.

"బ్యాడ్ న్యూస్ డాడ్! నీ మీదా, ఇతర పార్టనర్ల మీదా అరెస్టు వారెంట్లు జారీచేశారు"

ధనేష్ మాటలకు నిరుత్తరుడ్నయ్యాను. నవనాడులూ కుంగిపోయాయి.

కోపం.. దుఃఖం జమిలిగా రాగా, "మీరేం చేస్తున్నార్రా? గుడ్డి గుర్రం పళ్ళు తోముతున్నారా? " ఆవేశపడ్డాను.

"ఆ జడ్జి మొండిఘటం!"

"అలాంటి వాళ్ళని ఇంతమందిని చూశాను. ప్రతివాడికీ రేటు ఉంటుంది. పదిరూపాయల పనికి వెయ్యి పడేస్తే సత్య హరిశ్చంద్రుడైనా దాసోహమంటాడు"

"అన్నిరకాలుగా ప్రయత్నించాం కానీ.."



క్యారక్టర్ మీద దెబ్బకొడితే ఎలాటివా డైనా కాళ్ళబేరానికి వచ్చితీరతాడు. రాకపోతే కేసుని మరో కోర్టుకు మార్చమని హైకోర్టులో పిటీషన్ పడేస్తా. గుండెల్లో కలేజా ఉంటే మనుషుల్తో ఆడుకోచ్చురా! నేనెలాంటి కేసుల్ని ఉఫ్‌మని ఊదేయించానో మీకు తెలీదు. ఇప్పుడే బయల్దేరి హైదరాబాద్ వచ్చేస్తాను. ఎలా చేస్తానో నీ కళ్ళతో నువ్వే చూద్దువు గాని!"

"వద్దు డాడ్! నువ్వు కంటబడితే డిపాజిటర్లు రెచ్చిపోతారు. సున్నంలోకి ఎముక మిగల్చరు.."

"కడకిదీ మీరు చేసిన నిర్వాకం! అసలు మిమ్మల్ని నమ్మి ఆ గొడవలు మీకప్పగించి రావడం నాదీ బుద్ధితక్కువ! మీరు చాకచక్యంగా హ్యాండిల్ చేస్తారనుకున్నాను గానీ, ఇలా కోతిపుండుని బ్రహ్మరాక్షసి చేసి వదుల్తారనుకోలేదు!" దుఃఖం పొంగివస్తోంటే అరిచాను.

"మీరు కూడా ఇంతకంటే బాగా చెయ్యలేరు!" రోషపడ్డాడు.

"నేనేంటో? నా తడాఖా ఏంటో చూపిస్తా! ఇప్పుడే బయల్దేరి వచ్చేస్తాను. జడ్జి తన వియ్యంకుడి ద్వారా బేరంపెట్టాడని ఆరోపిస్తా! కుర్రపిల్లని పంపి అఘాయిత్యం చేయబోయాడని అల్లరి చేయిస్తా! మాంసం ముక్క పడేస్తే చాలు, దాని కోసం కొట్టుకు ఛస్తారు. నేను దొరలా బయటపడిపోతాను. మీకు నా టాక్టిక్స్ తెలీవురా పిల్లకాకీ! తప్పదనుకుంటే ఏకంగా జడ్జినే లేపేస్తాను!" లైన్ కట్‌చేశాను.

పెద్దోడు, రాణి, ప్లీడరు వరుసగా ఫోన్ చేశారు. కట్‌చేసి పారేశాను.

ఆకాశం మేఘావృతమయింది. సన్నగా తుంపర్లు మొదలయ్యాయి. ఉన్నట్టుండి వాతావరణంలో ఈ మార్పేమిటో అర్థం కాలేదు. తిన్నగా రాకుమారి వాళ్ళింటికెళ్ళాను.

"మీ కారూ, డ్రైవరూ కావాలి. అర్జం టుగా హైదరాబాద్ వెళ్ళాలి" రాజ్ కుమార్‌తో అన్నాను.

"బంగాళాఖాతంలో అల్పపీడనమట! భారీ వర్షాలు కురవొచ్చని ఇంతక్రితమే టీవీలో చెప్పారు"

"ఆ సరికి జిల్లాయే దాటేస్తాను. మీ డ్రైవర్ని పిలవండి"

"వాడు పెళ్లికని కాకినాడ వెళ్ళాడు"

"మరైతే..? ఓకే! నేనే డ్రైవ్ చేసుకెళ్తాను. తిరిగి రేపే మా డ్రైవర్‌తో కారు పంపేస్తాను"

"మరీ అంత మంకుపట్టేవిటి? రేపెళ్ళొచ్చులే వేణూ!" అంది రాకుమారి.

వినలేదు. కారు తీసుకుని బయల్దేరాను. వేగంగా వాతావరణం మారిపోతోంది. వానా గాలీ హెచ్చాయి. కళ్ళముందు జడ్డి తప్ప వేరేమీ కన్పించట్లేదు. ఏదోటి చెయ్యాలి. మరీ తప్పకపోతే కిరాయి హంతకుల్ని పెట్టి అతడి అడ్డు తొలగించుకోవాలి.

కోర్టు గొడవిప్పుడు పరువు ప్రతిష్ఠల సమస్య కాదు, చావు బతుకుల పరీక్ష!




**క**టిక చీకట్లో కారు దూసుకుపోతోంది. ఎటువెళ్తున్నానో తెలీట్లేదు! ఎంత దూరం వచ్చేనో అదీ తెలీటం లేదు!

సడన్ బ్రేక్ వేశాను. రోడ్డుకు అడ్డంగా ఆగి ఉందో లారీ. రోడ్డు పక్కనే కాలువ ఉంది. లారీ ఓ పక్కకి దిగబడిపోయింది. వర్షం వల్ల మార్జిన్ కన్పించలేదేమో!

దాని పక్క నుంచి వెళ్ళగలిగేంత జాగా లేదు. జాగ్రత్తగా వెళ్తే వెళ్ళిపోవచ్చేమో గానీ, స్లిప్ అయితే ప్రమాదమే!

వర్షం అధికమయ్యింది. గాలి ఉధృతంగా వీస్తోంది. దెయ్యం పట్టినట్టు ఊగిపోతున్నాయి చెట్లు. తుపాను రాబోతోందా? గుండె ఝల్లుమందొక్కసారే! ఉరుములూ మెరుపులూ ఆకాశపు గుండెని చీలుస్తున్నాయి.

కారుని వెనక్కి తిప్పి మరో రోడ్డుకి మళ్ళించాను. ఎటు వెళ్తున్నానో తెలీదు. ఆ మార్గాన వెళ్తే, గమ్యం వస్తుందో? రాదో? అసలే తెలీదు.

అయినా తెగించి పిచ్చిగా దూసుకుపోతున్నాను. పగబట్టినట్టుగా మారిపోతోంది ప్రకృతి.

రోడ్డుమీదే కాదు కనుచూపుమేరలో ఎక్కడా మనిషనే వాడు కన్పించట్లేదు.

కన్ను పొడుచుకున్నా కన్పించని కారుచీకటి. కుండపోతగా కురుస్తోన్న వర్షం.

వాతావరణం చాలా భయంకరంగా ఉంది. భీతిగొల్పుతోంది.

ఇటువంటప్పుడు ప్రయాణించడమంటే నిస్సందేహంగా ప్రకృతికి ఎదురీదటమే! ప్రకృతిని మనిషి ఎదిరించగలడా? ఎప్పటికైనా జయించగలడా?

అదిసరే! ఇప్పుడేమిటి చెయ్యడం? ముందుకెళ్ళడం వ్యర్థం. వెనక్కెళ్ళగలిగే పరిస్థితీ లేదు.

ఎలావోలా తుఫాను తీవ్రత తగ్గే వరకూ తలొంచుకోవడం శ్రేయస్కరం.

రాజ్ కుమార్ హెచ్చరికల్ని పెడచెవిని పెట్టినందుకు పశ్చాత్తాప పడుతూ ఇదేస్థితి ఈ రాత్రంతా కొనసాగితే ఏం చెయ్యడమా? అని ఆలోచిస్తున్నాను.

హఠాత్తుగా ఆకాశం కూలి పడినట్టుగా రోడ్డు పక్కన వున్న కొబ్బరి చెట్టు నా కారు మీద విరుచుకుపడింది. కెవ్వున అరి

చాను. పచ్చడయి ఉంటాననుకొన్నాను.
చెళ్ళున వానజల్లు కొట్టేసరికి వణికి పోతూ చూశాను. వెంట్రుకవాసిలో ప్రమాదం తప్పింది!
కారు అద్దాలు పగిలిపోయాయి. ఇంజను కూడా పాడయ్యే ఉంటుంది! చెట్టు బరువు వల్ల కారు ఓ పక్కకి ఒరిగిపో యింది. మెల్లమెల్లగా తిరగబడిపోతుందే మోనని భయమేసింది.
డోరు తీసి బయటపడ్డాను. గాలి తోపు డుకి ఓ పక్కకి వెళ్ళి పడ్డాను. లేవడానికి చాలా కష్టపడాల్సి వచ్చింది. ప్రాణభీతితో రాళ్ళూ రప్పలూ.. పుట్టలూ పొదలూ అని చూడకుండా అడ్డదిడ్డంగా పరుగుపెట్టాను. రాయి తగిలి "అమ్మా!" అని అరుస్తూ పడి పోయాను.
"నాయనా! జాగ్రత్తరా!"
ఎవరా మాటలన్నది? అమ్మా? ? ? !
అమ్మ ఇక్కడే నాతోనే గాలిలో కలిసి వుందా? నన్ను రక్షిస్తోందా? లేక నా పిలుపుకి పైనుంచి దిగి వచ్చిందా?
"అమ్మా! అమ్మా! క్షమించమ్మా! ఈ పాపాత్ముడ్ని క్షమించమ్మా!"
ఏడ్చేస్తున్నాను. బిగ్గరగా ఏడ్చేస్తున్నాను.
నా కన్నీళ్ళు వాననీటితో కలిసి ధార లుగా, కాలువలుగా రూపాంతరం చెందు తున్నాయి.
చావు భయం వెన్నంటి తరుముతోంది.
ఏదో తెలీని మొండి ధైర్యం వచ్చింది. ఒంట్లోని శక్తినంతా కూడదీసుకున్నాను.
ముందుకి.. ముమ్ముందుకి నడిచాను. అమ్మ నాకోసం అభయముద్ర పట్టిందన్న విశ్వాసంతో వడివడిగా నడిచాను. గెలుపు నాదేనన్న ధీమాతో అడుగులేశాను.
దూరాన మిణుకుమిణుకుమంటూ చిన్న కాంతి రేఖ కన్పించింది! ఎగిరి గంతేశాను.
ఓ గుడిసె ముందాగి తలుపు దబదబా బాదాను. తలుపు తీయడం ఆలస్యం లోప లికి చొరబడ్డాను. గాలీ, వానా కూడా నాతోబాటు లోపలికి చొచ్చుకొచ్చాయి. గుడిసె అతనూ, నేనూ అతికష్టం మీద తలుపు తొక్కిపెట్టి గొళ్ళెం వేసేం.
తలమీంచి కారుతున్న నీళ్ళు ఉప్పగా నోటికి తగుల్తోంటే ఒగురుస్తూ బతుకు జీవుడా అంటూ చూశాను.
ఒక మగమనిషీ, ఒక ఆడమనిషీ, నిద్ర పోతున్న ఇద్దరు పిల్లలూ..!
పెద్దవాళ్ళిద్దరూ గాలికి ఇలాయిబుడ్డి దీపం ఆరిపోకుండా దాని చుట్టూ గొంతు క్కూర్చున్నారు.
"మందేవూరు? " మగతనడిగాడు.
"నిలువునా నీర్రై వణకిపోతా వుంటే ఆ పెశ్నలేంటీ! తడి గుడ్డ లిడిసీ మను" కసు రుకున్నట్టుగా అంది ఇల్లాలు.
చిరుగుల పంచె తెచ్చిస్తూ "ఆ బట్ట లిడి సేసి ఇయి కట్టుకోండి!" అన్నాడు.
మరొక క్షణం వృథా చెయ్యకుండా గబ గబా ఒంటిమీది బట్టలన్నీ విప్పేసి, అతడి చ్చిన పంచెతో తుడుచుకుని, దాన్నే మొలకి చుట్టుకున్నాను.
చలికి వణకిపోతూ గోడకి చేరబడి ముడుచుక్కూర్చున్నాను.
పిల్లలకి కప్పిన కంబళి నా మీదకి లాగిందామె. చిన్నపిల్లాడు ముడుచుకు పోయి వణకసాగాడు.
"కప్పుకో! పెద్దింటి మనిసిలాగున్నావు" అందామె.
కంబళి చాలా పాతది. చిరుగులది. చాలీచాలంది. ముక్కవాసనేస్తోంది. అయి నా అదే పెద్దభాగ్యంగా భావించి కప్పుకు న్నాను. పిల్లాడ్ని చూస్తే జాలేసింది. వాడ్ని ఒళ్ళోకి లాక్కుని కప్పేను.
"తుపాను పట్టింది.." అతడన్నాడు.
"ఏమోనయ్యా! ఇంత గాలీ వోనా పుట్టేక ఎరగను. గుడిసెను వూపేత్తాంది సూడు.." భయంగా కప్పుకేసి చూస్తూ అందామె.
ఇంటి కప్పుకున్న కన్నాల్లోంచి వర్షం

ధారలుగా కారుతూ ఓ పక్కకి ప్రవహి స్తూనే వుంది.

"ఇటెందుకొచ్చినావు? "

జరిగింది టూకీగా వివరించాను.

"ఓలమ్మో! ఎటెల్లబోయి ఎటొచ్చినావూ!" బుగ్గలు నొక్కుకుందామె.

"శానాదూరం ఒచ్చినావు. ఆపైనే వుంది సవ్ముద్రం" అన్నాడతడు.

వెన్ను మీదెవరో చెళ్ళున చరిచినట్టు ఉలి క్కిపడ్డాను. అంటే ఇది పల్లెకారుల గుడిసె! అంతర్వేది వెళ్ళినప్పుడు వీళ్ళని హీనంగా చూశాను. వీళ్ల గుడిసెల్ని పీకిపారెయ్యా లని ఆవేశపడ్డాను. చిత్రంగా వారి గుడిసే నాకిప్పుడు పెద్ద ఆదరువు అయ్యింది! అంతా భగవంతుడి లీల!

"ఇలా ఒచ్చేసి మంచిపన్జేసినారు. ఈ గాలోన్లో రోడ్డు మీదుంటే మనిసే గల్లంతై పోయేవోరు" అంది. ఆ వెంటనే "మాం పేదోళ్ళం. మా గుడిసెలో దుప్పట్లూ మంచాల్వేవు" అని నొచ్చుకుంది,

"ఏం ఫర్లేదమ్మా! కొత్తవాడిని అయినా, అర్ధరాత్రి వచ్చినా ఇంత చోటిచ్చారు. అదే పదివేలు"

"ఇదీ ఓ సాయవేనేటి? ఈ మాత్తరం మనిసన్నోడు ఎవ్వరైనా సేత్తారు"

ఉండి ఉండీ వర్షపు హోరూ, పిడుగుల శబ్దం విన్పిస్తూనే వుంది.

కంబళి పుణ్యమా అని చలి తగ్గి, ఒంటికి వెచ్చదనం వచ్చింది. గోడకి జేరబడి కూర్చుని నిద్రలోకి జారిపోయాను.

మెలకువ వచ్చేసరికి గుడిసెలో కొద్ది పాటి వెలుగు పరుచుకునుంది.

కిటికీలోంచి బయటికి తొంగి చూశాను. గాలి ఉధృతీ తగ్గలేదు.. వర్షపు జోరూ తగ్గలేదు. కనిపిస్తున్నంత మేరా జలమయ మైపోయింది.

"అంతా తుడిసిపెట్టేసినాది. ఇంత గోరం ఎప్పుడూ సూసెరగను..!" మగతన న్నాడు గుండెలు బాదుకుంటూ.

"బెమ్మంగోరు ఎప్పుడో సెప్పేరు. పాపం పెరిగిపోయినప్పుడు జలపెళయం వచ్చి అన్నీ ముంచేత్తదంట! అదొచ్చేసిందో? ఏవోరా? దేవుడా!" విలవిల్లాడిందామె.

పెణం మీంచి పొయ్యిలో పడలేదు కదా? బతికి బయటపడ్డానని సంతోషి స్తున్నా! ఇంకా సముద్రపు టొడ్డుకి చేరి తుఫాను నోట్లో తలపెట్టానా? ఇందు లోంచి బయటపడతానా? లేక..? !

గుండెలు గుభిల్లుమన్నాయి. గజ గజ వణుకుతూ బిక్కుబిక్కుమని వాళ్లవంక చూశాను. వాళ్ళు బెంబేలు పట్టంలేదు. వాళ్ళతో బాటే నేనూనూ! నాకూ ధైర్యం వచ్చింది.

పిల్లలు లేచి ఆకలంటూ గోలపెట్టారు.

"నీయమ్మ! వుండండెహె! బతుకు తామో? సత్తామో? తెలీక మేం బాధపడ తావుంటే, ఆకలని ఏడుత్తారేంట్రా? " కోప్ప డ్డాడా పిల్లల తండ్రి.

"మద్దిన ఆళ్ళేం జేసినారు? ఆళ్ళమీద ఇరుసుకుపడతావేంది? పిల్లగాళ్ళు ఆకలికి తట్టుకోగలరేంటి? బేగే వండి పెట్టే త్తానుండండీ!"

నిజానికి నాకూ చాలా ఆకలిగా ఉంది. ఆకలంటే ఏమిటో? ఆకలి బాధంటే ఏమిటో? ఇప్పుడు మళ్ళీ తెలుస్తోంది!

పిల్లలతో బాటు నాక్కూడా ఇంత అన్నం పెడితే బావుడ్నని ఆశగా చూస్తూ కూర్చున్నాను.

పొయ్యి రాజేసి నీళ్ళకుండ పెట్టింది. డబ్బాలోని బియ్యం చేటలోకి ఒంపింది. ఒక దోసెడుంటాయి. వాటిని ఎసట్లో పోసింది. డీలా పడ్డాను. ఆ అన్నం ఒక రికే చాలదు. ఇక నాకేం పెడుతుంది!

ఇప్పుడెవరైనా వచ్చి 'మనిషికి ఏం కావాలి? ' అని ప్రశ్నిస్తే, తడుముకోకుండా 'అన్నం' అని చెప్పేస్తాను!

పర్సులోని డబ్బంతా ఇచ్చి, అది చాల దంటే మెడలోని గొలుసు కూడా ఇచ్చి ఆ



## నిన్నటి నిజం

# జయస్తంభం

రాజస్థాన్‌లోని బ్రహ్మాండమైన చిత్తూరుఘర్ కోట, ఐదొందల అడుగుల ఎత్తున్న ఒక కొండపై ఉంటుంది. చారిత్రక సంఘటనలతో ముడిపడిన భవనాలు, దేవాలయాలు, గోపురాలు ఇక్కడ ఉన్నాయి. ఇక్కడి అత్యంత విశిష్టమైన కీర్తిస్తంభం 'జయస్తంభం' భారతీయ వాస్తుశాస్త్రానికి అద్వితీయమైన నమూనా. ఈ గోపురం దాదాపు నూట ఇరవై అడుగుల ఎత్తు ఉంటుంది. ఆధారం(పునాది)లో దాదాపు ముప్పై అడుగుల వ్యాసంతో ఉంటుంది. శిఖరాగ్రంలో గుమ్మటం కింద పదిహేడున్నర అడుగుల ఎత్తు ఉంటుంది. దీనిలో 157 మెట్లు, చుట్టూ ఒక గాలరీని నిర్మించారు. ప్రతి అంతస్తులోని ప్రతి ప్రాంగణంలోకి వెళ్లేవిధంగా తొమ్మిది అంతస్తులు వెలుపలి ద్వారాలతో ఉంటాయి. గోపురం పైనుంచి విశాల దృశ్యాల విహంగ వీక్షణం ఓ మధురమైన అనుభూతి. మాళ్వా, గుజరాత్ రాజులపై తన విజయానికి చిహ్నంగా మేవార్‌కు చెందిన కుంభరాణా ఈ ప్రసిద్ధగోపురాన్ని నిర్మించాడు. పదిహేనో శతాబ్దంలో జరిగిన ఈ నిర్మాణాన్ని విష్ణువుకు అంకితంగా చేశాడాయన.

సేకరణ : ఎ. రాంబాబు

అన్నమంతా నాకే పెట్టెయ్యమంటే?

పెడుతుందా? ఆశ పడ్తుందా?

పట్టెడన్నమైనా నాకు పెడుతుందా? లేదా? అని తర్కించుకుంటూ అన్నం కుండ వంకే ఆశగా చూస్తూ గుటకలు మింగుతూ కూర్చున్నాను. మగతనికిదేం పట్టడంలేదు. బయటికి చూస్తూ 'పడవేమయ్యిందో' 'గుడిసె వుంటుందో? ఊడుద్దో?' అంటూ బాధ పడిపోతున్నాడు.

"నోరు కడుక్కురాండి! అంబలి తాగుదురు!" అమృతపు సోనల్లా విన్పించాయా మాటలు. ఆలస్యం చేస్తే ఎక్కడదీ దొరక్కుండా పోతుందోనని గబుక్కున లేచాను.

సత్తు కంచాల్లో, మట్టి దాకల్లో తలో కాస్తా అంబలి పోసి, ఉప్పుకల్లు వేసిచ్చింది. ఊదుకుంటూ ఆబగా తాగాడు.

"నంజుకోవడానికి ఉల్లిరేక ఇయ్యకపోయేవేంటే? " మగతనన్నాడు, నావంక జాలిగా చూస్తూ.

"మా నాయినే! ఉల్లి ఎలాగుంటదో సూసి ఆర్నెల్లయ్యింది! మాయదారికాలం వచ్చి పడినాది!" అంది.

"కడుపునిండా పెట్టినంత తృప్తిగా ఉంది. ప్రాణాలు నిలిపావనుకో! నీ పేరేంటమ్మా? " మనస్ఫూర్తిగా అన్నాను. అక్షరాలా కడుపులోంచి తీసి పెట్టిందా తల్లి!

"కనకమాలచ్చి" ముసిముసిగా నవ్వుతూ జవాబిచ్చింది.

"సేపముక్క కావల్నే" కుర్రాడు రాగం

తీశాడు.

చిన్న చేపముక్కని నిప్పు మీద కాల్చి తెచ్చి వాడికిచ్చింది. నా నోట్లో లాలాజలం ఊరింది.

నా వంక చూసి, "కావాల్నా? సవుద్రం ఇచ్చిన సేపలే! కొన్నవి గాదు. తెత్తా నుండు!" అంది.

చేప ముక్కని ఉఫ్.. ఉఫ్‌మని ఊదు కుంటూ తిన్నాను. చాలా కమ్మగా ఉంది. వాళ్ళకీ నాకూ మధ్య ఏ బంధం? ఏం సంబంధం? ఉందని ఇంత ఆప్యాయత కురిపిస్తున్నారు? ఏమో? నా ఊహకం దటం లేదు!

"ఇయాల గడిసిపోనాది! గాలోన తగ్గా పోతే రేపేం తింటామే? పిల్లలకేం పెడ తావేం? " దిగులుగా అన్నాడతను.

"దేవుడే వున్నాళ్ళెద్దూ! నారోసినోడు నీరె య్యడేంటి? "

ఆమె గుండె నిబ్బరానికి.. రేపటి మీది ఆశకి.. అచ్చెరువొందాను.

పగలు అతి కష్టం మీద గడిచింది. నడి రాత్రి మెలకువ వచ్చింది.

ఆకలి మంట భగ్గున మండుతోంది. ఏదొకటి తినకపోతే భరించలేనన్పించింది. పైగా డయాబెటిక్‌ని. ఏమీ తినకుండా ఉంటే చాలా ప్రమాదం! కానేమీ లేవే!

కన్నీళ్ళు పొంగివచ్చాయి. కాళ్ళూ చేతులూ తిమ్మిర్లెక్కుతున్నాయి. నిలువెల్లా నీరసం ఊపేస్తోంది. మౌనంగా ఏడ్చాను. ఇలాటి దుస్థితిలో చిక్కుకున్నందుకు నన్ను నేను శపించుకున్నాను.

అసలిక్కడ్నుంచి ప్రాణాల్తో బయటపడ తానా? లేక.. ఇక్కడే జల సమాధి..!

దుఃఖపు తుఫానులో చిక్కుకుని అల్లల్లా డుతూ మౌనంగా విలపిస్తూండిపోయాను.

అతి కష్టం మీద తెల్లవారింది. పిల్లలు ఆకలికి ఆరున్నొక్కరాగం ఎత్తుకున్నారు.

"ఎలాగ మావా? " దిగులుగా అంది కన కమాలచ్చి.

"దీనెమ్మ తుపాను ఎక్కడా తగ్గనేదు సూడు!" కోపంతో మండసాగాడతడు.

"బయటికెల్లి ఆకో.. అలమో.. తెత్తే..!"

"ఒంటేలుకని బయటికి అడుగేత్తేనే ఈడ్సికొడతాంది. ఇంకెక్కడి కెల్లగలవే. ఈ గాలోనలో ఎల్లినోడెవడూ తిరిగిరాడు"

"అంత మాటనకు మావా! ఏదోటి సూత్తాలే!"

పిల్లలగోల ఎక్కువయ్యేసరికి ఇంట్లో వున్న ఎండుచేప ముక్కలన్నీ కాల్చి వాటి పైన ఉప్పూ కారం అద్ది ఇచ్చింది. వారి మీద పడి తోసేసి అవి లాక్కుని తినెయ్యా లన్న కోరికని అదిమిపట్టాను. నీరసంగా, నిస్సహాయంగా చూశాను. మాకేం మిగ ల్లేదు. నాలికతో పెదాలు తడుపుకున్నాను.

"నా దగ్గర డబ్బుంది. ఎక్కడైనా బియ్యం దొరుకుతాయేమో..? " కాస్సేప య్యాక అన్నాను.

నవ్విందామె! అతడూ నవ్వేడు! నన్నో పిచ్చోళ్ళా చూసి ఇద్దరూ నవ్వేరు.

ఉక్రోషం తన్నుకు రాగా ముడుచుకుని పడుకున్నాను.

ఎలావోలా ఆకలి తీరితే బావుణ్ణు! ఈ తుఫాను నుంచి ప్రాణాలతో బయటపడగ లిగితే బావుణ్ణు!

జనం ఉసురు నన్నిప్పుడు వుసూరు మన్పిస్తోంది! చేసిన పాపాలకి గాను నర కంలో శిక్షలనుభవిస్తారంటారు! కానీ నేను

## కొత్తగాలి...

**శాస్త్ర సాంకేతిక వెలుగుకు**
**జీవితం మొత్తం కరిగించి**
**భరతమాత నుదుటిపై**
**స్ఫూర్తి సంతకం చేసిన**
**కలాం! సలాం!!**

*– చింతలపూడి శివశంకర్‌రెడ్డి, శ్రీశైలం*

ఇక్కడే, చావకుండానే 'నరకయాతన' అను భవిస్తున్నాను! ఏ దేవుడైనా నా మొర ఆల కించి రక్షిస్తే ఎంత బావుణ్ణు!

అర్ధరాత్రి వేళ ఎవరో కుదుపుతోంటే తత్తరపడి లేచాను.

"లేవండి! లేవండి..!!"

"ఏంటీ? ఏవయ్యింది..? " గుండెల్జారి పోతోంటే అడిగాను.

"గుడిసె కూలిపోతాంది! రాండి! రాండి..!!"

అప్పటికే చెరో బిడ్డనీ భుజాన వేసుకు న్నారు వాళ్ళు.

నిద్దట్లో లేచానేమో చాలా గాబరాగా, అయోమయంగా అన్పించింది. గుబుక్కున నా బట్టల్ని దొరకబుచ్చుకుని వాళ్ళకన్నా ముందే, సంధించి వదలిన బాణంలా బయటికి పరుగెత్తాను.

క్షణాల్లో తడిసిపోవడం, నేను మట్టిలో కూరుకుపోయి తూలిపడటం గబగబా జరి గిపోయాయి.

"అయ్యయ్యో! లేవండి..!" చేయి అందిం చాడతను.

లేచాను. శివాలెత్తినట్టు వీస్తోంది గాలి. రాళ్ళతో కొడుతున్నట్లుగా కురుస్తోంది వాన. సముద్రపు హోరుకు చెవులు దిబ్బ ళ్ళయ్యాయి.

బతుకు భయంతో పరుగెత్తబోయాను.

"అటు కాదండి ఇటు.. ఇటు..! ఆపైన మిద్దిల్లు వుంది ఇట్రాండి..!"

ఒకరి చేయి ఒకరం అసరాగా పట్టు కున్నాం. తోసేస్తున్న గాలినీ ముంచె త్తుతోన్న వర్షాన్నీ ఎదుర్కొంటూ, పడు తూ.. లేస్తూ.. ఉరుములకి బెదుర్తూ.. మెరుపు కాంతే దిక్సూచిగా.. వడివడిగా తడబడుతూనే అడుగులేశాం. గాలిలో పెట్టిన దీపాల్లా ఉన్నాం!

ఎట్టకేలకు ఓ డాబా ఇంటికి చేరి 'హమ్మయ్య!' అనుకున్నాం.

అప్పటికే అక్కడ యాభై అరవైమంది చేరారు. ఎక్కడా జాగాలేదు. అయినా అలాగే సర్దుకుని నిలబడ్డాం.

పిల్లల ఏడుపులు, ముసలోళ్ళ కేకలు, ప్రార్థనలు, తిట్లు..!

నీరసంగా నిలబడ్డాను. కడుపులో పేగు లు మెలిపెడుతున్నాయి. నిలబడే శక్తి లేదు. ఎలావోలా ప్రాణం నిలిస్తే చాలు!

ఎక్కడ్నుంచి ఎక్కడి కొచ్చిపడ్డాను! ఆకాశం నుంచి పాతాళంలోకి..!

ఆకలికి మాడతాననీ, చలికి వణుకుతా ననీ, నిలబడే శక్తి లేక, నిస్సహాయంగా అలమటిస్తాననీ కొద్దిరోజుల క్రితం ఎవ రైనా జోస్యం చెప్పివుంటే, ససేమిరా నమ్మే వాడ్ని కాదు! ఎదురు అతడ్నే ఆటపట్టించే వాడ్ని! అతడ్నో పిచ్చివాడిగా జమకట్టేవా డ్నేమో కూడా!

రేపటికీ పరిస్థితి ఇలాగే వుంటే బహుశా నేను కట్టెలా బిగుసుకుపోవచ్చు! శవమై మిగలవచ్చు! అప్పుడు నాతో ఏం పట్టుకు పోతాను? !

స్వామీజీ అన్నట్టు వచ్చేప్పుడు వచ్చినట్టే, వెళ్ళేప్పుడూ ఒట్టి చేతుల్తోనే వెళ్తాను. ఈ భూమ్మీదకి రావడం ఎందుకో తెలిస్తే, పోవడం ఎందుకో కూడా తెలుస్తుందిట! నాలాంటి వాడికి చచ్చినా తెలీదు. తెలిసే టప్పటికి ఇంత దాకా అలంకరణ చేస్తూ, పోషిస్తూ వచ్చిన ఈ శరీరాన్నీ కూడా ఇక్కడే వదిలేసి వెళ్ళిపోతాం.

## కొత్తగాలి...

**లోకం**
**కోడై కూస్తే**
**కోడి**
**ఇల్లెక్కి కూస్తుంది**

– సాధనాల నాగవర్ధిని,
నూజివీడు

ఎవరు వెళ్తారు? నేనే! నేనే అంటే? ఆత్మ! అదొక్కటే సత్యమూ.. నిత్యమూ అంటారు. అదేమో తెలీదు.

నేను మాత్రం పంచభూతాల్లో కలిసిపోతాను. నేననేవాడ్నే ఉండను. మిగతా జనమూ, ప్రపంచమూ అలాగే ఉంటుంది!

అంతేకాదు నేను చేసిన కార్యాల మంచీ చెడూ ఇక్కడే ఉండిపోతాయి. వాటి వాటి ఫలాల్ని ఇక్కడివారే అనుభవిస్తారు.

కొందరు అభినందిస్తారు! మరికొందరు అభిశంసిస్తారు!

నా ఆస్తిపాస్తులు పంచుకున్న నా వాళ్ళు నన్ను దేవుడని మెచ్చుకుంటారో? లేదో? గానీ, నా వంచనకి గురైన వాళ్ళంతా ముక్తకంఠంతో రాక్షసాధముడని శపించడం మాత్రం ఖాయం!

ఇందుకేనా పుట్టింది? ఇలాంటి శాపాల కోసమేనా బతికింది?

నేనే మారాలి! ఏదో తాత్కాలిక ఆవేశానికి లోనై ఊహల్లో మారడం కాదు. మూర్తి అన్నట్టు మార్పు ఆచరణలో చూపించాలి.

మనసా వాచా కర్మణా మారాలి. నా జన్మసార్థకం చేసుకోవాలి.

ఇంకెంత మాత్రం తాత్సారం చెయ్యకూడదు. వెన్వెంటనే మా ఫైనాన్స్ కంపెనీలో డబ్బు దాచుకున్న వాళ్లందరికీ ఎలాగైనా సరే, న్యాయం చెయ్యాలి. ఆస్తులు తెగ నమ్మి అయినాసరే వాళ్ల సొమ్ము వాళ్లకి దక్కేలా కృషిచెయ్యాలి. పాపాన్ని కొంత వరకూనైనా ప్రక్షాళన చేసుకోవాలి!

'భగవాన్! నన్ను క్షమించు. నా గతాన్ని క్షమించు. నాకొక్క అవకాశం ఇవ్వు. నన్ను బతికించు. పరిశుద్ధుడ్నయ్యే మహత్తర అవకాశం కల్పించు. కన్నతల్లి మీదా.. అన్నం పెట్టిన గోదావరి మీదా ప్రమాణం చేసి చెబుతున్నాను. నేను మారాను. ఈ క్షణం నుంచి నేను కొత్త మనిషిని. నాకు ఒక్క అవకాశం ఒకేఒక్క అవకాశం ఇవ్వు తండ్రీ! ఇంతకంటే నేనేమీ కోరను స్వామీ..!'

ముక్కోటి దేవతలూ నా ప్రార్థన విన్నారో? ఏమో? తెల్లవారుఝామున గాలి వేగం తగ్గింది. వర్షమూ తగ్గుముఖం పట్టింది. పరహితార్థం పనిచేస్తే దేవుడు కూడా చేయి అందిస్తాడు! తల్లిలా చేయిపట్టుకుని నడిపిస్తాడు!

ఆనందోత్సాహాలతో ఊగిపోయాను.

"తుపాను శాంతించినట్టే" గట్టిగా ఎవరో అరిచారు.

హాయిగా ఊపిరి పీల్చుకున్నాం. వెర్రి సంబరంతో ఒకరి వంకొకరం చూసుకున్నాం. 'హమ్మయ్య' అని నిట్టూర్చాం.

తెల్లవారింది. తూర్పున వెలుగురేకలు విచ్చుకున్నాయి.

మునెన్నన్నడూ చూడనంత రమ్యంగా కన్పించింది సూర్యోదయం. కర్మసాక్షికి నమస్కరించాను.

తమ తమ ఇళ్ళూ, గొడ్డూగోదా, తోటా పొలమూ గుర్తుకురాగా పరుగులు తీశారు కొందరు. వద్దని వారిస్తూ అరవసాగారు ఆడవాళ్ళు.

ఒకప్పటి పచ్చగా కళకళలాడే కోనసీమ పిచ్చివాడు గీసిన విధ్వంస దృశ్యంలా మారిపోయింది!

తోటలన్నీ సమూలంగా నాశనమయ్యాయి. కొబ్బరి చెట్లు తలలు రాలి

## కొత్తగాలి...

**దేవతలకూ**
**అస్త్రాలు చేసేస్తాడేమో!**
**దివికెళ్లాడు**
**కలాం!**

– వి.యం. కృష్ణ,
ఇ.సి.ఐ.ఎల్. హైదరాబాద్

అ
క్ష
రం

అదుపు లేని
ఆలోచనలు
శత్రువు కన్నా
ప్రమాదకరం!

– బుద్ధుడు



పడగా, మోడుగా.. మొండిగా.. నిలిచాయి. కోతకొచ్చిన చేలు జలమయమయ్యాయి. కోసిన వరిచేల పనలు నీటి మీద తేల్తూ కొట్టుకుపోతున్నాయి. చెట్లూ.. కోళ్ళూ.. పశువులూ.. మంచాలూ.. సామాన్లూ నీటిమీద తేలుతున్నాయి. ఇళ్ళూ.. గుడిసెలూ.. నేలమట్టమయ్యాయి. పెద్ద ఇళ్ళు సైతం కూలిపోయాయి!

ఎటుచూసినా గుండెల్ని పిండేసే హృదయవిదారక దృశ్యాలే!

రైతులూ, వ్యవసాయ కూలీలూ, చేతి వృత్తులవాళ్లూ, జాలర్లూ, చిన్నా పెద్దా అనే తారతమ్యం లేకుండా ప్రతి ఒక్కరినీ ప్రకృతి చావు దెబ్బ తీసింది!

ఇంతలో మరోపక్క ఆడవాళ్ళ రోదనలు ఒక్కసారిగా మిన్నంటాయి

పల్లెవాడని ఉప్పెన ముంచెత్తిందిట! చెట్లు, తుప్పల మధ్య జాలర్ల శవాలు చిక్కుకుపోయి ఉన్నాయిట!

కన్నీళ్ళు ఉబికి వచ్చాయి!

కనకమాలచ్చి ఆశ్రయం ఇవ్వకపోయి వుంటే, అంబలి పోసి ప్రాణం నిలబెట్టక పోయి వుంటే, ఆ గుడిసెలోంచి నన్ను వాళ్ళు బయటపడెయ్యక పోయి వుంటే, నా శవం కూడా వాటితో జతయ్యేది!

ఎన్ని జన్మలెత్తి, ఎంత సేవచేస్తే మాత్రం ఆ 'తల్లి' రుణం తీరుతుంది?

కన్నీళ్ళు ధారలుగా కారిపోసాగాయి.

గుండెల్ని పిండేస్తున్న విధ్వంసాన్ని దాటుకుంటూ కళింగ యుద్ధ కళేబరాల్లోంచి నడిచిన అశోకుడిలా నడుస్తున్నాను.

వైతరిణీ నదిని దాటుతున్నట్టుగా ఉంది.

బతుకు పొడుగునా చేసిన తప్పులూ, పాపాలూ కళ్ళ ముందు దృశ్యరూపం దాలుస్తున్నాయి.

దాదాపు మృత్యువు అంచుదాకా వెళ్ళేక గానీ నాకు తత్వం బోధపళ్ళేదు. అశాశ్వతమైన ఆస్తులు కోసం చక్కని జీవిత ఫలాన్ని చేదు చేసుకున్నాను. నా కోసం చెమ్మగిల్లు నయనమ్ము లేకుండా పోయిందంటే ఇదంతా స్వయం కృతాపరాధమే!

అప్పుడెప్పుడో చిన్నప్పుడు మా ఊరి లైబ్రరీలో చదివిన టాల్‌స్టాయ్ కథ గుర్తొచ్చింది నాకు!

ఒక రాజు ఒక రైతుతో సూర్యాస్తమయం లోపల నువ్వెంత దూరం చుట్టి వస్తే అంత భూమి అతడికిచ్చేస్తానంటాడు. అతడు అత్యాశకు పోతాడు. ఇంకా ఎక్కువ.. ఇంకా ఇంకా.. భూమి కావాలని సాయంత్రం దాకా పరుగుపెట్టి పెట్టి అలసిపోతాడు. శక్తి హరించుకుపోతుంది. కానీ గడువు లోపల గమ్యస్థానం చేరాలి. అప్పుడే ఆ భూమి తన సొంతమవుతుంది. లేని సత్తువ తెచ్చుకుని పరుగుపెడతాడు. ఆత్రంగా, ఆరాటంగా, తూలుతూ పడుతూ లేస్తూ కడకెలాగైతేనేం గమ్యం చేరి కూలబడి ప్రాణాలు విడుస్తాడు.

ఎంతో భూమి అతడికి దక్కినా సరే, ఆఖరికి అతడిక్కావాల్సొచ్చింది ఆరడుగుల నేల మాత్రమే!

నేనే నా వాళ్లు.. నా డబ్బు.. నా లాభాలు.. నా ఆస్తులు.. అంటూ పరుగులు పెట్టాను. 'నా' చుట్టూ శ్లేష్మంలో పడ్డ ఈగలా కొట్టుకున్నాను. టాల్‌స్టాయ్

కథలోలా ఇంకా.. ఇంకా.. నొల్లేసుకోవా లని ఆశపడ్డాను. అందుకోసం ఎంతగానో దిగజారాను.

ఎన్నోరకాల ఎత్తులు జిత్తులు, లంచాలు, పైరవీలు, ఫోర్జరీలు, బెదిరింపులు, బ్లాక్‌మెయిళ్ళు, అసంపూర్తి అపార్ట్‌మెంట్లు, మాయ స్కీములు ప్రైజుల వలలు- ఎన్నో చేశాను. చేయించాను.

కడకేం మిగలబోతోంది? ఏం పట్టుకు పోబోతున్నాను?

గోదావరి నది ఎక్కడో అతిసాధారణ మైన కొండచరియల్లో పుట్టింది. సన్నగా ప్రవహించి ఎత్తులున్న చోట పక్కకి తొలగి బలం పుంజుకుంటూ దారి పొడవునా సస్యశ్యామలం చేస్తోంది. భూమినీ మనుషుల్నీ పునీతం చేస్తూ జీవనదియై ప్రవహిస్తోంది!

సాగర సంగమానికి సంతోషంగా వెళ్ళబోతోంటే అడ్డుగా ఆనకట్ట కట్టిన మనిషిని చిరునవ్వుతో క్షమించింది తల్లిగోదావరి. పాయలుగా కాలువలుగా చీలి ఎందరెందరికో ప్రాణధారనందిస్తూ సౌభాగ్యదాతగా వర్ధిల్లుతోంది. తన గలగలలద్వారా జీవితాలకి స్ఫూర్తినిచ్చే వేదఘోష వినిపిస్తోంది!

నరుడి బతుక్కూడా అలాగే సాగాలి. అడుగిడిన ప్రతిచోటా బతుకు పొడవునా మంచినీ మమతనీ పంచుతూ సత్కర్మల విత్తులు నాటుతూ అందరి క్షేమం కోరుతూ సాగిపోవాలి. గుప్పెడు బూడిదై పంచభూతాల్లో కలిసిపోయినా జనం గుండెల్లో శాశ్వతంగా నిలిచిపోవాలి!

అలా కొందరే వుండగలరు. వాళ్ళే మహాత్ములు. మూర్తీ, శ్రీరాములుగారు లాంటి వాళ్లంతా ఆ కోవలోకే వస్తారు. వాళ్ళ సంఖ్య అత్యల్పం. అందుకే ప్రపంచం ఇలా అయినా వుంది!

నాలాటి వాళ్ళు అడుగడుగునా వున్నారు. గజానికో గాంధారి కొడుకు నా దేశంలో- అన్నాడో కవి. గాంధారి కొడుకులే కాదు పురాణాల్లో కన్పించని అసురులు కూడా వున్నారు. ప్రతి అంగుళంలోనూ వున్నారు!

ప్రపంచం పచ్చగా ఉండాలంటే, నందన వనంలా విరియాలంటే నరుడు అసురుడుగా మారకూడదు! స్వార్థం తగ్గించుకొని పరోపకార భావన పెంచుకోవాలి!

గోదావరి అలల్లా నాలో ఎన్నెన్నో భావ తరంగాలు- వేదాంతపు భావనలు లేచి పడుతున్నాయి! పడి లేస్తున్నాయి!

నా అంతరంగాన్నెవరో కవ్వంతో చిలుకుతున్నట్టుంది! మెల్లగా మానవత్వం పోగవుతూ ఓ 'మహాసంకల్పం'గా రూపుదిద్దుకో సాగింది!

నా కోసం నన్ను వెదుక్కుంటూ ఎదురొచ్చాడు మూర్తి. నా చిన్ననాటి నేస్తం!

ఎదురొచ్చి ఆప్యాయంగా కౌగలించుకున్నాడు. స్నేహ పరిష్వంగంలోని మాధుర్యం నన్ను మైమరపించింది.

"నేను మారినట్టుగా కన్పిస్తున్నానా? "

తేరిపారి చూశాడు. "కొత్త మనిషిలా ఉన్నావు. కొలిమిలో కాలిన బంగారంలా ఉన్నావు"

"మనిషే బంగారం అని తెలిసొచ్చిందిరా! బుద్ధుడికి బోధివృక్షం కింద జ్ఞానోదయమైంది. నాకు కోనసీమలో తుఫాను రాత్రి అయ్యింది!" మందహాసం చేశాను.

ఒక అద్భుతాన్ని చూసినట్టు చూశాడు

## కొత్తగాలి...

**నేలమీంచి నింగిలోకి**
**ఎన్నో రాకెట్లు పంపావు**
**వాటిని చూడాలని వెళ్లావా?**
**చూసి వచ్చెయ్యి? మళ్లీ పుట్టు!**

– తటవర్తి రామకృష్ణ,
తాళ్లగడ్డ, హైదరాబాద్

మూర్తి. "నీ చిరునవ్వు ఎంత ఆహ్లాదంగా ఉంది!"

"మనస్సు పొరల్లోంచి వచ్చింది. క్షీర కాదు క్షార సాగర మథనంలోంచి ఉద్భవించింది"

"తలో పక్కకీ వెళ్ళి నీ కోసం గాలిస్తున్నారు. రోడ్డు పక్కన తెల్లకారు తిరగబడి వుందని రాత్రెవరో చెబితే ఇటువచ్చి చూశాను"

"చిన్నప్పుడు మనం కురుక్షేత్రం నాటకం ఎన్నోసార్లు చూశాం. పాండవులకూ కౌరవులకూ మధ్యన జరిగింది. మంచికీ చెడుకీ.. ధర్మానికీ అధర్మానికీ.. అర్హతకీ అత్యాశకీ.. నీతికీ అవినీతికీ మధ్య జరిగింది. మన శరీరమూ ఒక కురుక్షేత్రమే. మన బతుకు ఇంకో కురుక్షేత్రం. మనలోనే కాదు మన చుట్టూ కూడా మంచీ చెడూ ఉన్నాయి. ఎక్కడైనా సరే ఆ రెంటి మధ్యా యుద్ధం తప్పదు. అందులో మంచి గెలవాలి. నీతి గెలవాలి. ధర్మం గెలవాలి. అప్పుడే మనిషి మనిషిలా బట్టకడతాడు. లేకపోతే కౌరవ సమూహంలా సపరివారంగా నాశనమైపోతారు. పిల్లాజెల్లా, గోడ్డూగోదాతో సహా సర్వనాశనమైపోతారు. నామరూపాల్లేకుండా పోతారు!"

"గొప్ప జీవన సూత్రం!"

"నా మనస్సుని కప్పిన మాయపొరలన్నీ ఫట్ ఫట్ మని తెగిపోతున్నాయిరా!"

నా భుజం మీద చెయ్యేసి నడుస్తున్నవాడల్లా ఆగి, నన్ను తనవైపుకి తిప్పుకుంటూ అన్నాడు మూర్తి "ఇది శ్మశాన వైరాగ్యం కాదుకదా? "

"కానే కాదు. చిన్నతనంలో సుడిగుండం లోంచి బయటపడ్డాను. ఇప్పుడు తుపాను గండంలోంచీ బయటపడ్డాను. ఇక బతుకు గండంలోంచీ బయటపడతాను చూడు!"

"పరమానందంగా ఉందిరా వేణూ! ఇప్పుడు మీ అమ్మ బతికి ఉంటే, నిన్ను చూసి, నీకు జన్మనిచ్చినందుకు తన జన్మ సార్థకమయ్యిందని పొంగిపోయేదిరా!"

అమ్మ నవ్వు, చూపు, మాట అన్నీ గుర్తొచ్చాయి. అమ్మ భావన, అమ్మ పేగు, అమ్మ ప్రేమ, అమ్మభాష ఎంత గొప్పవి!

మౌనంగా నడుస్తూ అన్నాడు "ఈ తుఫాను దెబ్బ నుంచి కోనసీమ ఎప్పటికి కోలుకుంటుందో!"

"ఇక్కడ సారవంతమైన భూమి వుంది. గోదావరి నీళ్ళున్నాయి. శ్రమించగల మానవ వనరులున్నాయి. మళ్ళీ కోనసీమ రెపరెపలాడుతూ ఎదగడానికి ఎక్కువ కాలం పట్టదురా!"

"నీ ఆశాభావం చూస్తోంటే నాకు ఆశ్చర్యమేస్తోందిరా! మనిషి మీద నీకెంత నమ్మకంరా!"

### కొత్తగాలి...

**యుద్ధం - శాంతి**
**అక్కాచెల్లెళ్ళు!**
**రాజకీయం - దౌత్యం**
**బావ మరదళ్ళు!!**

**– అమ్జద్,**
సరూర్‌నగర్, హైదరాబాద్

"మానవుడే మహనీయుడు అన్నాడు ఆరుద్ర. అదిగో నువ్వు తీసుకెళ్ళిన రాకుమారీవాళ్ళ కారు. ఎలా అయిపోయిందో చూడు? "

రోడ్డు పక్కన తిరగబడిపోయివుంది. రెండు కొబ్బరి చెట్లు దానిమీద పడివున్నాయి. కారు రూపురేఖలు తెలీనంతగా డామేజయ్యింది. గుండెలు గుభిల్లుమన్నాయి. చొరవగా కార్లోంచి బయటపడ్డాను గనుక బతికిపోయాను గానీ లేకపోతే? ! ఇంతే సంగతులు!

"నువ్వు చాలా అదృష్టవంతుడివిరా! పెను విపత్తునుంచి తప్పించుకున్నావు"

"అవున్నిజమేరా మూర్తీ! దేవదాసు నవల ముగింపులో దేవదాసు శవాన్నె వరూ గుర్తించరు. ఆ దిక్కులేని శవం గురించి చెబుతూ అలాటి చావు ఎవరికీ రాకుడదని వ్యాఖ్యానిస్తాడు శరత్‌బాబు. తుఫాను పాలబడ్డ నేను అలాటి దిక్కులేని చావు ఛస్తానేమోనని భయపడ్డాను. కన్పిం చని మహాశక్తి ఏదో నన్ను రక్షించింది. నా వల్ల ఏదో కార్యం.. ఏదో పరమార్థం నెరవేరాల్సి ఉంది. అందుకే భూమ్మీద నాకు గుప్పెడు నూకలు మిగిల్చింది!"

శివుడి కోపాగ్నికి ధ్వంసమైన దక్షయజ్ఞ మండపంలా ఉన్న మా ఊరిని చూసి కళ్ళనీళ్ళ పర్యంతమయ్యాను.

దురదృష్టం నన్ను వెన్నంటి వచ్చి మా ఊరిని కాటేసిందా? అన్పించిందొక్కక్షణం.

లేకపోతే దాదాపు నలభై ఏళ్ళ తర్వాత నేను మా ఊళ్ళో అడుగుపెట్టిన కొద్దిరో జులకే ఇలా తుపానొచ్చి కోనసీమని కన్నీటిసీమ చేసెయ్యడమేంటి?

అక్కడ నా వ్యాపారాలు.. ఇక్కడ నేనూ తుపానులో చిక్కుకున్నాను!

ఇక్కడ ఈ తుపాను శాంతించింది. ఇక ఆ తుపానుని చల్లార్చాలి!

మూర్తి ఇంటి ముందు ఓ శిబిరమే ఏర్పాటయ్యింది. ఎందరో వచ్చిచేరారు. అతడిల్లు ఎందరికో ఆశ్రయమిచ్చిందని అర్థమైంది.

నన్ను ఇంట్లో కెళ్ళమని చెప్పి "వైద్య బృందం ఏమైనా వచ్చిందా?" అంటూ జనంలోకెళ్ళిపోయాడు మూర్తి.

నన్ను చూసి పరుగున వచ్చారు శ్రీరా ములుగారు.

"ఎలావున్నారు వేణుగారూ? ఆయ్! మీరేమైపోయారోనని ఒకటే ఆందోళన పడుతున్నాం మేం. మళ్ళీ మిమ్మల్ని చూస్తానో? లేదో? అని మేమెంతో భయ పడ్డానంటే నమ్మండి!"

చటుక్కున వంగి ఆయనకు పాదాభివం దనం చేశాను.

"మీ అబ్బాయి ధనేష్ వచ్చాడు బాబాయ్! మా అత్తవాళ్ళింట్లో ఉన్నాడు" గౌతమి చెప్పింది.

★ ★ ★

ధనేష్ నన్ను చూసి నిర్ఘాంతబోయాడు. అపనమ్మకంగా చూశాడు.

ప్రపంచంలోని ఆశ్చర్యమంతా వాడి ముఖంలోనే తిష్ఠవేసింది.

తుపాన్లో చిక్కుకుని ఏమైపోయాడో తెలీని తండ్రి.. క్షేమంగా తిరిగి రావడం చూసి, ఎగిరి గంతేసి, ఎదురొచ్చి కావలిం చుకోవాల్సిన కొడుకు..!

"మైగాడ్! మీరు బతికున్నారా? చచ్చేం!"

ఒక్కుమ్మడిగా అగ్గిపిడుగుల వాన నా మీద కురిసినట్లనిపించింది! నిలబడే శక్తి లేక కుర్చీలో కూలబడి పిచ్చిగా చూశాను.

"నా కళ్ళని నమ్మలేపోతున్నాను. మీరు బతికే వున్నారా!" తలపట్టుకున్నాడు.

"బతికి వుండననుకున్నావా? వుండ కూడదనుకున్నావా? "

"ఎనీహౌ! యూ ఆర్ డెడ్- మీరు లేరనే అనుకున్నాను! తుఫానుకి ఎదురెళ్ళావ న్నారు. నాలుగు రోజులైనా తిరిగి రాలే దనీ, అతీగతీ తెలీలేదన్నారు. మీరు వేసు కెళ్ళిన కారు దారుణంగా డామేజ్ అయ్యిం దని రాత్రి చెప్పేరు. సో- ఇటీజ్ బట్ నేచురల్! మీరు చనిపోయారనే అనుకు న్నాను. మన సమస్యలన్నీ మంత్రించినట్టు మాయమవుతాయనుకున్నాను. ఆ వార్తని కన్ఫర్మ్ చేసుకుని వెళ్ళిపోదామని వెయిట్ చేస్తున్నాను. మీరు బతికొచ్చేశారు. బుల్ షిట్! ప్లానంతా తిరగబడింది!" గదిలో ప్ర చార్లు చేస్తూ, చేతులూ తలా తిప్పుతూ, విసుగ్గా, అసహనంగా కోపంగా అన్నాడు.

"అసల్నువ్వెందుకొచ్చావు? " వాడి రాక వెనుక భయంకరమైన కుట్ర ఏదో ఉందని అనుమానిస్తూ అడిగాను.

"బిజినెస్ గురించి మాట్లాడదామనీ..

ఇది 'షో' చెప్పాల్సిన టైము!"

"నాతో డీల్?!" సంభ్రమంగా ప్రశ్నించాను.

"యస్ డాడ్! దురదృష్టం తలుపు తీసే వరకూ తడుతూనేవుంటుంది గానీ, అదృష్టం ఒక్కసారే తలుపు తడుతుంది. అప్పుడు తలుపు తీసినవాడే లక్కీ ఫెలో! ఇప్పుడలాటి అదృష్టం, అవకాశం మాకు కలిసొచ్చాయి. ఉయ్ వాంట్ టు కేష్ ఇట్!"

"నీ ఉద్దేశం ఏవిటో సూటిగా చెప్పు"



"మీరు ఫాలో అవుతున్నారో లేక నటి స్తున్నారో తెలీదుగానీ, మన బిజినెస్ కొలాప్స్ అయ్యే స్థితిలో వుంది. మన ఫైనాన్స్ కంపెనీ తాలూకు బ్రాంచిలన్నీ మూతపడ్డాయి. కొన్నిటి మీద డిపాజిటర్లు దాడి చేసి ఫర్నిచర్‌ని ధ్వంసం చేసి, దొరి కింది పట్టుకుపోయారు. అవి మీకు తెలి సిన పాత వార్తలు. కోర్టు ఉత్తర్వు మేరకు కంపెనీ ప్రధాన కార్యాలయానికి పోలీ సులు సీలు వేశారు. కంపెనీకి సంబంధిం చిన ఆస్తుల్ని స్వాధీనం చేసుకున్నారు. మిమ్మల్ని తక్షణం అరెస్టు చేసి తీసుకుర మ్మని ఉత్తర్వులిచ్చారు"

"తెలిసింది! మిగతాది ఊహించగ లను..!"

"మీరు వూహించనివీ, మీ వూహకి అందనివీ చాలా జరిగిపోయాయి డాడ్! ఫైనాన్స్ కంపెనీ ప్రభావం పడినందున చిట్‌ఫండ్ వ్యాపారం చతికిల బడింది. హౌసింగ్ కంపెనీ కార్యాకలాపాల మీద ఆరోపణలు వెల్లువెత్తడంతో సీఐడీ దర్యాప్తు కాదేశించింది కోర్టు. ముఖ్యంగా న్యూ సిటీ సైట్ కొనుగోలు గురించీ, మధ్యలో ఆగిన అపార్ట్‌మెంట్లు నిర్మాణం గురించీ లెక్కలేనన్ని కంప్లయింట్లూ.. పిటీ షన్లూ దాఖలయ్యాయి"

గుండె లవిసిపోతోంటే గుడ్లప్పగించి చూస్తూ నిర్వికారంగా వింటున్నాను.

"వీటన్నింటి కంటే షాకింగ్‌న్యూస్! అన్న య్యనీ, మరికొందరు ఫైనాన్స్ కంపెనీ డైరెక్టర్లనీ పోలీసులు అరెస్టుచేశారు. మీ కోసం తీవ్రంగా గాలిస్తున్నారు. ఏ క్షణం లోనైనా అరెస్టు చెయ్యొచ్చు!"

"నేను రెడీ! చెయ్యాలో? ఎలా ఏం చె య్యాలో? ఒక నిర్ణయానికొచ్చేశాను" తొట్రుబాటూ లేకుండా చెప్పాను.

"ముందుగా మా నిర్ణయమేంటో తెలు సుకోండి..!"

కోపాన్ని నిగ్రహించుకోవడానికి సతమత మవుతూ, అసహనంగా చూశాను.

"మన కుటుంబసభ్యులూ, వ్యాపార భాగస్తులూ, ప్లీడర్లూ, ఆడిటర్లూ, శ్రేయోభి లాషులూ అంతా కలిసి సమావేశ మయ్యాం! అన్ని విషయాలూ కూలం కషంగా చర్చించాం. ఆస్తుల్ని అమ్మి డిపా జిటర్ల సొమ్ము చెల్లించడానికెవరూ అంగీక రించ లేదు. మళ్ళీ అన్ని ఆస్తుల్ని సంపా దించడం అసంభవం. అలాగని ఐపీ పెట్టినా పెద్దగా ప్రయోజనం వుండదు. మీకు మతిస్థిమితం తప్పిందనీ, ఎటో వెళ్ళి పోయారనీ ప్రకటించాం. దానికి పాజిటివ్ రెస్పాన్స్ వచ్చింది. ఒత్తిడీ తగ్గింది. సాను భూతి పెరిగింది"

"నన్ను గినీపిగ్‌ని చెయ్యాలనుకున్నార న్నమాట!"

"మీ మెదడు పాదరసం డాడ్! మీ దగ్గర గొప్ప బిజినెస్ టాక్టీసులున్నాయి!"

"చెత్త కబుర్లొద్దు! సోకాల్డ్ మీ నిర్ణయ మేంటో అది చెప్పు!"

"జీవితం ఒక పోరాటం! స్ట్రగుల్ ఫర్ ఎగ్జిస్టెన్స్! బతకాలంటే పోరాడక తప్పదు. పోరాటంలో లొంగిపోవడాలూ, వెనక్కి తగ్గటాలూ, సంధి కుదుర్చకోడాలూ తప్పవు! ఆ సంగతి మాకన్నా మీకే బాగా తెలుసు. మనకున్నది ఒకే ఒక్క జీవితం! దాన్ని పనికిరాని సెంటిమెంట్స్ కోసం త్యాగం చేసి, ఎవరూ దుఃఖమయం చేసు

## కొత్తగాలి...

**మమ్మీ! డాడీ!**
**పిలుపు అందరికీ మోజే**
**అది మాతృభాషకు మాత్రం**
**గుండె పోటే!**

– వాసా ప్రభావతి,
హైదరాబాద్

కోరు! అంచేత మా అందరికోసం మీరు పెంచి పోషించిన వ్యాపారం కోసం, మీరు త్యాగం చెయ్యక తప్పదు. మీరు కాశీకో, రుషికేశో వెళ్ళిపోండి. మిగతా కొద్దిపాటి జీవితమూ అజ్ఞాతంగా గడిపెయ్యండి!"

కట్టలు తెంచుకున్న ఆగ్రహంతో నిప్పుక ణికలా మారాను. మాడ్చేసేలా చూశాను.

నా చూపులకే శక్తి వుంటే వాడు గుప్పెడు బూడిదగా మిగిలి ఉండేవాడు!

"మీకు కోపం రావడం సహజం. మిమ్మల్నిలా కోరాల్సి వచ్చినందుకు మాకూ బాధగానే వుంది. కానీ ఏమీ చెయ్యలేని పరిస్థితి. ఒకరకంగా అశక్తులం. అయినా పిల్లల క్షేమం కన్నా ఏ తండ్రికైనా కావా ల్సిందేముంటుంది? మా కోసం ఈ మాత్రం త్యాగం చేయలేరా డాడ్? "

పేలవంగా నవ్వేను. తెరలు తెరలుగా నవ్వేను. "ప్రపంచం స్వార్థ పూరితం అని తెలుసురా! కానీ కడుపున పుట్టిన బిడ్డలకి కూడా ఒక పనికిరాని దిష్టిబొమ్మలా అయి పోతాననుకోలేదు!"

"ఐ పిటీయూ! బట్ యూ సీ..!"

"బస్! చాలు!! కనిపెంచి పెద్దచేసిన వారి రుణం ఇలా తీర్చుకుంటున్నారన్న మాట! బావుందిరా! ఎందర్నో మోస గించాను. నా స్వార్థానికి బలిచేశాను. కానీ మీకు పిసరంత ద్రోహం చేయ్యలేదు. పైసా అంత హాని చెయ్యలేదే..!"

"డోంట్ ఫీల్ ఎమోషనల్! ఆవేశం వద్దు డాడ్! కాస్త స్టడీగా ఆలోచించండి! మెటీరియలిస్ట్ అయిన మీరు కూడా సిల్లీగా సెంటిమెంటల్‌గా ఆలోచిస్తారేంటి? మీ మదర్‌ని మీరేమైనా పట్టించుకున్నారా? లేదే! అవసానదశలో ఆవిడ టీబీతో కుళ్ళి కుళ్ళి చనిపోయింది. ఆవిడ్ని ఆవిడకర్మకి ఊరోళ్ళ దయాదాక్షిణ్యాల మీదకి వదిలే శారు గానీ, ఆదుకున్నారా చెప్పండి? కనీసం ఒక్కసారైనా వెళ్ళి చూసొచ్చారా? అమ్మా! నీ బాధేమిటని అడిగారా? లేదే! అలాటి మీరిప్పుడు నీతులు చెబుతా రేంటి? !"

చెళ్ చెళ్ మని కొరడాతో తాటలు తేలేలా కొట్టినట్టన్పించింది.

"అవున్రా! నేను మా అమ్మకి చాలా అన్యాయం చేశాను. ద్రోహం చేశాను. ఒప్పుకుంటున్నాను. ఆ సంగతి ఆలస్యంగా నైతేనేం తెలుసుకున్నాను. చెంపలేసుకు న్నాను. అయినా నాకు అలాంటి శిక్షే విధి స్తానంటారా? 'తాత-చిప్ప' కథ పునరా వృతం చేస్తానంటారా? ఇది మీకు సబ బుగా అన్పిస్తోందా? "

"జీవితం కూడా ఒక వ్యాపారమే డాడ్! ఇక్కడ లాభాలు తీయడం, ఆస్తులు గడిం చడమే ముఖ్యం!"

"ఉప్పు తిన్నవాడు నీళ్ళు తాగక తప్పదు. తప్పుచేసినవాడు అనుభవించకా తప్పదు. మనం అవినీతి మార్గాన చాలా చాలా సంపాదించాం. నిజానికది సంపా దన కాదు, దొంగతనం! అందుకే డిపాజి టర్లందరికీ తిరిగి చెల్లించేద్దాం! మన ఆస్తులు పోయినా, మంచీ మమతా మిగు ల్తాయి. మనశ్శాంతి లభిస్తుంది"

"చిక్కిన సింహాన్ని బక్కకుక్క కూడా కరుస్తుంది. మిమ్మల్ని డిపాజిటర్లు కరి చినా, ఉరి తీయించినా ఫర్లేదు! ఆస్తులు త్యాగం చేయడానికి మేం సిద్ధంగా లేం! సారీ డాడ్..!"

"ధనేష్!" వాడి ధోరణికి ఉద్రేకాన్ని ఆపు కోలేకుండా వున్నాను.

"యస్! ధనేష్‌నే చెబుతున్నాను! అందరి మాటగా చెబుతున్నాను! ఈ తుఫాను మనకి హేండీగా లభించింది. ఇది ఒక వరం అనుకుందాం! మీరు తుఫానులో చనిపోయారని చెబుతాం! తుక్కయిన కారు మంచి సాక్ష్యమవుతుంది. ఎవరికీ ఎలాంటి అనుమానమూ రాకుండా అంతా గప్‌చిప్‌గా సర్దేస్తాం! మీకు కాశీలోనో, రుషీకేశ్‌లోనో ఏర్పాట్లు చేస్తాం"

"డిపాజిటర్లకి వడ్డీ కాకపోయినా, అసలు ముట్టజెప్పి తృప్తిపరచి, మిగతావన్నీ మీకప్పగించి నేనిక్కడికి వచ్చేస్తాను. గోదావరి ఒడ్డున చిన్న గుడిసె వేసుకుని ప్రశాంతంగా శేషజీవితాన్ని గడుపుతాను. మీరేం చేస్తారో? ఏ వ్యాపారాన్నెలా నడుపుకుంటారో? మీ ఇష్టం!"

"అదేం కుదర్దు! మేం ఒప్పుకోం!"

"నేను యండీని! మైండిట్! ఎవరు ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా రేపు వచ్చి నేను చేసేది అదే" దృఢస్వరంతో చెప్పేను.

అదిరిపడ్డాడు ధనేష్.

"డాడ్!"

"నో! డాడీని కాదు, వేణుగోపాలరావుని చెబుతున్నాను. నేను రేపే హైదరాబాద్ వస్తున్నాను. కోర్టులో సరెండర్ అవుతాను. రాజీ ప్రతిపాదన పెడతాను. భాగస్తుల్ని ఒప్పిస్తాను. కొన్ని ఆస్తుల్ని అమ్మేస్తాను. కస్టమర్లకి వాళ్ళ సొమ్ము చెల్లించేస్తాను. దిసీజ్ మై డెసిషన్! డిటర్మినేషన్! డెడికేషన్!"

మ్రాన్పడి చూశాడు.

అవాక్కయి నిల్చున్నాడు.

"అప్‌సెట్ అవ్వొద్దు మైడియర్ సన్! అంతా మన మంచికేరా! నేనీ నెలరోజులుగా అనుభవించిన రంపపుకోత, నరక యాతన మీకు తెలీదు. అలాటి దుస్థితి రేపు మీకు రాకూడదు. నేనున్నానుగా అన్నీ అంతా నేను చూసుకుంటాను. భారమంతా నా భుజాల మీద పడేసి, మీరు నిశ్చింతగా వుండండి!" వాడి భుజం మీద చెయ్యేసి అనునయంగా చెప్పేను.

"అంటే మా చేతుల్లో చిప్ప పెట్టాలనే నిర్ణయించుకున్నారన్న మాట!"

"అంత కర్మేం పట్టదురా! ఇంకా బోల్డు ఆస్తి ఉంది! వ్యాపారాలున్నాయి!"

"అవి మాకు చాలవు! మా సంగతి మీకు తెలీట్లేదు! ఏదైనా చెయ్యగలం!"

"చంపుతారా? "

"డిపాజిటర్లని ఉసిగొల్పితే చాలు! పోలీసుల్ని ఎక్కేస్తే చాలు! భాగస్తులకి ఎరచూపిస్తే చాలు! కిరాయి గూండాలకి నోట్లుపడేస్తే చాలు! మా చేతులకి మట్టి అంటకుండా పని జరిగిపోతుంది. మా కెన్ని దారులున్నాయో చూశారుగా! మర్యాదగా మా ప్రతిపాదనకి ఒప్పుకోండి!"

"యూ బ్లడీ స్కౌండ్రల్! నన్ను చంపేంత మొనగాళ్ళయ్యార్రా! చంపండ్రా! దమ్ముంటే చంపండి! చంపి ఈ ఊర్నించెలా ప్రాణాల్తో బయటపడతావో? నేనూ చూస్తాను..!" ఆగ్రహోద్రేకంతో రంకెవేశాను.

"మా ప్రతాపం ఇక్కడ కాదు, మా ప్లేస్‌లో చూపిస్తాం! హైదరాబాద్ పొలిమేరలు దాటి లోపలికి అడుగు పెట్టండి! ఏం జరుగుతుందో చూద్దురుగాని!"

"పోరా! పో! ఇప్పుడే వస్తాను. ఏం చేస్తారో చూస్తాను. పోరా! నా కళ్ళ ముందు నుంచి పోరా దౌర్భాగ్యుడా! తండ్రిని చంపే హంతకులకి ఈ ఊళ్ళో చోటులేదురా! పోరా పో..!"

ఆగ్రహం కట్టలు తెంచుకోగా వాడ్ని బయటికి తోసేసి, వాడి బేగ్గుని వాడి మీదకి విసిరేశాను.

నిప్పుల తుపానులా నేను విరుచుకుపడేసరికి భయపడి పారిపోయాడు!

★ ★ ★

గుండె పగిలేంత ఉద్వేగంతో ఊగిపోతూ కుర్చీలో కూలబడ్డాను.

గుండెల్లో సన్నని సెగ కాలుస్తోంటే గుండె రుద్దుకున్నాను.

అంతవరకూ బొమ్మలా నిలుచున్న రాకు మారి గబుక్కున ముందుకొచ్చింది.

"మళ్ళీ గుండె నొప్పి..?!"

"వుహూఁ! రాదు! నేను చక్కబెట్టాల్సిన కార్యాలు చాలా వున్నాయని దానికి తెలుసు. కాసిని మంచి నీళ్ళిస్తావా? "

పరుగునెళ్ళి తెచ్చిచ్చింది.

అక్షరం

విజయగాథలను చదివితే కేవలం సందేశాన్ని పొందుతావు. కానీ, వైఫల్య గాథలను చదివితే గెలుపుకి మార్గాలను కనుగొంటావు

– అబ్దుల్ కలాం



"ఇక వస్తాను రాకుమారీ! రేపు హైదరాబాద్ వెళ్ళిపోతాను. మళ్ళీ రావాలనే నా సంకల్పం. ఏమవుతుందో? చూద్దాం!"

శాపగ్రస్తుణ్ణా నడుస్తున్నాను.

కెవ్వుమని ఏడుస్తూ భూమ్మీద పడిన పసికందు నుంచి మొదలయ్యే ఈ జీవిత చక్రంలో ఎన్ని అనుబంధాలు! ఎన్ని ఆశలు! ఎన్ని ఆశయాలు! ఎన్నెన్ని పరుగులు!

అనుకోని మలుపులు! అందివచ్చే అందలాలు! జారిపడే అగాధాలు! - ఈ వైకుంఠపాళీయే కదా జీవితంలోని జూదం! ఎంత చిత్రం! ఏ డబ్బు కోసం నేను పాకులాడానో ఆ డబ్బే నా ప్రాణాలు తీయడానికి ఆయుధమవుతోంది!

రాణి ఫోన్ చేసింది. "చిన్నోడి మాట విననంటున్నారంటేంటి? వయస్సు మీద పడేసరికి మీకు చాదస్తం లావు అయినట్టుంది! ప్రతితండ్రీ తమ సంతానానికి రెండు మూడు తరాలు కూర్చుని తిన్నా తరగనంత ఆస్తి పాస్తులివ్వాలని చూస్తారు! మీరేంటి ఊరోళ్ళకంతా ఊడ్చి పెట్టేసి పిల్లలకి చిప్ప ఇస్తానంటున్నారట? ఇదేం పిచ్చి?" దూకుడుగా అంది.

"ఇది మన బాధ్యత! మనల్ని నమ్మి మన దగ్గర దాచుకున్న డబ్బుని తిరిగివ్వటం మన కనీసధర్మం!"

"ఈ ధర్మాలు అడవికిపోయి ముక్కు మూసుకుని తపస్సు చేసుకునేవాళ్ళకి! మన్లాంటి బిజినెస్ వాళ్ళక్కాదు!"

"ధర్మం అందరికీ అన్ని కాలాలకీ వర్తిస్తుంది. మన పిల్లల భవిష్యత్తు గురించి ఆందోళన పడొద్దు! వాళ్ళకి రెక్కలున్నాయి! చదువుంది! సామర్థ్యం ఉంది! వాళ్ళే సంపాదించుకోగలరు!"

"నా మాట వినరా?"

"వినను! తాశిల్దారుగారు పై నుంచి దిగొచ్చి చెప్పినా వినను. నేను వరద గోదావరిలో కొట్టుకుపోయే చెత్తాచెదారాన్ని కాదు. ఎదురీదే చేపని"

లైన్ కట్ చేశాను. మరుక్షణం సెల్ మళ్ళీ మోగింది. లైన్లో పెద్దబ్బాయి బుచ్చిరాయుడు.

"తమ్ముడంతా చెప్పేడు! మీకన్నీ తెలుసు! ఎలా బావుంటుందంటే అలా చెయ్యండి డాడీ! ఇక్కడి పరిస్థితులు విషమిస్తున్నాయి. వీటిని మీరే చక్కబెట్టగలరు! ఇంకెవరికీ సాధ్యం కాదు! వెంటనే వచ్చెయ్యండి..!"

"బయల్దేరుతున్నా! వర్షం వచ్చేట్టుంది! కానీ సునామీ వచ్చినా ఆగను! వచ్చేస్తాను! రేపొచ్చి కలుస్తానని మన ప్లీడరుకి చెప్పు!"

ఇద్దరూ కొడుకులే! ఇద్దరికీ ఎంత తేడా!

"విషాదమూర్తిలా వున్నావు! ఏం జరిగిందిరా?" మూర్తి అడిగాడు.

"మనిషి.. కుటుంబం.. సమాజం.. ఈ మూడింటి మధ్యా ఉండాల్సిన సమతుల్యత నశించిపోయిందిరా!"

"డబ్బు కోసం, ఆస్తుల కోసం, అధికారం కోసం ఎంతకైనా తెగించేవాళ్ళు ఎప్పుడూ ఉంటారు. అందుకు భారతమే సాక్ష్యం. ఆలి పంచాయితీ రామాయణం, పాలి పంచాయితీ భారతం!"

శ్రీరాములుగారింటి కెళ్ళేను. "ఆయ్! పొద్దుటే వచ్చారేవిటి సంగతి?" అంటూ

చేతిలోని పని వదలి వచ్చారు.

"సిటీకి వెళ్ళిపోతున్నాను! మీరు చేస్తున్న పునర్నిర్మాణ కార్యక్రమం లాంటిదే చేసి తిరిగి వస్తాను!"

"తెలిసో? తెలీకో? ప్రలోభ పడో? అత్యాశకుపోయో? ఎన్నో చేస్తూంటాం! ఆయ్! తప్పులు అందరం చేస్తూంటాం! కానీ కొందరే వాటిని సరిదిద్దుకోగలరు!"

"నేను.. మీరూ.. మన ఊరూ.. మెచ్చుకునేలా మా ఊరివాడు అని గర్వించేలా- అన్నీ సరిదిద్దుతానని హామీ ఇస్తున్నాను!"

"చాలా సంతోషం! మంచిపనికి దేవుడి తోడ్పాటు తప్పక లభిస్తుంది! అదిగో! ఆ విరిగిన కొమ్మల్ని చూడండి! చెట్టుని అంటి

కొత్తగాలి...

**నాలోని విలువలకు**
**సమాజ స్థితిగతులకు**
**అలుపెరగని పోరాటం**
**అనర్థాల అంతానికే ఆరాటం**

– చింతలపూడి శివశంకర్‌రెడ్డి,
శ్రీశైలం

పెట్టుకుని వున్నంత కాలమే కొమ్మలంటాం! విరిగి వేరయ్యాక అవి కొమ్మలు కాదు కొయ్యలవుతాయి! మనమంతా సమాజం అనే వృక్షపు కొమ్మలం! రెమ్మలం! ఆకులం! పూవులం! సక్రమంగా మన పని మనం నిర్వర్తించినప్పుడే సమాజమనే మహావృక్షం పచ్చగా ఉంటుంది"

నా గురించి అందరికీ తెలిసిపోయింది.

అయినా ఒక్కరూ ఎత్తి చూపలేదు. పల్లెత్తు మాటనలేదు. పైగా 'మేమున్నాం అండగా' అని ధైర్యం చెబుతున్నారు!

ఒకప్పుడు మా అమ్మ ఒంటరి పోరాటం చేసినప్పుడు ఆమెకీ, నాకూ చేయూతనిచ్చింది ఈ గ్రామస్థులే!

ఇవాళ కూడా..!

వారి రుణం ఏమిస్తే ఏం చేస్తే తీరేను?

మూర్తి ఇంటికొచ్చేసరికి టాక్సీ వచ్చింది.

పరమానందపడిపోతూ అన్నాడు మూర్తి "నా కల నెరవేరబోతోందిరా వేణూ! ఏకంగా పుష్కరస్నానం చేసినట్టు ఉందనుకో! వైద్యబృందంలోని ఓ లేడీ డాక్టరు ఇక్కడ హాస్పిటల్ తెరవడానికి అంగీకరించింది. అతి త్వరలో నా ఈ ఇల్లు ఆసుపత్రిగా మారబోతోంది! ఈ గ్రామప్రజలకే గాక చుట్టుపక్కలి ఊళ్ళ జనాన్నికూడా వైద్యసాయం అందబోతోంది! ఇంకెవరూ నా భార్యలా అకాల మృత్యువు నోటపడరు"

అతడి కళ్ళ వెంబడి ఆనందబాష్పాలు జలజలా రాలిపోతున్నాయి.

"నీది వెన్నలాంటి మనస్సు! నువ్వు పదుగురి క్షేమం కోరే మనిషివి! నీవు తలపెట్టిన కార్యం విజయవంతమై తీరుతుంది! నువ్వు నూరేళ్ళు కాదు వెయ్యేళ్ళు చల్లగా వర్ధిల్లాలి! నాలాంటి ఎందరికో కాంతికిరణమై దారి చూపాలి!"

మూర్తిని కౌగిలించుకుని మనసారా అభినందించాను.

"మీ కోటు, బేగు సర్దుకోలేదు బాబాయ్!" గదిలోంచొస్తూ అంది గౌతమి.

"వాటి అవసరం లేదమ్మా! నేనే కాదు, నా వేషమూ మారింది. భేషజం లేని మామూలు మనిషిని! నాకిప్పుడు హంగూ ఆర్భాటాలతో పనిలేదు"

"కబుర్లు బాగానే చెబుతున్నావు గానీ ఎక్కడ మేసినా మనింట్లో పాలిస్తే చాలు అనుకోమాకు! అన్నం అరఘడియలో అరుగుతుంది. ఆదరణ శాశ్వతంగా వుంటుంది. ఆ సంగతి జ్ఞాపకం పెట్టుకో" అంది అచ్చమ్మ.

"అలాగే అక్కా! నీ మాటలెప్పుడూ మర్చిపోను!" అన్నాను మొదటగా వరుసకలిపి.

బుగ్గలు నొక్కుకుందామె!

"వాడ్నేమీ అనకక్కా! బాగా మారిపోయాడు!"

"అలాగా? ఒరే! ఈ బుద్ధి బుధవారం దాకా వుంటే బూరెలు వండి పెడతా(న్రా!"

చిన్నగా నవ్వుతూ తలాడించాను. కారు దగ్గరకి నడిచాను.

"అమ్మాయ్ గౌతమీ! నువ్వు కారుకి ఎదుర్రామ్మా! నువ్వెదురొస్తే నా ప్రయాణం, నా ప్రయత్నం ఫలిస్తాయనీ.. నా ధ్యేయం నిర్విఘ్నంగా నెరవేరుతుందనీ నాకెందుకో నమ్మకంగా వుంది తల్లీ!"

కారెక్కబోతోంటే శీను పరుగునొచ్చాడు. వాడిని ఎత్తుకుని ముద్దు పెట్టుకుని చేతిలో కొంత డబ్బు పెట్టి "బట్టలు కుట్టించుకో! బాగా చదువుకో! నీ చదువు ఖర్చు నేను భరిస్తాను! నువ్వెంత చదివితే అంతదాకా చదివిస్తాను. ఈసారొచ్చినప్పుడు మీ న్నాన్నతో మాట్లాడతాను" అన్నాను.

కారెక్కబోతూ ఆగి మూర్తిని పిలిచాను.

"మూర్తీ! మళ్ళీ జన్మంటూ వుంటే నీ కడుపున పుట్టాలని ఆశగా ఉందిరా!"

"వేణూ! ఏం మాటల్రా అవీ!" కన్నీళ్ళు చిప్పిల్లుతోంటే అన్నాడు.

"ఇంకో సాయం కూడా చెయ్యాల్రా!"

"నాకేమైనా అయితే నా శవాన్ని ఈ గడ్డమీదే కాల్చాల్రా! నా చితాభస్మాన్ని పుణ్యగోదావరిలో కలపాలి! నీ చేతుల మీదుగా ఆ పని జరగాలి! గోదావరి పవిత్రత వల్ల కనీసం నా తదుపరి జన్మ అయినా పావనం అవుతుందని నా ఆశ! ఆకాంక్ష! ఏంరా నా కోరిక తీరుస్తావా? "

చేయిచాస్తూ అన్నాను. నా చేతిలో చేయివేసి నొక్కేడు. "ఎదురీద బోతున్నావు జాగ్రత్త! మా సాయం కావలిస్తే చెప్పు!"

"తప్పకుండా! ముంజేతిని ఖండించినా పిడికిలి వదలను. ప్రామిస్!"

గౌతమి నీళ్ళబిందెతో ఎదుర్రాగా, కారు ముందుకి కదిలింది.

కారు అద్దంలోంచి నా ఊరినీ, నా ప్రాంతాన్నీ చూస్తూ కూర్చున్నాను.

సిటీ నుంచి ఇక్కడి కొచ్చినప్పుడు దొంగలా వచ్చేను. ఇప్పుడు తలెత్తుకుని దొరలా వెళ్తున్నాను.

ఈ కారులానే ఈ శరీరమూ ఒక రకంగా అద్దెదే! గమ్యం చేరే వరకే ఈ శరీరం మనతో ఉంటుంది!

నాకిప్పుడెలాటి భయాలూ లేవు! ఆందోళనలు లేవు! బాధ లేదు! వేదన లేదు! మథన లేదు! అనుమానాలు లేవు! ముఖం చాటెయ్యడాలు లేవు! అజ్ఞాతవాసాలు అసలే లేవు!

నిర్భయంగా వున్నాను. శక్తి సంపన్నుడిలా ఉన్నాను. ప్రశాంత చిత్తంతో ఉన్నాను. శమీవృక్షం మీది ఆయుధాలు తీసుకున్న అర్జునుడిలా ఉన్నాను.

ధర్మో రక్షతి రక్షితః- గెలుపు ముమ్మాటికీ నాదే కాబోతోంది! ఎన్నడూ లేని ఆనందానుభూతులకి లోనవుతున్నాను.

సఖినేటిపల్లి రేవు దగ్గర కారు ఆగింది. దిగాను. కళ్ళెదుట జీవనది గోదావరి ప్రశాంతంగా ఆనందంగా ప్రవహిస్తూ నన్ను చూస్తోంది! దీవిస్తోంది!

జోళ్ళు తీసి గోదావరిలో కెళ్ళా! తృప్తిగా అనిపించలేదు. ఇంకాస్త లోతు కెళ్ళాను. అయినా తృప్తిపడలేకపోయాను.

గబుక్కున మునిగాను. మూడుసార్లు మునిగాను. ఎంతో సంతృప్తిగా అన్పించింది. పవిత్రుడినైనట్టు అనుభూతి కలిగింది.

సంబరంగా వచ్చి పడవ ఎక్కేను.

గోదావరి అలల మీద పడవ సాగిపోతోంది. అద్దరికి చేరడానికి పరుగులు తీస్తోంది.

తల్లి గోదావరి దివ్యమంగళ స్వరూపాన్ని కనులారా తిలకిస్తూ ముగ్ధుడ్ని అవసాగాను.

వేదంలా ఘోషిస్తూ..

జీవనాదంలా ప్రవహిస్తోంది...

ధన్యగోదావరి!

©

పెద్ద కథ

# ప్రేమున్న మోటు

పల్లెటూరు నుండి ఢిల్లీ- పంజాబు పోతున్న పంజాబీ వారి సంఖ్య ఆ ఊరిలో ఎక్కువే! కుర్రాళ్లు గుంపులు- గుంపులుగా ఊరునుండి బయల్దేరి వెళ్తారు. ఊరి నుండి బయల్దేరుతున్న వారిని ఎవరు గమనించినా- గమనించకపోయినా, ఢిల్లీ- పంజాబుల్లో సంపాదించి, ఊరికి తిరిగి వచ్చిన వారిని మాత్రం ప్రతి ఒక్కరూ చూసి తీరుతారు. ఎందుకంటే వీరంతా పట్నవాసపు షర్ట్- ప్యాంటు ధరించి ఊళ్లోకి ప్రవేశిస్తారు. కొంతమంది చలువ కళ్లజోడును పెట్టుకుంటారు. తలమీద ఒక టోపీ! పెట్టె లేదా సూటుకేసు ఉండొచ్చు లేదా ఒక భుజాన సంచీ వేలాడొచ్చు. వీరంతా రెండో భుజానికి మోగుతున్న ట్రాన్సిస్టరో, టేప్‌రికార్డరో తప్పకుండా తగిలించుకుంటారు. వారితోబాటే ఊరిలోకి రణగొణ ధ్వనీ ప్రవేశిస్తుంది.

ఇవన్నీ చూస్తున్న రఘువీర్ కొడుకు నాగేసర్ మనస్సు కూడా ఢిల్లీ- పంజాబు పోవాలని ఉవ్విళ్లూరేది.

ఝూబర్ కొడుకు రూప్‌లాల్ పంజాబు నుండి తిరిగి వచ్చినది లగాయతు, నాగేసర్ అతని వెంట- వెంట తిరుగుతూ మళ్లీ నువ్వు తిరిగి పంజాబు పోయేదెన్నడని ప్రశ్నిస్తూనే ఉన్నాడు. ఆఖరికి రూప్‌లాల్ ఒక వారం రోజుల ముందు తాను ఫలానా తేదీన పంజాబు తిరిగి వెళ్తున్నానని నిఖరంగా చెప్పాడు. తాను కూడా అతనితో వెళ్తానని నాగేసర్ తండ్రితో అన్నాడు. కాని తండ్రి 'వద్దు' అని, ఈ విషయంలో మరింకేమీ వినేది లేదని నిష్కర్షగా కొట్టిపారెయ్యడంతో నాగేసర్ చిన్నబుచ్చుకున్నాడు.

తాను అతనితో రాలేకపోతున్నానన్న మాట రూప్‌లాల్ చెవిన వేయాలని నాగేసర్ భావించాడు.

"అదేం? " రూప్‌లాల్ ప్రశ్నించాడు.

"నాన్న వద్దన్నారు!" నిరాశ నిండిన గొంతుతో నాగేసర్ బదులిచ్చాడు.

"అరే! అసలు నాన్నను అడగటానికి ఎందుకెళ్లావు? అమ్మకు చెప్పి, మాట్లాడకుండా బయల్దేరి వచ్చెయ్! అమ్మ కూడా వద్దని అన్నదనుకో, తమ్ముడు కాలేసర్ చెవిన ఒక మాట పడేసి పద! అంతే!"

"అమ్మో! నాన్నకి కోపం వస్తుంది!"

"తిరిగి వచ్చేంతవరకే ఆ కోపం! వచ్చేక నీ సంపాదన ఆయన దోసిట్లో పోస్తే కోపం కాస్తా హారతి కర్పూరంలా హరించి పోతుంది"

"కాదు- కాదు! ఆయన మాటను కొట్టేసి వెళ్తే, నాన్న కోపం కర్పూరంలా హరించదు"

"పారిపోయిన ప్రతివారి తండ్రి కోపమూ కర్పూరమే అయిందిలే! అంతేనా? తిరిగొచ్చిన వారం తరవాత నుండీ మళ్లీ పంజాబు ఎప్పుడు వెళ్తావని వాళ్లే పదే-పదే అడగటం ప్రారంభిస్తారు. పారిపోయిన ప్రతివాడి నాన్నా అంతే!" అని రూప్‌లాల్ విడమర్చాడు.

నాగేసర్‌కి రూప్‌లాల్ మాటలతో విశ్వాసం కుదరటంతో తండ్రికి చెప్పకుం



డానే ఇల్లు వదిలాడు.

తండ్రి అనుమతి లేకుండా, ఆయన మాటను కాదని గుట్టుచప్పుడు కాకుండా ఇలా ఇంటి నుండి బయట పడటం నాగేసర్‌కి ఇదే మొదటిసారి. తాను పోతున్న సంగతి తల్లికి మాత్రం చెప్పాడు. తండ్రి తన కోసం వెతుకుతున్నప్పుడు ఆయనకు ఎలా చెప్పాలో కూడా ఆమెకి బోధపర్చాడు. 'నాగేసర్ నాతో పంజాబు వెళ్లటం గురించి మాటిమాటికీ అంటూనే ఉన్నాడు. నిన్న రోజంతా ఝూబర్‌గారి అబ్బాయి రూప్‌లాల్‌నే అంటిపెట్టుకుని తిరగటం గమనిస్తే, వీడూ ఆ కుర్రాడి వెంట పంజాబు పోయి ఉంటాడని నా అనుమానం' అని మెల్లిగా చెప్పాలి.

తండ్రికి తెలియచెయ్యవలసిన బాధ్యత ఆమెపైన వేసేముందు నాగేసర్ తల్లిని తనవైపు తిప్పుకుందికి రహస్యంగా ఆమెతో మంతనాలాడేడు. తన మనస్సు ఉవ్విళ్లూరుతున్నదన్నమాట చెప్పకుండా నాగేసర్ ఇలా అన్నాడు. "నువ్వే చూస్తున్నావు కదమ్మా పొలం అంతా చౌడుబారిపోతోంది. గత రెండేళ్ల నుండి మనల్ని వ్యవసాయం దెబ్బతీస్తోంది. నాన్నేమో అప్పుల్లో మునిగిపోయి ఉన్నారు. ఈ యేడు వ్యవసాయం చెయ్యటానికి, అతి కష్టం మీద విత్తనాలకీ- ఎరువులకీ సరిపడా డబ్బును మాత్రం ఎలాగో సమకూర్చుకున్నారు. కనిపిస్తే అప్పు తీర్చమనే నత్థూమల్ భయానికి ఆయన బజారువైపు వెళ్లటమే మానుకున్నారు. జగదీశ్ సింగ్ నన్ను చూస్తే చాలు, కేకవేసి మరీ పిలిచి అప్పు తీర్చమని గదమాయిస్తాడు"

"కష్టకాలం దాపురించింది నాగూ? మనం చితికిపోయాం!" తల్లి బాధపడింది.

"మరి నువ్వూ చూస్తున్నావు కదమ్మా!

తతిమ్మా ఇళ్లలో కొడుకు పంజాబు నుండి డబ్బు సంపాదించి తెస్తే, తండ్రి ఇక్కడ హాయిగా ఒకటో- రెండో సెంట్లు భూమిని కొనిపడేస్తున్నారు"

"నిజమే కానీ మనకు మాత్రం మన పొలమే కద ఆధారం? "

"మనం వ్యవసాయమే చేద్దాం. నేను కూడా మిగిలిన వారిలాగా పంజాబు నుండి ఎంతోకొంత సంపాదించి తెస్తే, వ్యవసాయం మనను దగా చేసినా చితికి పోం. నాన్న కూడా దిగులు పడకుండా ధైర్యంగా ఉండొచ్చు"

"నువ్వా పంజాబు పోతావా? "

"ఊc! మనకిప్పుడు అదే అవసరమని కూడా అనిపిస్తోంది"

"సరే! నాన్నని అడుగు"

"నాన్న వద్దన్నారు. ఇల్లు-వాకిలి వదులు కుని, తన కొడుకు సంపాదించుకురావటా నికి పైఊరుకు వెళ్లటం ఆయనకిష్టం లేదు. కాని ఆయన దుస్థితిని చూడలే కుండా ఉన్నాను. నేను సంపాదించుకునేం దుకు వెళ్లడానికి నువ్వు సరేనను చాలు!"

"నాన్నకి కోపం వస్తేనో? "

"నా సంపాదనంతా తెచ్చి చేతుల్లో పోసినా ఆయన కోపం తగ్గదంటావా? "

"నువ్వేమీ పసిపిల్లవాడివి కాదు, మన కుటుంబానికి ఏది మంచిదనిపిస్తే అది చెయ్యి!"

తరువాత భారాన్ని తల్లిమీదేసి కొడుకు ఆనందంగా ఇంటి నుండి బయల్దేరాడు.

★ ★ ★

రఘువీర్ మండల్ శాంతమైన వాడేనని చెప్పుకోవాలి. ఝూబర్ ద్వారా విషయాన్ని రూఢిగా తెలుసుకున్నాక కూడా పెద్దగా ఉగ్రరూపాన్ని ధరించలేదు. కాస్త కోపగిం చుకుని, ఈ కబురును చెప్పిన భార్యను తిట్టి, కబురు చెప్పని చిన్నకొడుకు కాలేసర్ బుగ్గమీద ఐదు వేళ్లూ పడేటట్లు మాత్రం ఒక్కటిచ్చాడు. ఆపైన శూన్యంలోకి చూస్తూ గంటల తరబడి ఉండిపోయాడు.

రఘువీర్ చాలా ఆందోళన పడ్డాడు. తన మాటను కొడుకు కొట్టిపారేసేడనో లేదా చెప్పకుండా పారిపోయాడనో కాదు కాని, అసలు అలా పంజాబు పలాయనం చిత్తగించినందుకే అతడు బాధపడ్డాడు.

ఊర్లో కుర్రాళ్లు ఢిల్లీ- పంజాబు పారిపో యేవారు. ఇక్కడ వారి తండ్రులూ- అన్న దమ్ములూ క్రమం తప్పకుండా పోస్టాఫీ సును దర్శించుకునేవారు. ప్రతివారూ ఉత్త రాలకని, డబ్బుకని ఎదురుచూపులు చూసేవారు. అయితే రఘువీర్ మాత్రం పోస్టాఫీసు వంక ఎన్నడూ కన్నెత్తి చూడ లేదు. కొడుకు రాసిన మొదటి ఉత్తరం రాగానే మాత్రం భార్యకి అందిస్తూ.. "ఇదిగో ఉత్తరం" అన్నాడు.

"ఎవరు రాశారు? " భార్య ప్రశ్నించింది.

"నీ కొడుకు"

"ఏం రాశాడు? "

"కాలేసర్ చేత చదివించుకో!"

"బాగుంది. అదేమన్నమాట? "

రఘువీర్ ఒక్కసారి భార్యవంక తీక్ష ణంగా చూశాడు తప్ప జవాబియ్యలేదు.

కాలేసర్ చేత చదివించుకుని ఆమె భర్త దగ్గరకు తిరిగొచ్చి అంది- "ఉత్తరం మీకే రాశాడు" అంది.

"అవొచ్చు"

"వాడు ఢిల్లీలో ఉన్నాడు"

"ఊc!"

"ఏదో ఇల్లు కట్టడం పని నడుస్తోందిట. తనూ అందులోనే పనిచేస్తున్నాడుట"

"ఊc!"

"క్షేమ సమాచారాలతో బదులియ్యమని రాసేడు"

"ఊc!"

"ఒక్క జవాబు రాసి పడేద్దురూ!"

"కాలేసర్ చేత రాయించుకో!"

"అదేమన్నమాట? "

ఈ సారి భార్య మాటకు రఘువీర్

జవాబియ్యలేదు. కేవలం ఆమె వంక కోపంగా చూశాడంతే!

తమ్ముడి నుండి జవాబులు నాగేసర్‌కి చేరుతున్నాయి. తన మీద తండ్రికి ఇంకా కోపం చల్లారలేదని అర్థమైంది. అయితే అతడు వెంటనే ఊరిని మరిచిపోలేదు, అలా అని తండ్రి పేరున మరో ఉత్తరం రాయనూలేదు. 'ఆర్జించిన డబ్బు దోసిట్లో పడగానే తండ్రి కోపం హారతి కర్పూరంలా ఇట్టే ఎగిరిపోతుంది' అన్న రూప్‌లాల్ మాట అతనికి బాగా ఒంటపట్టింది. అలా తండ్రి కోపాన్ని సహిస్తూ అతడు ఆరునెలల వరకూ ఢిల్లీలోనే ఉండిపోయాడు.

ఢిల్లీ నుండి ఊరిలోని మరో నలుగురైదుగురు కుర్రాళ్ళతో కలిసి నాగేసర్ కూడా వచ్చాడు. కాని అతడిని చూస్తూనే ప్రతి వారి నుంచి ఒకటే ప్రశ్న-ఎక్కడి కెళ్ళావు? ఎందుకంటే తక్కిన వారిలా అతను రంగు రంగుల చొక్కా-పేంటు తొడుక్కురాలేదు. కళ్లకు నల్ల కళ్ళజోడుగాని, నెత్తిన టోపీ గాని కనిపించలేదు. కేవలం ఒక భుజానికి సంచీ మాత్రమే వేలాడుతోంది. రెండో భుజం ఖాళీ, తక్కిన వారిలా మోగుతున్న ట్రాన్సిస్టరో, టేపురికార్డరో లేదు. అందుకే తక్కిన వారితో కలిసి ఊర్లోకి వచ్చినా, వారితో బాటు ప్రవేశించిన రణగొణధ్వనిలో నాగేసర్ లేడు.

బరువైన అడుగులతో ఇంట్లోకి ప్రవేశించిన నాగేసర్‌కి వీధి గుమ్మంలోనే కుర్చీ మీద కూర్చున్న తండ్రి కనిపించాడు. తండ్రి కాళ్ళకి నమస్కారం చేసి నిల్చున్నాడు. కాని తండ్రి మనస్సు భారమయిందని అర్థమవటంతో, తల్లిని కేకేస్తూ లోపలికి వెళ్ళాడు.

ఇంట్లో తమ్ముడు కాలేసర్ లేడు. నాగేసర్ తల్లితో చాలాసేపు ముచ్చటిస్తూ కూర్చున్నాడు. తను వెళ్లిన తర్వాత నుండి తండ్రి మరింత మౌనంగా కూర్చుంటున్నాడని తల్లి చెప్పింది. ఈసారి కాలేసర్‌తో కలిసి తండ్రి చాలా శ్రమకోర్చి పంట బాగా పండించాడనీ తెలిసింది. అయితే తిండిగింజల ధర విపరీతంగా పడిపోవటంతో పొలానికి పెట్టిన పెట్టుబడి కూడా రాలేదు. చేసిన అప్పుల్లో ఏ ఒక్కటీ తీర్చటం సాధ్యం కాలేదు. అప్పులిచ్చిన వారంతా ఇంటికొచ్చి తగువులాడుతున్నారు. అంతేనా! నత్థూమల్ షావుకారుగారి సిపాయి వారానికోసారి ఇంటిమీదకొచ్చి అప్పుతీర్చమని ఒకటే గొడవ.

ఈ విషయాలన్నీ విన్న తరువాత నాగేసర్ తన మొలలో దోపుకున్న డబ్బుల సంచిని తీసి, నోట్ల కట్టను తల్లి ముందుకు జాపి- "అమ్మా! ఇదిగో ఈ డబ్బును నాన్నకియ్యి" అన్నాడు.

"ఎన్ని? "

"ఐదువేలు!"

తల్లి వెంటనే ఆ డబ్బును భర్తకివ్వటానికి వెళ్ళింది. నోట్లకట్టను ముందుకు జాపి- "ఢిల్లీనుండి నాగేసర్ తెచ్చిన సంపాదన! మొత్తం ఐదువేలు"

**హిందీ మూలం :**
**చంద్రకిశోర్ జైస్వాల్**

**అనువాదం :**
**డా. ఆర్. సుమన్ లత**

భర్త తన చేతిని ముందుకు జాపలేదు "వాడి సంపాదన వాడే ఉంచుకుంటేసరి"

"వ్యవసాయానికనే ఇచ్చేడు!"

"వ్యవసాయం వాడే చేసుకుంటేసరి!"

తల్లికి ఒళ్లుమండి బుసకొట్టినట్లు అంది- "అదేమన్నమాట? కొడుకు డబ్బు తెచ్చిస్తే ఇక పొలంపనీ వాడే చెయ్యాలా? "

తండ్రి జవాబియ్యలేదు. ఒక్కసారి చురుక్కుమనేటట్లు చూశాడంతే.

తల్లి నాగేసర్‌కు డబ్బు తిరిగి ఇచ్చేయ్యా

లని వెనక్కు మరలింది.

చిన్నబోయిన మనసుతో నాగేసర్ డబ్బుని తీసుకున్నాడు. రాబోయే వ్యవసాయపు పనులపై దృష్టి పెట్టి, తమ్ముడితో బాటు ఆ సన్నాహాలలో పూర్తిగా మునిగి పోయేడు. తండ్రి రఘువీర్ ఈసారి పొలం పనులవైపు కన్నెత్తి చూడలేదు. కొడుకులనే పూర్తి బాధ్యత ఎత్తుకోనిచ్చాడు. తండ్రికోపం కాస్తకాస్త హారతి కర్పూరం అవుతోందని నాగేసర్‌కి అనుభవమయింది.

కొడుకు ఇలా తనమాటను కొట్టేసి వెళ్ళి మంచిపని చేసేడన్న భావం తండ్రి మనసులో కలుగుతూ ఉండొచ్చునన్న నమ్మకం కలిగేక నాగేసర్ తల్లి ఎదుట తన మనసులో మాటను బైట పెడుతూ ఇలా అన్నాడు- "అమ్మా! నేను ఢిల్లీ వెళ్లక పోయుంటే బహుశా ఈ సారి మనపొలం దున్నకుండా బీడు పడి ఉండేది. నాన్న ఇబ్బందిని పోగొట్టేసేను. ఇకమీదట నాన్న బజారులోకి వెళ్లటానికి బిడియపడనవసరం లేదు. షావుకారు నత్థూమల్ బకాయిని తీర్చేశానులే! ఇకమీదట జగదీశ్ సింగ్‌కూడా అప్పు తీర్చమని టొకాయించడు. రాబోయే వ్యవసాయపు పనులకని, చెయ్యగలిగినంత చేసేను. ఇంట్లో వెయ్యి రూపాయలుంచి మరీ వెడుతున్నాను"

"వెడుతున్నావా? ఎక్కడికి? "

"నేను మళ్ళీ ఢిల్లీ వెళ్ళాలమ్మా! పొలం పని మీదే పూర్తిగా ఆధారపడలేం. ఢిల్లీ నుండి డబ్బు తెచ్చేక నాన్న మొహం మీద కాస్తంత కళ కనిపించింది. ఈ సారి నేను ఢిల్లీ వెళ్లి పూర్తిగా ఒక ఏడాది తరువాతే వస్తాను. కాలేసర్‌కి అన్నీ వివరంగా బోధపరిచాను. ఈ వెయ్యి రూపాయలతో పొలంపని ఏదోలాగ పూర్తవుతుంది. నాన్నని వ్యవసాయం చెయ్యనీ! నన్ను ఢిల్లీ వెళ్ళి సంపాదించనీ!"

"ఈసారైనా నాన్నని అడిగే వెళ్తావుకదా!"

"అడిగేవెళ్తాలే! అయినా ఈసారి కూడా నాన్న అడ్డుచెప్తాడా? వెళ్లొదంటాడా? "

తీరా అడిగాక, తండ్రి అననే అన్నాడు- "వద్దు" అని. తండ్రి మాట విన్న నాగేసర్‌కి ఆశ్చర్యం వేసింది "ఏం నాన్నా? పరాయిదేశంలో సంపాదించటం తప్పు పనా? మరి ఇంతమంది వెడుతున్నారా లేదా? "

"అలా వెడుతున్న వారంతా రైతులు కారు. వారికి తమ స్వంత భూములూ లేవు, వ్యవసాయమూ లేదు. వారంతా ఇక్కడా కూలి పనే చేస్తారు. బైటకీ ఆ కూలిపని చెయ్యటానికే పోతారు. నువ్వెందుకు రైతు నుండి కూలీగా మారాలి? మా తాత రైతు, మానాన్న రైతు, నేనూ రైతునే, నువ్వూ వ్యవసాయ దారుడిగానే ఉండు!"

"ఈ పొలం పనుల్లో ఇక మనకు మిగిలిందేమిటి నాన్నా? "

"రైతుగా నేను పొందే ఆనందం! తిండి గింజల్ని పండించే అన్నదాతగా నేను అనుభవించే ఆనందం అన్నిటికన్నా గొప్ప సంతోషం నాయనా! అదే సృష్టిలోని ఆనందం. నేను మట్టిలోంచి గింజల్ని పండిస్తాను. ఒక గింజ నుండి వంద గింజల్ని పండించగలిగే ఆనందాన్ని మించిన సంతోషం ఎవరికైనా ఏముంటుంది చెప్పు? విత్తనాల్ని జల్లిన నాటి నుండి ప్రతీ ఉదయం పొలాన్ని చూడటానికి వెడతాను. కొత్తగా తలెత్తుతున్న మొక్కల్ని చూస్తూ ఉంటే మనసుకు ఉల్లాసం కలుగుతుంది. కొంచెం-కొంచెంగా పెరిగి పెద్దవుతున్న పైరును గంటల తరబడి చూస్తూ మైమరచిపోతాను. నానాటికీ ఏపుగా పెరిగే గుమ్మటాల్ని చూసుకుంటాను. గాలికి తలలూపుతున్న కంకుల్ని చూస్తే గుండెలకి హత్తుకోవాలని, కౌగిలించుకోవాలని అనిపిస్తుంది. పాలు పోసుకుంటున్న గింజల్ని చూస్తూ ఉంటే చాలు కడుపు-మనసూ నిండిపోతాయి. నీకు ఇలాంటి హాయి ఏదీ కలదగా? "



"నువ్వు వర్ణిస్తూ ఉంటే, కొంచెం-కొంచెంగా అనిపిస్తోంది"

"నాయనా! నేను నాయకుల ఉపన్యాసాలు వినటానికి వెడతాను. మహాత్ములు చెప్పే ప్రవచనాలూ వింటాను. అయితే, ఇంటికి వచ్చేక మాత్రం వారందరికన్న నేను చాలా గొప్ప పని చేస్తున్నానన్న భావం నాలో కలుగుతుంది. ప్రపంచమంతటికీ నేను అన్నం పెడుతున్నాననిపిస్తుంది. ఇవన్నీ ఎవరూ నాచేత చదివించలేదు. నేర్పించనూలేదు. కానీ ఈ భావాలన్నీ నేను నా మనసులో అనుభవించేవి. వ్యవసాయదారుడిగా జీవించే ఆనందాన్ని రైతు పెద్దయినా, చిన్నయినా మనసులో అనుభవిస్తాడు. చెప్పకుండా ఢిల్లీ పారిపోయే ముందు ఎన్నడూ నువ్వు ఈ రకమైన ఆనందాన్ని హాయిని అనుభవించలేదంటే ఆశ్చర్యంగా ఉంది సుమా!"

"నాన్నా! మీకు మనసులో ప్రపంచానికే అన్నదాతనన్న అనుభూతి వలన ఆనందం కలుగుతుంది. నిజమే! కాని ప్రపంచానికి తినిపించటం వెనక మనం ఎంత చితికిపోయామో చూసుకుంటే బాధ వెయ్యదూ? గడిచిన మూడేళ్ళలో ఏం జరిగింది? "

"నువ్వు చెప్పే బాధ కన్న, నా ఆనందం విలువ ఎన్నో రెట్లు ఎక్కువ. మా తాత-ముత్తాతలు కూడా అన్ని కాలాల్లో సుఖంగానే జీవించి ఉండకపోవచ్చు. వాళ్ళ మీదా అప్పుల భారం ఉండే ఉంటుంది. వాళ్ళు కూడా ఇలా చితికిపోయి ఉండొచ్చు. కాని, వాళ్ళు వ్యవసాయాన్ని విడవలేదు, కూలీ వారుగా మారాలన్న ఆలోచనే వారికి రాలేదు. ఇటువంటి పరిస్థితిలోంచి వారెలా బైట పడ్డారో, మనమూ అలాగే బైటపడదాం. ఒడ్డెక్కుదాం!"

"వారెలా బైటపడి ఒడ్డెక్కేరో ఆ భగవంతునికే తెలియాలి!"

"వారికి వ్యవసాయం గురించి క్షుణ్ణంగా తెలుసును. అదేవారికి అక్కరకొచ్చేది కూడాను! రాబోయే రోజును గురించి, రాబోయే కాలాన్ని గురించి వారు తెలుసుకోగలిగేవారు.

శ్రావణమాసంలో శుక్లపక్ష సప్తమి నాటి ఉదయాన్నే సూర్యుడు మబ్బుల్లోంచి దూకినట్లు బైటకువస్తే, ఆ యేడు కార్తీకశుక్లం ఏకాదశి వరకూ వానలు కురుస్తాయని వారెరుగుదురు. హస్తా నక్షత్రంలో మొదటి నాలుగు రోజులూ లోహ పాదంలో వానకురిస్తే ధాన్యంతోబాటు, రబీ పంటా సర్వనాశనం అవుతుందనీ, ఆపైన తామ్ర పాదంలో వానపడితే పంటకు నష్టం వాటిల్లుతుందనీ, రజతీ పాదంలో వాన వలన సగం పంటే పండుతుందనీ, స్వర్ణపాదంలో వానపూర్తి దిగుబడి నిస్తుందనీ వారికి మహాబాగా తెలుసు. వారెన్నడూ మోసపోయుండరే!"

కొత్తగాలి...

**ర్యాగింగ్ రాంగ్‌రూట్‌లో**
**వచ్చి ప్రాణాలు తీస్తుంటే**
**పలుకుబడితో**
**ఎప్పటిలానే యంత్రాంగం**
**కళ్లు మూసుకుంటోంది!**

– నల్లపాటి సురేంద్ర, విశాఖపట్నం

"మీకు కూడా ఈ విషయాలన్నీ తెలిసినా మరి మీరెందుకు బైటపడి ఒడ్డెక్కలేకపోతున్నారు నాన్నా? ఆలోచించండి మీమిద అప్పుల భారం లేకుండా ఏనాడయినా గడిచిందా? గడిచిన మూడేళ్లలోనయితే ఈ అప్పు అలా అలా పెరిగిపోతూనే ఉంది. తాత- ముత్తాతలు రైతులుగానే ఉండి- పోయేరేమోగాని, ఇక మనకి మాత్రం సాధ్యం కాదు"

"మనమూ ఉండగలం నాయనా!"

"మనం ఇక ఉండలేం నాన్నా! శ్రావణ శుక్ల సప్తమి, హస్తా నక్షత్రంలాటి వివరాలు తెలిసినంత మాత్రంలో మన పనులు కావు" ఒక సంవత్సరం మీరు- ఆరుద్ర వాన- అదునువాన.. అని వల్లిస్తూపోయారు. ఆ యేడు మరి ఏపాటి పంటపండిందో చెప్పండి. అదయినా ఉంచుకుందికి గాని, తినటానికిగాని పనికొచ్చిందా? ఆ తరువాతి సంవత్సరం 'వృష్టికి ప్రమాణం ఉత్తరహస్తలనీ, హస్తకు ఆటపాళ్లు- చిత్తకు మూడుపాళ్ళు అనీ, పడమట మెరిసిన పదిగడియలకు వర్షం అనీ పాటపాడుతూనే ఉన్నారు. కాని నిజం చెప్పండి నాన్నా! శ్రావణంలో కర్కాటకంలో వానలు కురిసేయి. భాద్రపదం రాగానే సింహంలో(లా) మేఘాలూ గర్జించేయి. కాని... కాని అన్నదాతకు ఏపాటి తిండిగింజలు రాలేయి? ఉత్తర చూస్తే గంపెత్తినా అందులో ఏం మిగిలింది? ఫ్!"

"ఎక్కడో ఏదో పొరపాటు అవుతోందని నేనూ ఒప్పుకుంటాను. తాతా- ముత్తాతలకు తెలిసిన జ్ఞానంతో ఈనాడు మనకు పని నడవటంలేదు. బహుశా కాలం మారిపోయి ఉండొచ్చు. పూర్వ స్వాతి నక్షత్రంలో వానలు ముగుస్తూండటం వలన పంటకు ఎంతో మేలు జరిగేది. ఒక్క స్వాతి చినుకు ముత్యపు చిప్పలో పడితే అది మంచి ముత్యంగా మారుతుందంటారు. మరి ఇప్పుడు వానలేమో హస్తలోనే ముగిసిపోతున్నాయి"

"నాన్నా! ఇక మీదట ఈ వ్యవసాయం పని లాభసాటి కాదు. ఈరోజుకీ మీరు వానరాకడ- ప్రాణంపోకడ తెలియదన్న ధోరణిలో దేముని మీద భారంవేసి వ్యవసాయం చేస్తున్నారు"

"పూర్తిగా పైవాడి మీదే భారం వేసెయ్యటం లేదులే! మిగిలిన రైతులలాగే మనమూను. ఈ రోజుల్లో రైతు లెవరూ దేముడి మీద భారం వేసి వ్యవసాయం చెయ్యటంలేదు"

"నాన్నా! నిజం చెప్పాలంటే ఈ కాలంలో వ్యవసాయానికి బాగా పెట్టుబడి అవసరం. అలా తగినంతమదుపు పెట్టగ

లుగుతున్నవారే వ్యవసాయమూ బాగా చెయ్యగలుగుతున్నారు. ఎందుకంటే పొలంలో మేలురకం విత్తనాలను విత్తాలి. అవసరమైనంత మోతాదులో ఎరువుల్ని చల్లి అదునులో దుక్కిదున్నగలగాలి. అప్పుడే ఫలసాయమూ బాగుంటుంది. లేని వాళ్ళు చచ్చిపోతున్నారు. మీరేమో నత్థూమల్ దగ్గర దొరికే చవకబారు ఎరువుల్ని- విత్తనాల్నీ తెచ్చుకుంటారు. మీకు అప్పులిచ్చే జగదీశ్‌సింగ్ దగ్గర వడ్డీ విపరీతంగా ఉండటం వలన, అవసరానికి సరిపడినంత డబ్బూ తెచ్చుకోలేరు. వర్షాలు అదునులో కురవకపోతే ఒక్కసారి దుక్కిదున్ని, ఆపైన చేతులు ఎత్తేయ్యాల్సి వస్తోంది. ఆపైన? ఇక అంతా పై వాడి దయే! నన్ను ఢిల్లీ వెళ్లొదని అడ్డుపడుతున్నారు. సరే, ఇక్కడ నాకు నచ్చిన రీతిలో వ్యవసాయం చేసుకోనీయండి"

"నీ ఇష్టప్రకారమే కానీ నాయనా!"

"ముందు పెట్టుబడి సమకూర్చుకోవాలి!"

"పొలంపనిలో అడుగడుగునా డబ్బును పెట్టగలగాలి మరి అంత ధనాన్ని సమకూర్చుకోగలవా? ఇలాంటప్పుడు నత్థూమల్ ఇచ్చే అప్పే అక్కరకొస్తుంది. జగదీశ్‌సింగ్ అడిగే అధిక వడ్డీని కట్టగలవా? "

"నేను ఈ నత్థూమల్- జగదీశ్‌సింగ్‌లను ప్రాథేయపడను. వారి దయాదాక్షిణ్యాలు నాకు అక్కరలేదు. అతితక్కువ వడ్డీలకే సర్కారు రుణం అందిస్తోంది. బేంకులూ అప్పులు మంజూరు చేస్తున్నాయి"

"తగిన ధనాన్ని సమకూర్చుకో. నీ మనసుకు ఎలా తోస్తే అలా చెయ్యి. కాని ఒక్కటే.. రైతుగా ఉండు. వ్యవసాయాన్ని వదిలెయ్యకు, అంతే!" తండ్రి కొడుకుతో చెప్పాలనుకున్నది చెప్పేడు.

నాగేసర్ పెట్టుబడిని సమకూర్చుకున్నాడు. తండ్రి సలహాలనూ- సూచనలనూ తీసుకుంటూ, తన తమ్ముడితో కలిసి మంచిపంటను పండించటానికి సాధ్యమయినంత కృషి చెయ్యటంలో పూర్తిగా మునిగిపోయాడు.

గతంలో కూడా నాగేసర్ తండ్రితో కలిసిగాని, ఒంటరిగా గాని తమ పంటపొలాల్ని చూడటానికి వెళ్లేవాడు. కాని తండ్రికి లభించే ఆనందం- సుఖం అతను ఏనాడూ అనుభవించలేదు.

ఇదిగో ఈసారి మాత్రం తన పొలం సన్నిధి అతని మనసుకు 'ఆనందనిధి'ని సమకూర్చింది.

పొలంలో విత్తనాలు జల్లి, తండ్రిలాగే ప్రతి ఉదయమూ వెళ్ళి తన పొలాన్ని తనివితీరా చూసుకుంటున్నాడు. అప్పుడప్పుడే తలెత్తుతున్న నారును చూస్తే మనసుకు ఉల్లాసంగా ఉంటోంది. పెరుగుతున్న పైరును చూస్తూ మైమరిచిపోతున్నాడు. గాలికి తల ఊపుతున్న కంకుల్ని అతడు మొదటిసారి పరీక్షగా చూశాడు. ఇక పాలుపోసుకోబోతున్న గింజల్ని గురించిన ఆలోచనే మనసును సంతోషంతో నింపేసింది.

కాని...

కాని, పాలుపోసుకున్న బలమైన గింజలతో గాలికి తలూపుతున్న కంకుల్ని గుండెలకు హత్తుకోవాలనిపించే తరుణం రానే వచ్చిందనుకుంటున్న సమయంలో ఒక్కసారిగా కాళ్లకింద భూమి కదిలిపోయింది! కంకుల్లో గింజలే లేవు!!

మొత్తం ఆ ప్రాంతం అంతటి మీద ఈ ఘోర విపత్తు పిడుగులా పడింది. అక్కడి ఏ ఒక్క రైతు పొలంలోనూ పంట దిగుబడి లేదు. కేవలం చొప్ప మాత్రమే పెరిగి ఊరుకుంది. తెల్లకంకి తెగులు పంజాలో అందరి పైర్లూ ఇరుక్కున్నాయి. ఈసారి పొలాల నుండి ధాన్యాన్ని కాదు చొప్పకట్టల్ని ఎత్తుకోవాలి. ఆ ప్రదేశమంతా హాహాకారాల్తో మారుమోగింది.

రఘువీర్ ఇంట్లో, శవంలేచిన ఇల్లులా మౌనం రాజ్యమేలుతోంది. ఎవ్వరిలోనూ

ఒక ఉలుకూ-పలుకూ లేదు.

సుదీర్ఘమైన మౌనం తరువాత నాగేసర్ తల్లే నోరు విప్పింది. భర్తవంక చూసి- "పిల్లలు ఉదాసీనంగా చిన్న బుచ్చుకున్నారంటే నేను అర్థం చేసుకోగలను. కానీ మీరెందుకంత మూగనోముపట్టి చిన్నబోయి కూర్చున్నారు? ఇంతకు పూర్వం కూడా ఇలా అయిందే, కాని ఇంత నిరాశగా కూర్చుండిపోవటం మిమ్మల్ని నేనెన్నడూ చూడలేదు. పెద్దవారు మీరే ఇలా డీలా పడితే, మరింక పిల్లల సంగతి ఏం కావాలి? నేనూ ఒక రైతు కూతురినే. కాని ఏనాడు నా తండ్రిని ఇలా ఓడిపోయినవాడిలా నిరాశలో మునిగిపోయి ఉండడం చూడలేదు.

జరిగిన అనర్థం మన ఒక్కరికే కాదుగా! అప్పుల్లో మునిగిపోయేం, నిజమే! కాని ఏం జరుగుతుంది? ఈ నేలను నమ్ముకునే చేసిన అప్పును తీరుద్దాం. ప్రతీసారీ చొప్పే రాదు కదా! భూమి కూడా బంజరు భూమి కాలేదే! ఇకపైన జరగవలసింది చూడండి. పొలంలో మొలిచింది చొప్పే అయినా కోతలు మొదలుపెట్టండి" అంది.

రఘువీర్ నాగేసర్‌ను పిలిచి- కోత కొయించేయమన్నాడు. పొలంలో కోతలకు మనుష్యుల్ని పిల్చుకురావటానికి నాగేసర్ వాడవాడా తిరిగి ఇంటికొచ్చి తండ్రితో "పొలం కోతకి ఎవ్వరూ దొరకలేదు" అని చెప్పాడు.

"అదేం? "

"మన ఊరూ మగవారెవరూ లేరు. అంతా ఢిల్లీ- పంజాబు పోయారు. రోజంతా శ్రమపడినా, కిలో గింజలయినా రాలని ఈ పని చెయ్యడానికి ఆడవాళ్లు ముందుకు రావటం లేదు"

"ఇంట్లో ఖాళీగానే కూర్చుంటారు గాని, ఈ పని మాత్రం చెయ్యరు అవునా? "

"కడుపు నిండుతోంది కదా! అందుకే ఆ టెక్కు, వారందరి ఇళ్లూ పంజాబు సంపాదనతో కళకళలాడుతున్నాయి. అక్కడ పంజాబులో మగవారు చెమటోడ్చి సంపాదించిన దానితో ఇక్కడ ఆడవారంతా దర్జాగా హాయిననుభవిస్తూ బతుకుతున్నారు"

తండ్రీ-కొడుకుల సంభాషణ విని తల్లి బయటకు వచ్చింది. "కోత కొయ్యటానికి రాకపోతే పొమ్మను. ఈసారి మంచి పంట పండినప్పుడు వాళ్లని మన పొలంలో కాలు పెట్టనీయొద్దు. అపుడు వేరేచోట నుండి పనివారిని పిల్చుకుందాం. పది రోజులు పడుతుంది. అంతేనా? పట్టనీ. పగళ్లు మీరు తండ్రీ- కొడుకులు కోత పని కానియ్యండి. రాత్రి పూట నేను వెళ్లి కోస్తాను. రేపటి నుండే కొడవళ్లు సిద్ధం చేసుకుని పొలానికి పదండి"

ఆ రైతు బిడ్డ చెప్పినది వాళ్లు శ్రద్ధగా విన్నారు. తెలతెలవారుతుండగా- "నాగూ! నాగూ! అన్న పిలుపుతో నాగేసర్‌కి తెలివి వచ్చింది. బయటకు వచ్చి చూస్తే గుమ్మం అవతల, ధర్మచంద్ నిల్చుని కనిపించాడు. నాగేసర్ అతడిని "ఏమయిందన్నా? " అని అడిగాడు.

"నీ పొలంలో పైరు అంతా తగలబడిపోతోంది!" ధర్మచంద్ చెప్పాడు.

"మంటలా? " అని కంగారుగా తండ్రి దగ్గరికి పరుగెత్తినట్లు వచ్చి "నాన్నా! ఎవరో మన పొలాలు తగలెట్టారుట. పోయి చూసి వస్తాను" అన్నాడు.

## కొత్తగాలి...

**అక్రమార్కుల అవినీతి**
**నకిలీ పాసుపుస్తకాల రీతి**
**రైతుకు 'అనంత'కోటి కష్టాలు**
**రాయితీ నకిలీల పాలు!**

**– అంబటి వెంకటశివారెడ్డి,**
*యర్రగుంట్ల, కడప జిల్లా*

నెమ్మదిగానే తండ్రి "వెళ్ళక్కరలేదు. నేనే తగలబెట్టాను" అని ఆపాడు.

నాగేసర్‌కి మాట రాలేదు "మీరా? "

"అవును అర్ధరాత్రి వెళ్లి తగలెట్టివచ్చాను"

'ఇలా ఎందుకు చేశారు'? అని అడగటానికి కూడా అతడికి నోరు రాలేదు.

తల్లి కూడా నిశ్చేష్ట అయింది. కాని అంతలోనే కోపంగా బుసకొట్టినట్లు భర్త ఎదుటికి వచ్చి - "ఇదేమన్నా బాగుందా? పంట పాడయితే పొలానికి నిప్పుపెట్టటం? హవ్వ! అదేమన్నమాట? "

రఘువీర్ బదులివ్వలేదు. మౌనంగా అట్నుంచి ఇటు ఒత్తిగిల్లాడు.

ఇల్లంతా నిశ్శబ్దం..

రఘువీర్ రోజంతా ఇంట్లో బల్ల మీద నిస్త్రాణగా పడుకునే ఉన్నాడు. భార్య కాసేపు ప్రవచనంలా మాట్లాడి, తన పనుల్లో మునిగిపోయింది. కేవలం అన్నదమ్ములు మాత్రం రోజంతా ఏదో గుసగుసలాడుతూనే ఉన్నారు.

రాత్రి భోజనాలప్పుడు నాగేసర్ తల్లికి చెప్పాడు. "అమ్మా! రేపు ఉదయాన్నే నేను, తమ్ముడు ఢిల్లీ వెళ్తున్నాం"

"అన్నదమ్ములిద్దరూనా? " తల్లి ప్రశ్నించింది.

"అవునమ్మా! ఈసారి అప్పుభారం మరింత పెరిగిందిగా!"

"తిరిగిరావటం? "

"ఆర్నెల్ల పైమాటే"

"నాన్నకి చెప్పేవా? "

"ఉదయాన్నే చెప్తాలే? "

"ఒంటరిగా ఈ వ్యవసాయం చేయటం నాన్నవలనవుతుందా? "

"పొలాన్ని చెయ్యటమో, కౌలుకివ్వటమో చెయ్యమను"

తల్లి మౌనాన్నే ఆశ్రయించింది.

మర్నాడు ఉదయాన్నే అన్నదమ్ములిద్దరూ తయారయి బైల్దేరేవేళకు, కాలకృత్యాలు తీర్చుకుని తండ్రి మంచె మీదకు పోయి కూర్చున్నాడు.

నాగేసర్ "నాన్నా! నేను, తమ్ముడు ఢిల్లీ పోతున్నాం" అని మాత్రం చెప్పి తమ్ముడితో కలిసి వేగంగా కదలి ముందుకు వెళ్లాడు.

తండ్రికి 'ఒద్దు' అని చెప్పే అవకాశం ఇవ్వకుండా వాళ్లిద్దరూ వెళ్లిపోయారు.

తండ్రికి కేవలం కళ్లెత్తి వారిద్దరి వంక ఒక్కసారి చూడటానికి మాత్రమే అవకాశం దొరికింది. అతడు తన పిల్లల్ని వెనక్కు పిలవలేదు. కళ్ళకి కనిపిస్తున్నంతసేపూ మౌనంగా చూస్తూ కూర్చున్నాడు.

తలుపు వెనుక నుంచి తల్లి ఇదంతా చూస్తూనే ఉంది. వెళ్తున్న పిల్లలు కనిపించటం మానేసేక ఇంట్లోకి వెళ్లింది.

మరికాసేపు మంచెమీద కూర్చుని రఘువీర్ ఇంట్లోకి వచ్చి బల్ల మీద కూలబడ్డాడు. భార్య దగ్గరకొచ్చి "పోన్లే ఈసారి అన్నదమ్ములిద్దరూ కలిసి వెళ్లేరు కదా. ఇదీ మంచిదేలే" అంది.

రఘువీర్ లేచి కూర్చుని "ఏంటో ఇద్దరూ హడావిడిగా వెళ్లిపోయేరు" అన్నాడు.

"బండి అందుకుందికి కోసెడు దూరం నడవాలిగా మరి!"

"ఏం మాట్లాడటానికీ అవకాశమే ఇవ్వలేదు నాకు"

"ఏదైనా చెప్పాలనుకున్నారా? "

"రాత్రి నాతో అనుంటే...."

"ఏం చెప్పాలిట? "

"నాకూ తగిన పని వెతకమని.."

భార్య అవాక్కయింది. కొంచెం ఆగి అంది. "స్వంత సేద్యం వదులుకుని పరాయి దేశం ఆర్జించటానికి పోతారా? "

రఘువీర్ తన భార్య మొహం వైపు చూసి మోకాళ్ల మధ్య తల పెట్టుకున్నాడు. భార్య ఏం మాట్లాడడం లేదు.

కాని రఘువీర్ చెవుల్లో 'అదేమన్న మాట? అదేమన్నమాట? ' అని ప్రతిధ్వనిస్తూనే ఉంది.

©




కొడవటిగంటి కుటుంబరావు

# అనుభవం

నిర్వహణ : **వి. రాజారామమోహనరావు**

**ఆర్థిక సూత్రాలు, రాజకీయ సిద్ధాంత చర్చల గురించే కుటుంబరావుగారు రాస్తారని, వ్యక్తిగత జీవితం గురించి రాయరని ఓ అభిప్రాయం వుంది. అది సరికాదని 'అనుభవం' నవల నిరూపిస్తుంది. 'అనుభవం' పార్వతి అనే ఓ స్త్రీ జీవితం. పార్వతి పుట్టుకతో ఆరంభమైన ఈ నవల, ఆమె పూర్తి జీవిత అనుభవాన్ని మనకు తెలియజేస్తుంది. పార్వతి ఈ నవలలో కేవలం ఓ వ్యక్తి మాత్రమే కాదు, ఆమెలాంటి మరి కొందరికి ప్రతినిధిలా వుంటుంది.**

**పం**దొమ్మిదో శతాబ్దం వెళ్లిపోతుండగా పార్వతి పుట్టింది. ఐదుగురు మగపిల్లల తర్వాత పుట్టిన ఆడపిల్ల. ఆమె మూడో ఏటే తండ్రి పోవటం వల్ల, పార్వతికి తండ్రి అంత బాగా తెలియదు. తల్లి మీనమ్మ గండ్ర మనిషి. తల్లి ఆధిపత్య ప్రభావం చిన్నతనం నుంచే పార్వతి మీద ఉంది. అందుకే కాబోలు చిన్నతనం నుంచే స్వతంత్రంగా బతుకుతున్న ఆడవాళ్లంటే పార్వతి ఇష్టపడుతూ వచ్చింది.

అప్పుడప్పుడే జ్ఞానం తెలుస్తున్న పిల్లలు అక్కడే ఉన్నారన్న దృష్టిలేకుండా కొంతమంది పెద్దవాళ్ళు కూడని కబుర్లు చెప్పుకుంటూ ఉంటారు. అలా తన తల్లి, చుట్టుపక్కల అమ్మలక్కలు చెప్పుకునే కొన్ని పెద్దకబుర్లు పార్వతి చెవిన పడ్డాయి. అవి తన తల్లి గురించీ, బస్తీలో కాపురం చేస్తున్న పినతల్లుల గురించే కావటంతో మరింత ఆ పసిమనసులో నాటుకుపోయాయి. తన తల్లి గురించి అమ్మలక్కలు 'కుంతీదేవి' అనటం, ఒకరు పెద్దపినతల్లిని వదిలేస్తే, చిన్న పినతల్లులా ఇద్దరి పరాయి మగవాళ్ళ ప్రాపకం పొందారనటం, ఆ వయస్సులో వాటి అంతరార్థం బాగా తెలియకపోయినా పెద్దయ్యాక అర్థం చేసుకోగలిగింది పార్వతి. పార్వతికి అటువంటి జీవితం రోత అనిపించలేదు. బస్తీలు చూశాక పల్లెలంటే రోత, పల్లెపట్టున కొందరి ఆడవాళ్ళ గానుగెద్దు జీవితం పట్ల ఉదాసీనత ఏర్పడ్డాయి. అధికారం కింద అణిగిపోని జీవితం కావాలనిపించింది.




పార్వతికి, పెద్దచిన్నమ్మ పల్లె తాలూకు సంబంధమే స్థిరపడింది. జమిందారీ కుటుంబం. అత్తగారు శ్యామలాంబ. ఆవిడకి కాంతయ్య ఒక్కడే కొడుకు. శ్యామలాంబగారి భర్త వెంకటనారాయణగారికి సకల వ్యసనాలూ వున్నాయి. ఆయన చాలా చాలా తిరిగేశాక ఓ విధవ జమిందారిణి ప్రాపున పట్నంలో ఉండిపోయాడు. కొడుకు కాంతయ్య పెళ్ళికి కూడా ఆయన రాలేదు.

కాంతయ్య ముమ్మూర్తులా తండ్రి పోలికేనని శ్యామలాంబ నమ్మకం. స్త్రీ వ్యసం నుంచి కాంతయ్యని రక్షించాలంటే అందమైన భార్యని చిన్న వయస్సులోనే కట్టబెట్టాలని ఆవిడ నిర్ణయం. ఆ దృష్టితోనే పేదింటి పిల్ల అయినా, అందగత్తె కావడంతో పార్వతితో సంబంధం కలుపుకుంది. కోడలు తన లాగే వ్యవహర్త అవ్వాలని ఆవిడ ఆకాంక్ష.

పార్వతి, మీనమ్మ, శ్యామలాంబ, ఈ నవలలో ప్రధాన పాత్రలు. ముగ్గురూ సరైన సంసారజీవితం లేనివారే. తగిన భర్తలేక సంప్రదాయమో, ధనమో, అధికారమో నియంత్రించిన ఈ ముగ్గురు మూడు రకాలుగా తమ, తమ బిడ్డల జీవితాన్ని నియంత్రించాలని అనుకుని సర్వప్రయత్నాలూ చేశారు. పరిస్థితులకు ఎదురు తిరిగి నిలబడ్డారు. వాళ్ళ ప్రయత్నాలకి సామాజిక

చత్రం అడ్డుగా నిలిచింది.

పార్వతి కాపురానికి వచ్చి భర్త పద్ధతులు అర్థం చేసుకునేటప్పటికే ఆమె గర్భవతి అయ్యింది. అప్పటికే ఆమెకి చాలా విషయాలు తెలిసి వచ్చాయి. పుట్టిన పిల్లాడు తండ్రి పోలికే అన్నారు. తాతగారి పేరే 'చినవెంకటనారాయణ' అని పెట్టారు. పిల్లాడికి అన్నిరకాలుగా ఆ వార సత్వం, ఆ బుద్ధులే వస్తాయని పార్వతి భయప డింది. అప్పటికే భర్త కాంతయ్య సంసారం పట్ట కుండా వేరే ఇంట కాలక్షేపం మరిగాడు. అత్త గారు శ్యామలాంబకి చిత్తచాంచల్యం ఏర్పడింది. ఇవన్నీ చూసి పార్వతి పిల్లాడితో పుట్టింట అన్న గార్ల దగ్గరే వుండిపోయింది. పురిటికని వచ్చిన పార్వతికి పుట్టిల్లే నివాసం అయిపోయింది. జమీందారిలో భర్త తగలేస్తున్నది తగలెయ్యగా, మిగిలిన పొలంపుట్రా మంచిచెడ్డలు చూసే నమ్మ కమైన గుమస్తా మామయ్యగారున్నారు. వాటితాలూకు సొమ్ము ఆయనే తెచ్చి ఇస్తుండటం పార్వతికి సులువుగా మారింది. పిల్లాడిని చది వించుకుంటూ వేరే ఇల్లు తీసుకుని ఉండటం ఆరంభించింది పార్వతి. తన ఇల్లు.. తన పిల్లాడు, తను తీర్చిదిద్దుకోవాల్సిన సంసారం.. అన్న స్వతంత్ర జీవనం ఆమెకు ఓరకంగా తృప్తినిచ్చింది. వెంకటనారాయణ హైస్కూలు చదువు పూర్తయింది. పార్వతి భర్త ఇవేం పట్టించుకోవడంలేదు.

పార్వతి అత్తగారు శ్యామలాంబకి పిచ్చి పెరి గాక ఆమె తాలుకు బంధువులు వచ్చి తీసికెళ్లిపో యారు. చేతికందిన డబ్బు జల్సా చేస్తూ పార్వతి భర్త కాంతయ్య పట్నంలోనే ఉండిపోయాడు. ఎవరికీ సమాధానం చెప్పఖ్ఖర్లేని స్వతంత్రం పార్వతిది. ఉన్న డబ్బులో చాలాభాగం వడ్డీలకి తిరుగుతూ ఆదాయం బాగానే ఉంది. కొడుకు నారాయణ చెప్పుచేతల్లోనే ఉంటూ ఆమె మాట కాదనడం లేదు. ఓరకంగా ఆమె జీవితం బాగానే ఉంది. పార్వతమ్మకి సాయానికి అన్నగార్లు న్నారు. భర్త ఆస్తిమీద విపరీతంగా అప్పులు చేస్తున్నాడని, నారాయణ పేరుతో మైనరు దావా వేసి, ఆ విషయంగానూ జాగ్రత్తపడింది.

తల్లి మాటకి ఎదురు చెప్పే గుణం నారాయ ణకి లేదుగానీ, ఆవిడ అన్ని పద్ధతులూ నారాయ ణకి ఇష్టంగా ఉండటం లేదు. కాలేజీ చదువుకి వచ్చేటప్పటికి నారాయణకి కనీసం కొన్ని విష యాలలోనైనా తల్లి నుంచి స్వతంత్రం కావాలని పించింది. ఈలోగా నారాయణ తండ్రి కాంతయ్య గుంటూరులో చనిపోయాడు. పార్వతి కొడుకుని తీసుకొని వెళ్ళి వచ్చింది. భర్త మరణం ఆమెని మరింత బండగా తయారుచేసింది. భర్త పోయి నందుకు కాక వైధవ్యం వచ్చినందుకు ఎక్కువ విచారించింది. తల గొరిగించుకోవడానికి ఒప్పుకో లేదు. పోయిన భర్తకి కర్మకాండ, మాసికాలు శ్రద్ధగానే చేయించింది.

నారాయణ డిగ్రీ విజయనగరం హాస్టల్‌లో ఉండి చదివాడు. అలా కొడుక్కి దూరంగా ఉండటం పార్వతికి ఇష్టం లేకపోయినా తప్ప లేదు. తన స్వతంత్ర జీవితంలో నారాయణ చాలా ప్రయత్నాలు చేశాడు. సంగీతం, నటన, స్పోర్ట్స్. ఏదీ సరిగ్గా అబ్బలేదు. చివరికి కథలు రాయడం మీద ఒకింత గురికుదిరింది.

తన నుంచి దూరంగా ఉండటమే కాదు, తన భావాలకి, తనకీ కూడా కొడుకు దూరమవుతున్నా డన్న దుగ్ధ పార్వతికి పట్టుకుంది. తండ్రి తాలూకు పోలికలేమోనన్న... అనుమానం కలి గింది. ఇక పిల్లాడికి తొందరగా పెళ్లిచేసెయ్యటం మంచిదనుకుంది.

సావిత్రితో నారాయణ పెళ్లి జరిగింది. మావ గారువాళ్లది బాగా ఉన్న కుటుంబం అవటం వల్ల, తనకీ లోటు లేకపోవడం వల్ల నారాయణకి ఓ కొత్త ఊహ వచ్చింది. ఉద్యోగం తనకెందుకు అనుకున్నాడు. కథలు రాయటం మీదే దృష్టిపె ట్టాడు. కథలు పత్రికల్లో అచ్చవుతున్నాయి.

సావిత్రి.. నారాయణ చిలకాగోరింకల్లా కలి సిపోవడం చూసిన పార్వతికి మళ్లీ తనది ఒంటరి బతుకే అనిపించింది. సర్వస్వంగా పెంచుకున్న కొడుకు తనవాడు కాదా? అన్న మథన. తను ఎంతో కష్టపడినా, ఒంటరిగా పోరాడి ఎదురు నిలిచి సాధించినా.. ఫలితం ఇలా ఉందేంటన్న ఆరాటం. తను పడిన కష్టా నికి, కొడుకు తననే సర్వస్వంగా చూడాలి అంతే కానీ పెళ్లాం కొంగు పట్టుకు తిరిగే వాజమ్మ కాకూడదు. మిగిలిన విషయాల్లో నచ్చకపోయినా, భర్తలో ఇటువంటి గుణం లేనందుకు, ఇప్పుడు సంతోషపడింది పార్వతి. ఆవిడ అభిప్రాయాలూ స్థిరంగా ఉండటం లేదు. నారాయణ విష యమూ అలాగే ఉంది. ఉద్యోగం అఖ్ఖర్లేదను కున్న అతనికి ఇప్పుడు ఉద్యోగం చెయ్యాలనిపిం చింది. అదీ సాహిత్య సంబంధమైన సబ్ ఎడిటర్ ఉద్యోగం దొరకటంతో, భార్యతో మద్రాసుకు మారి అక్కడ కాపురం పెట్టాడు.

ఈ పరిణామక్రమంలో పార్వతి ఎంతో పరిత

## ఉత్తమ సాహిత్య సృజనే ఊపిరి



కొడవటిగంటి కుటుంబరావు రచనల్లో వాస్తవికత, అభ్యుదయం, ఆధునికత మూడూ ముప్పేటగా అల్లుకొని ఉంటాయి. పాఠకుల్లో సంస్కారాన్ని పెంచడమే సాహిత్య ప్రయోజనమని ఆయన దృఢవిశ్వాసం. అందువల్లనే ఉత్తమసాహిత్య సృజనకు ఆయన అహరహమూ తపించారు. బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన కొడవటిగంటి గుంటూరు జిల్లా సంగం జాగర్లమూడి గ్రామంలో 1909 అక్టోబరు 28వ తేదీన జన్మించారు. తెనాలి, గుంటూరు, విజయనగరాల్లో హైస్కూలు, కాలేజీ విద్య పూర్తి చేసి.. ఎంఎస్సీ చదవడానికి కాశీ వెళ్లారు. మధ్యలోనే ఆ చదువు ఆగిపోవడంతో ఆయన రచనా జీవితం శ్రీకారం చుట్టుకుంది. పత్రికా నిర్వహణ, దిన, వార పత్రికలలో పాత్రికేయం, ఫ్యాక్టరీలో ఫోర్‌మన్, కాపీ రైటర్ ఇత్యాది ఉద్యోగాల నిమిత్తం తెనాలి, మద్రాసు, ముంబాయి, జయపూర్, సిమ్లా తదితర పట్టణాలు తిరగాల్సివచ్చింది. 1953 నుంచి 1980లో మరణించే వరకు 'చందమామ' మాసపత్రికకు సంపాదకులుగా వ్యవహరించారు.

కుటుంబరావు రచించిన మొదటి కథ 'ప్రాణాధికం' 1931లో 'గృహలక్ష్మి' పత్రికలో వచ్చింది. అప్పటి నుంచి చివరిరోజుల వరకు ఆయన రచనా వ్యాసంగం కొనసాగింది. మొత్తం సుమారు ఐదొందల కథానికలు, గల్పికలు, నవలలు ఇరవై, రేడియో నాటికలు వంద, దాదాపు ఆరొందల వ్యాసాలు కొడవటిగంటి రచించారు.

పించింది. తన కొడుకు ఇంక తనకి దూరమే అనుకుంది. తన ధోరణిలో తానే కానీ, తల్లి ఒంటరి జీవితం గురించి నారాయణ పట్టించుకోవడంలేదు.

నారాయణకి ఆడపిల్ల పుట్టింది. బారసాలలో అందరూ ఆ పిల్ల పార్వతి పోలికేనంటే మురిసిపోయింది. మళ్లీ మరో చిరు ఆశ. ఆ ఆశ మనసులో మెదులుతుండగానే పార్వతి మద్రాసు వెళ్లింది. మనవరాలి పెంపకం విషయంలో ఆవిడ మాట చెల్లలేదు సరికదా, అంతా విరుద్ధంగానే ఉంది. మద్రాసులో తనకేమీ లేదన్న నమ్మకం పార్వతికి క్రమంగా కలిగింది.

వాళ్లు తనను అర్థం చేసుకోరు. తాను వాళ్లను అర్థం చేసుకోలేదు. ఈ నేపథ్యంలో ఆమెకు రకరకాల భయంకర ఊహలు కూడా కలిగాయి. ఏనాడో మరచిపోయిన శృంగారం అందులో ఒకటి. వేశ్యగా పుట్టివుంటే బావుండేదేమోనన్న ఊహ..!

మొత్తానికి పార్వతికి మద్రాసు జీవితం బాధగా మారింది. అన్నగారి ఇంట్లో పెళ్లి నెపంతో వచ్చేసింది. ఆ వచ్చిన పార్వతి తిరిగి మద్రాసు వెళ్లక, తెనాలికే వెళ్లి చేరింది.

పార్వతమ్మ జీవితంలో ఎక్కువ బాధ నారాయణ వల్లే కలిగింది. ఆమె జీవితాన్ని, ప్రేమనూ, తపస్సునూ వ్యర్థం చేశాడని ఆవిడ ఉద్దేశం. అదే బాధతో ఇరవై ఏళ్లు గిలగిలలాడింది.

ఆమె తన మనసు డొల్లతనాన్ని డబ్బుతో నింపాలని చూసింది. కొంతకాలం బాగానే అనిపించినా, ఆ ప్రయత్నమూ ఫలించలేదు. మొండిగా బతికింది.

తనకి వంటిల్లు మాత్రం ఉంచుకుని, ఇల్లంతా అద్దెకి ఇచ్చేసింది. ఇంట్లో అద్దెకి వచ్చిన ఆంజనేయులుగారు ఆధ్యాత్మిక విషయాలు చెప్పేవారు. కొన్నాళ్లు ఆ కబుర్లు వింది. వాళ్ల అబ్బాయి, తల్లితో ఉండే తీరు పార్వతమ్మకి బాగా నచ్చింది. ఆవిడ జీవితంలో కోరుకున్నది అదే. కొడుకు ప్రేమ, ఆదరణ అవే ఆమెకు దక్కలేదు.

పార్వతమ్మకి జబ్బు చేసింది. కొడుకు, కోడలు వచ్చారు. చనిపోయే ముందు నారాయణతో.. 'నారాయణా! నిన్ను ఎట్లా పెంచాలో చేతకాక దూరం చేసుకున్నా! మనింట్లో అద్దెకున్న వాళ్లబ్బాయి, ఆ తల్లీ ఎంత ప్రేమగా ఉంటారు! వాళ్లను చూస్తే ముచ్చటేస్తుంది!' అంది పార్వతమ్మ.

'ఆవిడ జీవితానుభవం వడగడితే చివరకు తేలిన నిగ్గు ఆ రెండు ముక్కలే..' అంటారు కుటుంబరావుగారు నవల చివర్లో.

ఓ తరం జీవితానుభవం 'అనుభవం' నవల. 1970లో వచ్చింది నవల. తరచి చూస్తే, ఈ నవలలో లేనిదేదీ లేదనిపిస్తుంది. అప్పటి సామాన్య గృహిణి జీవిత పరిధిలోకి వచ్చే అన్నివిషయాలూ ఈ నవలలో ఉన్నాయి. పార్వతి కేంద్రంగా సాగిన అద్భుత మనస్తత్వ విశ్లేషణ ఈ నవల. ©



# చతుర ప్ర.జ.

పాఠకుల ప్రశ్నలకు
ప్రవచన వాచస్పతి,
అభినవ వ్యాస టి.కె.వి. రాఘవన్
సమాధానాలు

ప్ర. 'దండనం దశగుణం భవేత్' అన్నారు కదా! వివరించండి?

– బిక్కునూరి రాజేశ్వర్,
ఈడ్‌గాం, ఆదిలాబాద్ జిల్లా

జ. చాలా సంస్కృత శ్లోకాలు సాధారణ పరిభాషల్లో సామెతలుగా, నుడికారాలుగా మారిపోయాయి. వాటిలో ఇదీ ఒకటి. 'దండనం' కాదు. 'దండం'! కర్ర అని అర్థం. 'దండించుట' అని అర్థంలో అల్లరి చేసేవారిని దండిస్తే పదిరకాలుగా బుద్ధివస్తుంది అంటూ వ్యవహారంలో స్థిరపడింది.

విశ్వామిత్రాహి పశుషు కర్దమేషు జలేషుచ
అంధే తమసి వార్ధక్యే దండం దశగుణం భవేత్

ఇదీ అసలు శ్లోకం! చేతిలో ఉండే కర్ర (దండం) పది రకాల ప్రయోజనాలకు (దశగుణం) ఆధారము అవుతుంది. పక్షులు (వి), కుక్కలు (శ్వ), శత్రువులు (అమిత్ర), పాము (అహి), జంతువులు, మృగాలు, (పశుషు) బురద ప్రదేశాల్లో (కర్దమేషు), వాగులు, వంకలున్న మార్గాలలో (జలేషు చ), గుడ్డితనంలో (అంధే), రాత్రి చీకటిలో (తమసి), ముసలితనంలో (వార్ధక్యే)- దండము ఈ పదివిధాలా ప్రయోజనకరంగా ఉంటుంది. అదీ విషయం.

ప్ర. దైవదర్శనానికి వెళ్లి వచ్చేప్పుడు గోవింద నామ స్మరణ చేస్తారు. శవాన్ని ఎత్తుకొని పోయేప్పుడు కూడా 'గోవిందా' అంటారు. దైవదర్శనానికి, మరణానికి ఒకేవిధంగా తలుచుకోవడంలో అంతరార్థం ఏమిటి?

– వెల్మల మణిచందన, కరీంనగర్

జ. 'రామ రామ' అనే మాట ఉంది. ఇది ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని, బాధని, జాలిని, భక్తిని - ఇలా రకరకాల భావాలని సూచిస్తుంది కదా! ఇలాంటివే- 'దేవుడా!' లాంటి పదాలు. 'గోవింద' శబ్దం భగవంతుని సన్నిధిలో పలకడంలో అంతరార్థం ఉంది. ఆఖరికి 'ఆంజనేయ వరద గోవింద' అంటారు హరిదాసులు. ఆంజనేయుడికి, గోవిందుడికి (కృష్ణుడికి) సంబంధం ఉందా? ఇదీ సందేహం. మొదట దీనికి సమాధానం చెప్పుకొని రెండవ భాగానికి సాగుదాం!

గోవింద శబ్దానికి రకరకాల అర్థాలు సంస్కృతంలో ఉన్నాయి. స్వామికి చాలా ఇష్టమైన పేరు అది. 'గోవిందా!' అని నన్ను పిలిచిన ద్రౌపదికి, నేను రుణపడిపోయాను అంటాడు కృష్ణుడు. నిజానికి ఈ పదం 'గవేంద్ర'. విష్ణుపురాణం ప్రకారం కామధేనువు పెట్టిన పేరు. జనాల నోటిలో 'గోవింద' అయింది. అందువలన భగవంతునికి పేరు అది. ఇక రెండవ సంగతి. కాశీలో మృతుని చెవిలో రామ నామంలాగే, గోవిందనామం పలకడం అలవాటు ఉంది. సులభంగా, తప్పులు లేకుండా అందరూ పలికే నామం ఇది. ఈ నామోచ్చారణ వలన మరణించిన జీవునికి సద్గతి కలుగుతుందనే నమ్మకంతో పలుకుతారు. భగవద్గీతను కూడా ఇదే స్థాయికి తేగలిగిన ఘనత మనది!

ప్ర. కవులకు, కళాకారులకు సరస్వతీ కటాక్షమే కానీ, లక్ష్మీ ప్రసన్నం ఉండదంటారు.. కారణం?

– ఎ.ఎల్. సువర్చల,
మన్సూరాబాద్, హైదరాబాద్

జ. నిజమైన కవి పోతనలాంటివారు. నిజమైన ఆచార్యులు వేదాంత దేశికులు. ఇలాంటి వారికి లక్ష్మీకటాక్షం లేక కాదు.. వారు కోరుకోలేదు అంతే! నిజంగా 'సరస్వతీ పుత్రులు' ఏనాడూ ధనం వెంటబడరు. యాదృచ్ఛికంగా ధనం రావచ్చు. దానిని తమకు వినియోగించ

# చతుర ప్ర.జ. 8

ఉత్తమ ప్రశ్నకు రూ.116/-

జిజ్ఞాసువులైన పాఠకుల ఆదరాభిమానాలు అత్యంతంగా చూరగొన్న 'చతుర ప్ర.జ' శీర్షికను నిర్వహించడానికి ప్రవచన వాచస్పతి, అభినవ వ్యాస **టి.కె.వి. రాఘవన్** అంగీకరించారు. ఆచార వ్యవహారాలు.. సంస్కృతీ సంప్రదాయాలు.. పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి మాకు పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జతపరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణనలోకి తీసుకోబోమని గ్రహించ మనవి.

చిరునామా : **చతుర ప్ర.జ.**

చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

కోరు. వెయ్యి సంవత్సరాల క్రిందట తమిళనాట కొంతమంది ఆచార్యులు కోట్లాది రూపాయిల విలువ చేసే తమ ఆస్తులని అవలీలగా త్యాగం చేసి, సాధారణమైన బతుకు గడిపినట్లు చరిత్రలున్నాయి. అది ఆనాటి మాట! ఆధునిక యుగంలో 'సరస్వతీ రూపులుగా' చెప్పబడేవారు లక్ష్మీకటాక్షం పొందడం లేదన్నది సత్యదూరం. ఈనాడు మాత్రం సరస్వతీ కటాక్షాన్ని బ్రాండ్‌గా వాడుకొంటూ, కోట్లు దండుకునేవారే ఎక్కువగా ఉంటున్నారు. నిజంగా సరస్వతీపుత్రులు, వాచస్పతులు 'లక్ష్మి'కి దూరంగానే ఉంటున్నారు.

*ప్ర. శూర్పణఖ లాంటి చెల్లెలు, మంథర లాంటి చెలికత్తె, శకుని లాంటి మామ ఉండకూడదంటారు ఎందుకు?*

– ***యం. మీనాక్షి,*** *సూర్యాపేట, నల్గొండ జిల్లా*

**జ.** ఆ పేర్లలోనే అసలు సంగతి ఉంది. ఆ పేర్లు ఎవరూ పెట్టుకోరేం! కారణం వారి పాత్రలు చూస్తే తెలుస్తుంది. రావణుడు ఎప్పటివాడు! రామాయణం ప్రకారం దశరథునికి కనీసం మూడుతరాల ముందువాడు. దశరథుడే అరవై వేల సంవత్సరాలు బ్రతికాడు. ఆనాటి రావణునికి చెల్లెలు వయసు ఎంత ఉంటుందో ఆలోచించండి! శూర్పణఖ అడవిలో చూచేనాటికి రాముని వయసు సుమారు 38 సం. ఆయనని ఈ 'ముసలావిడ' మోహించి, కామరూపం ధరించింది. మరి ఆ చెల్లెలి వల్లే లంక నేలమట్టం అయింది. రాక్షసజాతికి ప్రమాదం వచ్చింది. ఇక మంథర వల్ల పాలకుండ లాంటి అయోధ్య పరిపాలన కాస్తా రాజులేక, యువరాజు లేక పద్నాలుగు సంవత్సరాలు అనాథ అయింది. మేనమామ తండ్రి తరువాత తండ్రి అంతటివాడు. అన్న తర్వాత స్నేహితుడిలా, శ్రేయోభిలాషిలా ఉండాలి. మరి జరిగిందేమిటి? మాయాజూదం ఫలితం పద్దెనిమిది అక్షౌహిణులు నాశనం అయ్యాయి. మరి అలాంటి చెల్లెలు, చెలికత్తె, మేనమామ కావాలని ఎవరూ కోరుకోం కదా!

*ప్ర. దానధర్మాలు మనిషిని ఎంతవరకు కాపాడతాయి? ఏమాత్రం దానం చేయని, ధర్మం ఆచరించని మనుషులు అష్టఐశ్వర్యాలతో ఆనందించడం ఎలా సాధ్యపడుతోంది?*

– ***టి.వి.డి.ఎన్. సీతారామారావు,*** *కొత్తగూడెం, ఖమ్మం జిల్లా*

జ. దానం, ధర్మం, యజ్ఞం వగైరా మనిషి మనుగడకి పరమార్థం కలిగిస్తాయి. పాపాలని నశింపచేయవుగానీ, వాటి ప్రభావాన్ని తగ్గిస్తాయి. మనిషిని పవిత్రం చేస్తాయి. నెలరోజులు పనిచేస్తే ఒకరోజు జీతం అందుకొంటున్నాం. ఇది తరువాతి నెలలో ఖర్చు చేస్తున్నాం. ఖర్చు చూచే వారికి ముందు నెలలో కష్టం కనిపిస్తుందా! అలాగే ఈ జన్మలో ఐశ్వర్యంతో తులతూగుతున్నాడు అంటే -గతంలో పుణ్యమే కారణం అని పురాణాలు చెబుతున్నాయి. ముష్టివాడిలా బోధచేస్తాడట 'నేను ముష్టి ఎత్తడానికి వచ్చి భిక్ష అడగటం లేదు. నీకు శిక్షణ ఇవ్వడానికి వచ్చా. ధర్మం చేయక నాలా మారవద్దు. ఎదుటివానికి ఇంతపెట్టి నీవు నీలాగే.. ఇలాగే ఐశ్వర్యంతో ఉండూ-' అని. చూచారు గదా!

*ప్ర. ఎవరైనా గోమాంసం తిన్న ఘటనలు పురాణాల్లో ఉన్నాయా? గతంలో బ్రాహ్మణులు తినేవారా? తింటే ఎప్పుడు ఆగిపోయింది?*

– ***తటవర్తి రామకృష్ణ,*** *తాళ్లగడ్డ, హైదరాబాద్*

**జ.** మాంసభక్షణ ఎప్పుడూ నిషేధమే! ఎవరు ఏ మాంసం (ఏ జంతువుది) ఎప్పుడు తినవచ్చు

# రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

ప్ర. శ్రీరామచంద్రునికి వాలికి ఏవిధమైన వైరమూ లేదు. అలాంటప్పుడు వాలిని ఎందుకు వధించాడు?

**– తలారి బలరామ్,** కానూరు, కృష్ణా జిల్లా

జ. వాల్మీకి రామాయణం కిష్కింధ కాండలో ఈ ప్రశ్న వాలి స్వయంగా రాముడిని అడిగాడు. రాముడు సమాధానమిచ్చాడు. వాలి తృప్తిపడ్డాడు. రాముడు కోసలదేశ రాజ ప్రతినిధి. వాలి కోసల దేశపు సామంతుడు. స్వతంత్ర ప్రతిపత్తిగల సామంతుడు. వాలి చేసిన తప్పులు.

1. రాజద్రోహం: తన రాజు దశరథుడు లేదా కోసలరాజు. కానీ వాలి సంధి/మైత్రి చేసుకున్నది పరదేశీయుడైన రావణునితో.

2. భ్రాతృద్రోహం: తన తమ్ముడైన సుగ్రీవుని భార్యను అపహరించాడు. రాజ్యాన్ని హస్తగతం చేసుకున్నాడు. యువరాజ పదవి కూడా ఇవ్వకుండా సుగ్రీవుని బయటకు గెంటాడు.

3. ఋషిద్రోహం: తన ప్రాంతంలో మతంగుని అవమానించాడు. ఇతర ఋషులను ఇబ్బందులు పెట్టాడు. రావణ, ఖర, దూషణాదులను, పరివారాన్ని మాటమాత్రంగానైనా నివారించలేదు.

4. వైదికద్రోహం: సంధ్యావందనాది వైదిక ధర్మాలు పాటిస్తూ, దుర్మార్గులతో చేతులు కలిపాడు. రావణుడు శివార్చనాశీలుడే కానీ ఇతరుల భార్యలను ఎత్తుకురావడం వైదిక సమ్మతం కాదుకదా! ఆఖరుకి రావణునితో సంధి ఒప్పందంలో ధనం, సంపద, రాజ్యంతో పాటు స్త్రీలు కూడా ఉమ్మడిగా అనుభవయోగ్యమన్నాడు. ఇది ఏ సమాజమూ అంగీకరించదు కదా!

5. సమాజద్రోహం: ప్రభువు బరితెగిస్తే అనుయాయులూ అదే చేస్తారు. ప్రజలూ అలాగే మారుతారు. సుగ్రీవుని తరిమేసి అతని భార్య రుమను వాలి అధీనం చేసుకున్నాడు. వాలి అనుయాయులు కూడా తమ కంటే బలహీనులు, సుగ్రీవుని సానుభూతిపరుల భార్యలను వశం చేసుకున్నారు. ఆఖరికి సైనికన్యాయం ప్రకారం కూడా తమ దేశంలోని వాడు శత్రుదేశంతో చేయికలిపితే విచారణ లేకుండా మరణదండన విధించాలని నియమం. ఇవి రామాయణం చెప్పకపోయినా విశ్లేషించుకుంటే దొరికే కారణాలు. అందువల్ల వాలివధలో రామునికి అపవాదు రాదు.. లేదు.

---

నిషేధాలు ఏమిటో స్మృతి గ్రంథాలు, పురాణాలు, వేదాలు చెప్పాయి. పొరపాటునో గ్రహపాటునో నర, గోమాంసాలు తిన్న సందర్భం, దాని వలన అనర్థాలు, శాపాలు, ప్రాయశ్చిత్తాలు, పునర్జన్మలు, పాప ప్రక్షాళనలు - వీటికి పురాణగాథలలో ఆధారాలున్నాయి.

అసలు గోమాంస భక్షణ కాదు, గోహింస అనగా పడుకొని ఉన్న ఆవును తన్నడః కూడా పాపమని, కాడికి రెండు ఎద్దులు కట్టి దున్నితే అది రాక్షస కర్మ అని అథర్వ, యజుర్వేదాలు వివరించాయి. గోమాంసం తినే స్థాయికి భారతీయులు, అందునా బ్రాహ్మణులు దిగజారలేదు. గోమాంస భక్షణం ఎప్పుడూ నిషేధమే.

ప్ర. తల్లి దండ్రులు బతికున్నప్పుడు వారిని బాగా చూడకుండా చనిపోయాక క్రమం తప్పకుండా తద్దినాలు పెడుతుంటారు కొందరు. దీనివల్ల వారి ఆత్మ శాంతిస్తుందా?

**– నేమాన సుభాష్‌చంద్రబోస్,** విశాఖపట్నం

జ. పిల్లిని చంపిన పాపం పాపమే. గుడి కట్టిన పుణ్యం పుణ్యమే- రెండూ కలపడానికి వీల్లేదు అంటారు పెద్దలు. పుణ్యం.. పాపం వేటికి అవే! తద్దినాలని 'శ్రాద్ధము' అంటారు. బతికినపుడు బాగా చూసుకొని, మరణించిన తరువాతా అంత గౌరవంగా తద్దినం పెట్టే పిల్లలు ఉండటం పూర్వజన్మ పుణ్యఫలం. తండ్రి కోసం, రాజ్యమూ, తనజీవితమూ గడ్డిపరకలా వదిలినవాడు భీష్ముడు. శ్రాద్ధకర్మ చేస్తోంటే పిండప్రదాన వేళ తండ్రి శంతనుడు స్వయంగా చేయిచాచి పిండాన్ని అందుకోబోయాడు. కానీ భీష్ముడు ఆ చేతిని పక్కకి తొలగించి, దర్భలపై ఉంచారు. దేవతలు పూలవాన కురిపించారు. ఇది భారతగాథ!

తల్లితండ్రులని చూడని పాపం పితృశాపంగా ఫలితమిస్తుంది. శ్రద్ధగా చేసిన పిండ ప్రదానాదుల వలన కొన్నిరకాల సుఖాలు లభించవచ్చు అంతే! కానీ ఒక్కమాట తల్లిదండ్రులని బాగా చూడకుండా, తరువాత పిండాలు అందించడం దంభం, మోసం. ©

భామనే.. సత్యభామనే..! 19

# ఆ 'కట్టు' కొనే అందాలు!



టెన్నిస్ క్రీడాకారిణి సానియామీర్జా



బ్యాడ్మింటన్ క్రీడాకారిణి గుత్తాజ్వాల



టెన్నిస్ క్రీడాకారిణి
సానియామీర్జా



చెస్ క్రీడాకారిణి
కోనేరు హంపి



బ్యాడ్మింటన్ క్రీడాకారిణి
పి.వి. సింధు



బ్యాడ్మింటన్ క్రీడాకారిణి
సైనా నెహ్వాల్

ఎపుడూ చిట్టిపొట్టి దుస్తులతో చెమటలు కక్కుతూ కనిపించే ఈ క్రీడాకారిణులను ఇలా భారతీయ సంప్రదాయ వస్త్రాలలో చూస్తోంటే ముచ్చటేస్తోంది కదూ! కాస్త వెరైటీగా ఉండాలని పించిందేమో ఈ ముద్దుగుమ్మలకు.. ఇలా ఫ్యాషన్ షోలలో, ఫంక్షన్స్‌లో చీరెకట్టుతో తళుక్కుమన్నారు. ఎంతైనా భారతీయ మహిళల చీర అందం వర్ణనాతీతమని మీరూ ఒప్పుకుంటారు కదూ!

ఫోటోలు: అంతర్జాలం సౌజన్యంతో...

# కల్తీ కనుక్కోవడమెలా?



ప్రతి ఆహారపదార్థంలోనూ కల్తీ జరుగుతోంది నేడు. చూడ డానికి ఏమాత్రం తేడా కనిపించదు. కల్తీ పదార్థాలను దీర్ఘకాలంగా తీసుకోవడం వల్ల జీర్ణసమస్యలు, కాలేయ సమస్యలు, కీళ్లనొప్పులు వంటి ఆరోగ్య సమస్యలు ఎదు రౌతాయి. ఇంట్లోనే చిన్న చిన్న పరీక్షల ద్వారా ఆయా ఆహారపదార్థాలు స్వచ్ఛమైన నవా కల్తీవా? అనేది ఎలా కనుక్కోవచ్చో చూద్దాం..

**పసుపు**

ఇరవై మిల్లీలీటర్ల గోరువెచ్చని నీటిలో సగం చెంచా పసుపు కలపాలి. దానిలో నాలుగైదు చుక్కల నిమ్మరసం లేదా అందుబాటులో ఉన్న ఏదైనా యాసిడ్‌ను వేయాలి. అపుడు అది గులాబి, వంగ రంగుల్లోకి మారితే ఆ పసుపు కల్తీదని అర్థం. ఇలాంటి పసుపు దీర్ఘకాలం వాడడం వల్ల జీర్ణ సమస్యలు వస్తాయి.

**కాఫీ**

కాఫీపొడిలో చింతగింజలు, చికోరి పొడి కలుపుతారు. నీళ్లపై కాఫీ పొడి చల్లాలి. కొన్ని క్షణాల్లోనే కాఫీ తేలుతుంది. చికోరి పొడి నీళ్ల అడుగుభాగానికి చేరుతుంది. అంతేకాదు నీళ్ల రంగు కూడా మారుతుంది. కల్తీ కాఫీపొడితో డయేరియా, జీర్ణసమస్యలు, తల తిరుగుడు, తీవ్రమైన కీళ్ల నొప్పులు వచ్చే ప్రమాదముంది.

**తేనె**

తేనెలో కార్న్ సిరప్, పంచదార పొడి, నీళ్లు కలుపుతారు. కొద్దిగా దూదిని తీసుకుని తేనెలో ముంచాలి. స్వచ్ఛమైన తేనె అయితే దానికి మంట అంటించగానే దూదితో పాటు తేనె పూర్తిగా కాలుతుంది. నీళ్లు కలిపినదైతే చిటపట లాడుతూ మంట ఆరిపోతుంది.

**మిరియాలు**

వీటిలో బొప్పాయి గింజలు కలుపుతారు. కొద్దిగా మిరియాలు ఆల్కహాల్లో వేయాలి. కాసే పటికి మిరియాలు మునిగి, బొప్పాయి గింజలు మాత్రం పైకి తేలుతాయి. బొప్పాయి గింజలు తింటే కాలేయ, జీర్ణసమస్యలకు దారితీస్తాయి.

**ఐస్‌క్రీమ్**

ఐస్‌క్రీమ్‌లో మృదుత్వం, చక్కని తెలుపు కోసం సర్ఫ్ కలుపుతారు. ఐస్‌క్రీమ్ మీద నాలు గైదు చుక్కల నిమ్మరసం వేయాలి. అపుడది పొంగుతూ బుడగలు వస్తే అందులో సర్ఫ్ కలిసినట్లు. దీనివల్ల కాలేయం పనితీరులో అసమతుల్యం ఏర్పడుతుంది.

**పచ్చి బఠాణి**

కొన్ని పచ్చిబఠాణీ గింజలు తీసుకుని బ్లాటింగ్ పేపర్‌పై వేయాలి. ఆ కాగితంపై రంగు అంటుకుంటే అవి రంగు వేసినవని గుర్తించాలి. వీటిని ఎక్కువకాలం తినడం వల్ల క్యాన్సర్ సంబంధిత సమస్యలు వస్తాయి.

**పంచదార**

పంచదారలో చాక్‌పీస్ పొడి, యూరియా కలుపుతారు. కొద్దిగా పంచదారను గ్లాసు నీళ్లలో కలపండి. అపుడు అమ్మోనియా వాసన వస్తే దానిలో యూరియా కలిపినట్లు. పదిగ్రా ముల పంచదార గ్లాసు నీళ్లలో కలిపినపుడు అడుగుభాగానికి తెల్లటి పొడి చేరితే చాక్‌పీస్ పొడి కలిపినట్లు.

# జతపరచండి

19వ శతాబ్దంలో ప్రధానమంత్రులుగా పనిచేసిన ఈ మహిళలు
ఏ దేశానికి చెందినవారో గుర్తించగలరేమో చూడండి..

| | | | |
|---|---|---|---|
| 1. | గోల్డా మీర్ | ఎ. | బంగ్లాదేశ్ |
| 2. | మార్గరెట్ థాచర్ | బి. | న్యూజిలాండ్ |
| 3. | బెనజీర్ బుట్టో | సి. | ఇజ్రాయిల్ |
| 4. | ఎడిత్ క్రెస్సెన్ | డి. | యుగోస్లేవియా |
| 5. | యుజినియా చార్లెస్ | ఇ. | పాకిస్తాన్ |
| 6. | హెలెన్ క్లార్క్ | ఎఫ్. | డొమినికా |
| 7. | బేగం ఖలేదా జియా | జి. | బ్రిటన్ |
| 8. | మిల్కా ప్లానిన్క్ | హెచ్. | ఫ్రాన్స్ |

జవాబులు ఈ సంచికలోనే.. కూర్పు : కావ్య




**ఎపుడు చదివావురా?**

రవి: అరేయ్! పోయినేడాది నీ ఇంటిముందు 'రతన్‌సింగ్, బి.ఎ.' అనే బోర్డు తగిలించావు. ఈ సంవత్సరం 'రతన్ సింగ్ ఎమ్.ఎ.' అని బోర్డు పెట్టావు.. ఎమ్.ఎ. ఎపుడు చదివావురా నువ్వు?



రతన్ సింగ్: నువ్వు సరిగా అర్థం చేసుకోలేదురా. కిందటి సంవత్సరం నా భార్య చనిపోయింది. అందుకే 'బ్యాచిలర్ ఎగెయిన్' అనేందుకు బి.ఎ. అని పెట్టాను. ఈ సంవత్సరం మళ్లీ పెళ్లి చేసుకున్నాను కాబట్టి 'మేరీడ్ ఎగెయిన్' అనేందుకు ఎమ్.ఎ. అని పెట్టుకున్నాను.

**మతిమరుపు కదా!**

ప్రతి విషయం తన మిత్రుడికి చెప్తుంటాడు దయాకర్.



దయాకర్: నా పాస్‌వర్డ్ ఇన్‌కరెక్ట్ అని పెట్టానురా.

మిత్రుడు: అదేంటిరా! అలా ఎందుకు పెట్టుకున్నావు!?

దయాకర్: నాకు ఏవీ సరిగ్గా గుర్తుండవు కదరా.. తప్పు పాస్‌వర్డ్ కొట్టినపుడు ఇన్‌కరెక్ట్ అనే మెసేజ్ వస్తుంది కదా, అది చూసినపుడు నాకు గుర్తొస్తుందని!

**ఏదైనా కంపెనీయా?**



దురదతో వచ్చిన ఓ పేషెంటుతో..

డాక్టర్: ఏ సబ్బు వాడతావు?

పేషెంటు: బజరంగ్ సబ్బు, బజరంగ్ పేస్టు, బజరంగ్ బ్రష్..

డాక్టర్: బజరంగ్ ఏదైనా కంపెనీ పేరా?

పేషెంటు: కాదు, బజరంగ్ నా రూమ్మేట్.

# పిల్లలు మెచ్చే క్యారెట్ వంటకాలు

**చిటికెలో రుచిగా..!**

## క్యారెట్ షర్బత్

### తయారుచేసే విధానం

ముందుగా క్యారెట్ తురుముకోవాలి. ఈ తురుములో యాలకులు వేసి మిక్సీ పట్టాలి. పాలు వేడిచేసి అందులో పంచదార, ఈ మిశ్రమం వేసి పదినిమిషాలు ఉడకబెట్టాలి. చల్లారాక ఫ్రిజ్‌లో పెట్టాలి. కూల్ అయ్యాక తాగాలి. దీన్ని పిల్లలు బాగా ఇష్టపడతారు.



### కావలసిన పదార్థాలు

- పాలు - నాలుగు గ్లాసులు
- క్యారెట్‌లు - 5
- పంచదార - 6 స్పూన్లు
- యాలకులు - 3

## క్యారెట్ పాయసం

### కావలసిన పదార్థాలు

- క్యారెట్ - అరకిలో
- పచ్చికొబ్బరి - ఒక చిప్ప
- పాలు - పావులీటరు
- పంచదార - పావుకిలో
- నెయ్యి - ఒక స్పూను
- జీడిపప్పు, కిస్‌మిస్- తగినన్ని

### తయారుచేసే విధానం

ముందుగా కొబ్బరిచిప్పను తురుముకోవాలి. క్యారెట్ పైచెక్కు తీసి చిన్నముక్కలుగా తరిగి ఉడకబెట్టాలి. ఉడికిన ముక్కలు చల్లారాక, అందులో కొద్దిగా పాలు పోసి మిక్సీ పట్టుకోవాలి. తర్వాత మందపాటి గిన్నెలో మిక్సీపట్టిన క్యారెట్ ముద్ద, కొబ్బరితురుము, పంచదార వేసి, మిగిలిన పాలు కూడా అందులో పోసి స్టౌ మీద పెట్టి కలియబెడుతూ ఉండాలి.



మరోవైపు నెయ్యిని వేడిచేసి జీడిపప్పు, కిస్‌మిస్‌లు వేయించి పాయసంలో వేసి కలపాలి. ఆ మిశ్రమం ఉడికి దగ్గరకు వచ్చాక స్టౌ కట్టేయాలి. అంతే క్యారెట్ పాయసం రెడీ! ఇది పిల్లలకు బలవర్థకమైన ఆహారం.

**జతపరచండి? జవాబులు :** 1. సి, 2. జి, 3. ఇ, 4. హెచ్, 5. ఎఫ్. 6. బి, 7. ఎ, 8. డి

## చిట్కాలక్ష్మి

- ఉప్పుతో రుద్దితే, కప్పులకు అంటుకుపోయిన కాఫీ, టీ మరకలు మాయమై తళతళా మెరుస్తాయి.
- వెండి, బంగారు ఆభరణాలు శుభ్రం చేయడానికి చన్నీళ్లకు బదులు వేడినీళ్లు వాడితే త్వరగా మురికి వదులుతుంది.
- లెదర్ హ్యాండ్‌బ్యాగులను నిమ్మకాయ ముక్కతో రుద్ది మెత్తటి బట్టతో తుడిస్తే కొత్తవాటిలా కనిపిస్తాయి.



అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**కొల్లూరి నాయుడమ్మ**

రామమందిరం రోడ్,

ఇంకొల్లు,

ప్రకాశం జిల్లా

పిన్ : 523167

## చతురంగం - 53 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 కే | 2 శ | వ | 3 రా | వు | | 4 రా | 5 నా | | 6 బ |
| 7 త | రం | | ఘ | | 8 సై | | 9 య | శ | స్సు |
| నం | | 10 వి | వి | 11 వి | నా | 12 య | క్ | | యా |
| | 13 న | త్తు | | ఐ | | త్నం | | 14 మా | త్ర |
| 15 ఆ | ది | | 16 ఓ | పి | 17 క | | 18 కా | య | |
| లా | | 19 క | రి | | 20 దా | 21 హా | ర్తి | | 22 కా |
| 23 ప | 24 తి | | 25 మి | 26 నీ | | 27 సం | కే | 28 త | ము |
| 29 న | ర | 30 కం | | 31 లాం | స | | 32 య | మ | కం |
| | 33 గ | బ | 34 గ | బ | | 35 జ | | స్సు | |
| 36 తొ | లి | | 37 స | రి | గ | మ | లు | | 38 ఓం |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. సి. భారతి, మన్సూరాబాద్, 2. మాడభూషి శేషమ్మ, బాగ్అంబర్‌పేట్, 3. సముద్రాల సంతోష్‌కుమార్, కొడిమ్యాల, కరీంనగర్ జిల్లా, 4. నోరి శివప్రకాశం, నెల్లూరు, 5. ఎస్. శ్రీహరి, బెంగళూరు, 6. బచ్చు సత్యనారాయణ, కొత్తగూడెం, 7. కె.వి. దుర్గామోహనరావు, వనస్థలిపురం, 8. అనంతుల స్వరూపరాణి, గుంటూరు, 9. పి.బి. సీతాదేవి, నరసాపురం, 10. అల్లూరి ఉమ, సింగరాయకొండ, 11. ఆర్. భారతి, ఎమ్మిగనూరు, 12. పప్పు శ్రీదేవి, అమలాపురం, 13. మహావాది అశోక్‌కుమార్, చిక్కడపల్లి, 14. యు. చిట్టిబాబు, న్యూ పాల్వంచ, 15. ఎల్. రేణుక, చందుపట్ల, నల్గొండ జిల్లా, 16. తోటపల్లి శశికళ, గుంతకల్లు, 17. కోకా శైలజ, ఇ.సి.ఐ.ఎల్., 18. పి. దేవసేనమ్మ, హైదరాబాద్, 19. డా.సి. జనార్దనసింగ్, నల్లకుంట, 20. జి. ముత్తుమారన్, చర్లపల్లి, 21. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, 22. కన్నేపల్లి నారాయణమూర్తి, జీడిమెట్ల, 23. సి. నిర్మల, తిరుపతి, 24. విన్నకోట పద్మావతి, సఫిల్‌గూడ, 25. ధరణి పద్మాసన, నల్లకుంట, 26. చింతపల్లి నాగేశ్వరరావు, ప్రసాదంపాడు, కృష్ణా జిల్లా, 27. ఎస్.టి.పి. కృష్ణమాచార్యులు, నాగోల్, 28. పొన్నపల్లి వెంకటప్పయ్య, సరూర్‌నగర్, 29. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 30. టి. ఉషశ్రీ, నెల్లూరు, 31. పి.వి. రవికుమార్, తిరుపతి, 32. సి. రాజేశ్వరి, ఎ.ఎస్. రావునగర్, 33. టి.ఎల్.ఆర్. ప్రసాదరావు, మచిలీపట్నం, 34. అడపా సత్యనారాయణ బాబ్జీ, కూకట్‌పల్లి, 35. కొత్తపల్లి సుధాదేవి, పేరాల, 36. మొహమ్మద్ ఖాసిం, కల్లూరుగూడెం, ఖమ్మం జిల్లా, 37. సి.హెచ్. శివశంకర శాస్త్రి, లింగంపల్లి, 38. గోమఠం రోహిణి, బేగంపేట, 39. అత్తిలి కస్తూరిబాయి, తిరుపతి, 40. కె. కళ్యాణి, ప్రొద్దుటూరు, 41. డా. శివభూషణం, కర్నూలు, 42. యస్. శశికుమార్, విజయవాడ, 43. పి. సుజాతశాస్త్రి, గుంటూరు, 44. వానపల్లి వెంకటసత్య గంగరాజు, విశాఖపట్నం, 45. మండవ రవికుమారి, కొత్తగూడెం, 46. పసుమర్తి జయశ్రీ, హైదరాబాద్, 47. వి.ఆర్.కె. అల్లమరాజు, కాట్రేనికోన, 48. ముడుంబ సీత, భద్రాచలం, 49. వి. మురళీకృష్ణ, పుంగనూరు, చిత్తూరు జిల్లా, 50. గరికిపాటి రాజాదత్తాత్రేయ, కాకినాడ, 51. పి. నాగేశ్వరి, తుని, 52. పరుచూరి భవానీదేవి, గుంటూరు, 53. బిక్కునూరి రాజేశ్వర్, ఈద్‌గాం, ఆదిలాబాద్ జిల్లా, 54. పి.ఆర్. నాయుడు, తిరుపతి, 55. జి. రాజ్యలక్ష్మి, కూకట్‌పల్లి, 56. జి. శోభ, తిరుపతి, 57. ఎం. పల్లవి, బోరబండ, 58. ఎ. రంగనాథం, బెంగళూరు, 59. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 60. వి. రమాదేవి, బెంగళూరు, 61. జె. జయశ్రీ, ట్రూప్‌బజార్, 62. సి. అల్వాల్‌రెడ్డి, సరూర్‌నగర్, 63. ఓలేటి కస్తూరి, పార్వతీపురం, 64. యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి, 65. జి. ప్రసాద్, తెనాలి, 66. గండ్లూరి బలరామశాస్త్రి, నాచారం, రంగారెడ్డి జిల్లా, 67. ఎం. అరుణరేఖ, ఎల్.బి. నగర్, 68. తటవర్తి రామలక్ష్మి, తార్నాక గడ్డ, హైదరాబాద్, 69. వేదుల నరసింహమూర్తి, గుడిమల్కాపూర్, 70. ఆర్.వి.సి.హెచ్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 71. రామకూరు లక్ష్మి, శ్రీకాకుళం, 72. పి.వి. రమణారావు, మల్కాజిగిరి, 73. నియాజ్ అలి, ఉప్పరపల్లి, హైదరాబాద్, 74. గుర్రాల ప్రదీప్, కూర్మన్నపాలెం, వైజాగ్, 75. బండెల ప్రణవ్, ఉయ్యూరు, 76. ఎన్. ప్రేమలత, హైదరాబాద్, 77. పెద్ది దత్తాత్రేయ, రేచిని, ఆదిలాబాద్ జిల్లా, 78. ధప్పూరి సుధాదేవి, సీతారాంబాగ్, 79. కరి అమ్మయ్యచౌదరి, ఇంకొల్లు, ప్రకాశం జిల్లా, 80. చందు తులసి, శ్రీకాకుళం, 81. పాలగుమ్మి విశ్వనాథం, ఒంగోలు, 82. డి. రామరాజు, మెరకముడిదాం, విజయనగరం జిల్లా, 83. వి. ఇందిరా సుబ్రమణ్యం, సోమాజిగూడ, 84. ఇ.ఎల్. నరసింహారావు, మధిర, 85. తాయ్యేటి వెంకటసూర్యం, విశాఖ, 86. పి. సీతారత్నం, నర్సాపురం, 87. కోలా సత్యనారాయణ, విశాఖపట్నం, 88. కాకర్లమూడి కృష్ణప్రసాద్, తణుకు, 89. ఇయ్యుణ్ణి రోహిణి, తణుకు, 90. సూరి నాగరాజు, బెంగళూరు, 91. ఆంద్ర అచ్యుతరామయ్య, తణుకు, 92. కూనిశెట్టి సూరిబాబు, ప్రత్తిపాడు, తూ.గో. జిల్లా, 93. నున్న వెంకట సత్యనారాయణమూర్తి, యర్రవరం, తూ.గో. జిల్లా, 94. నున్న లక్ష్మి, యర్రవరం, 95. ఎస్.వి.వి.ఎస్. పద్మావతి, కాకినాడ, 96. మద్దూరి లక్ష్మీరాజ్యం, ఎర్రగడ్డ, 97. కస్తూరి వెంకబాబు, గుంటూరు, 98. జి.వి.వి. సత్యనారాయణ, బౌరంపేట, హైదరాబాద్, 99. పి.వి.ఎల్.ఎన్. సూర్యసంతోష్, కొత్తపేట, 100. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 101. కనకల అప్పారావు, విజయవాడ, 102. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 103. చివుకుల నాగమణి, రాజమండ్రి, 104. ఎస్. రవికిరణ్, విజయవాడ, 105. ఎ. రామకృష్ణ, జీడిమెట్ల, 106. వి. యాదవ (..128లో)

# చతురంగం - 54 ఆధారాలు

**అడ్డం :**

1. నాణాలు తయారుచేసే కేంద్రం (4)
4. కేంద్ర బిందువు (5)
8. గుచ్ఛం (2)
9. ఓర్పు, సహనం (2)
10. వాదించేవాడు (2)
11. శరం (2)
12. మగకోడి (2)
13. ఆవు (2)
14. బాబాకు ఇష్టమైనవి శ్రద్ధ - - - అటునుంచి (3)
16. కాలం కలిసి రాకుంటే - - పామవుతుంది (2)
17. పల్లం (2)
18. పెత్తనం (3)
20. ప్రాణాల్ని ఇలా కూడా అనొచ్చు (4)
22. పొలాలు (2)
23. పచారీ కొట్టు (3)
25. గౌరవం, మర్యాద (3)
26. మన్మథుడు (4)
28. వేసవిలో నీళ్ల పోసుకునేవి. సన్నని మూతితో పొడవుగా ఉండే మట్టిపాత్రలు (3)
30. కంచిలో కొలువైన అమ్మవారు (3)
32. 'రమ'ను పిలవండి (2)
33. 'కాదు'కు వ్యతిరేకం (3)
34. ఉత్సవం (3)
36. మిల్కీబ్యూటీ (3)
37. కొడుకు భార్య (3)

**నిలువు :**

1. ఆంధ్రరాష్ట్ర తొలి ముఖ్యమంత్రి ఇంటి పేరు (4)
2. కరవాలం (2)
3. గుణం లాంటిదే, గుర్తు, ఆనవాలు (3)
5. సంప్రదాయం, ఆనవాయితీ (3)
6. మనస్సు (2)
7. బిచ్చగాడికి కాస్త గౌరవపదం (3)
11. 'భాషలు' కు వికృతి, హామీలు (3)
12. కురుపు, వ్రణం (2)
13. అడ్డం 13కి బహువచనం గందరగోళం (3)
15. సాలీళ్లతో ఇంటికి పట్టేవి (3)
17. 'వయొలిన్'కు తెలుగు (4)
19. లేతకు వ్యతిరేకం (3)
21. పిసినారి (3)
22. 'విజయవిలాసం' కృతికర్త ఇంటిపేరు (4)
24. కాకి ఏమని అరుస్తుంది? (4)
25. అనేకం (2)
26. కన్ను (2)
27. సీతారామలక్ష్మణులను నదిని దాటించినవాడు (3)
29. అల్లుడు (3)
31. చేసేపని వద్దని చెప్పటం (3)
33. '- - హజారే' ముందు పదం (2)
34. చేతికి, కాలికి ఉండేది (2)
35. కోతి, వానరం (2)

(127వ పేజీ తరువాయి...)

లక్ష్మి, వరంగల్, 107. ఆమంచర్ల సరస్వతి, హైదరాబాద్, 108. కె. చంద్రశేఖర శర్మ, నంద్యాల, 109. సిహెచ్.వి.ఎస్.ఎల్. రాజేశ్వరి, కాకినాడ, 110. దేవరాజు వెంకట నరసింహారావు, చైతన్యపురి, 111. అవధూత అన్నపూర్ణ, శేరిలింగంపల్లి, 112. ఎ. అరుంధతి, పుణె, మహారాష్ట్ర, 113. తోకల నారాయణరావు, మచిలీపట్నం, 114. వై.వి. విజయకుమార్, విజయనగరం, 115. యం.వి.యస్. ధనలక్ష్మి, నరసాపురం, 116. మహమ్మద్ అఫ్సురా పలీష, ద్వారపూడి, తూ.గో. జిల్లా, 117. డి. పద్మజ, సూర్యాపేట, 118. కె. లక్ష్మీనారాయణ, నిజామాబాద్, 119. ఎస్. విజయలక్ష్మి, ఒంగోలు, 120. నందం గాయత్రీదేవి, బొండాడ, ప.గో. జిల్లా, 121. డా. ఉప్పల వెంకటరమణయ్య, కడప, 122. బి.వి. నరసింహారావు, పేరాల, ప్రకాశం జిల్లా, 123. పి.వి. రమణారావు, విశాఖ, 124. కె.వి. రమణ, హైదరాబాద్, 125. బి. రామమోహన్‌రావు, హైదరాబాద్, 126. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి, 127. డి. రామారావు, ఆదిలాబాద్, 128. శ్రీదాస్యం లక్ష్మయ్య, హుస్నాబాద్, 129. మాచన్న, కళ్యాణదుర్గం, 130. కె.వి.ఎస్.ఎన్. మూర్తి, హైదరాబాద్, 131. లింగబత్తుల భవ్యశ్రీ, ఆర్.సి. పురం, 132. తల్లాప్రగడ సుందరరామయ్య, రాజమండ్రి, 133. ఉపద్రష్ట నరసింహమూర్తి, లాలాపేట, 134. వారణాసి విజయలక్ష్మి, పొడగట్లపల్లి

# చతురంగం - 54

రూ.150/- బహుమతి

గడువు తేది : సెప్టెంబరు 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | ■ | 4 | 5 | 6 | | 7 ఢి |
| 8 | | ■ | 9 | | ■ | 10 | | ■ | |
| | ■ | 11 | | ■ | 12 | | ■ | 13 | |
| 14 | 15 బూ | | ■ | 16 | | ■ | 17 | | ■ |
| ■ | 18 | | 19 | ■ | ■ | 20 | | | 21 లు |
| 22 | | ■ | 23 | 24 | | ■ | | ■ | |
| | ■ | 25 | | | ■ | 26 | | 27 | |
| 28 | 29 జూ | | ■ | 30 | 31 | | ■ | | ■ |
| 32 | | ■ | 33 | | | ■ | 34 | | 35 |
| ■ | 36 | | | ■ | 37 | | | ■ | |

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (      ) చిరునామా : ----------------------------------------

----------------------------------------

---------------- పిన్ : ------------ ఫోన్ : ------------

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు.

చిరునామా : చతురంగం **చతుర**, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ext : 6658, 6532

ఈ నెల విపుల

# హిందీ కథల ప్రత్యేకం

భర్త తలుపులు విరిగేలా బాదుతుండటంతో ఆమె గుండెల్లో రాయిపడింది. కష్టపడి మాజీ ప్రియుడ్ని దాచింది గానీ భర్త కంటపడ్డాడతడు. అయితే అతడు ఓ రహస్యం చెప్పాడు. ఇంతకీ ఏమిటా రహస్యం? చదవండి హిందీ కథాశిల్పి ప్రేమ్‌చంద్ కథ **పాతపరిచయం**

రెప్పలు మూతపడుతున్న సమయంలో ఎవరో బరువుగా మీద వాలినట్టు అనిపించిందామెకు. చూస్తే లోకానికి పెంపుడు తండ్రినని చెప్పుకుంటున్న యజమాని ఆర్డర్. ఓ రోజు అతడి పాపం బద్ధలైంది. మరి దాని వల్ల ఆమెకు జరిగింది న్యాయమా? అన్యాయమా? అనితా సబర్వాల్ హృద్యమైన కథ **ఇజబెలా**

ఆమెకు తల్లిదండ్రులు లేరని తెలిసినా కొడుకు ప్రేమించాడని పెళ్లికి ఒప్పుకున్నాడా తండ్రి. కానీ ఓ స్నేహితుడి ద్వారా ఆమె తల్లి బతికే ఉందని తెలిసింది. తను స్వయంగా విచారిస్తే నిజమని తేలింది. ఆమె బతికుండీ కూతురికెందుకు దూరమైంది? దాని వెనుక దాగిన నిజమేంటి? చదవండి నిర్మల డోసి **పతిత**




* ప్రముఖ కవి, రచయిత గుల్జార్ కలం నుంచి జాలువారిన **నిరాశ**
* 35 ఏళ్లనాటి విపుల కథలో ప్రసిద్ధ కథకులు జయకాంతన్ తమిళకథ **శిలువ**
* కథకులఫైల్‌లో దాశరథి రంగాచార్య **మర్రిచెట్టు**

ఇంకా...
మరెన్నో కథలు, శీర్షికలు
సెప్టెంబరు విపులలో!


Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

# ప్రేమను ఎలా బతికించారు వాళ్ళు?

సాయం సమయం.. సాగరతీరం.. చల్లనిపిల్లగాలులు..
అయినా అవి అనిత శశాంక్‌లకు ఏమాత్రం హాయినివ్వడం లేదు..
ఇద్దరి కళ్లలోనూ నీళ్ల సుడులు..
గుండెలనిండా ఆవేదనాతరంగాలు..
'మనం విడిపోయి బతకలేం. పెద్దవాళ్లు మనల్ని విడగొట్టడానికే ఉన్నారు.
నువ్వు లేకుండా వేరే లైఫ్ ఏదీ నాకు అక్కర్లేదు' ఏడ్చేశాడు శశాంక్.
అప్పటికే ఆత్మహత్యకు సిద్ధమయ్యారు వారిద్దరూ.
ఆ సమయంలో ప్రేమను బతికించేందుకు ఓ మార్గం
చెప్పిందామె. ఇంతకీ ఏమిటా మార్గం? శశాంక్
ఒప్పుకున్నాడా? ప్రేమికులకు దిశానిర్దేశం చేస్తూ
హృద్యంగా సాగే ఆకునూరి హాసన్
బ్యాచిలర్ ఆఫ్ లవ్
చతుర అక్టోబరు
కానుక!

బోనస్‌గా...

* నవలావలోకనంలో..
ఏడురంగుల కలయికతో ఇంద్రధనుస్సు
ఏర్పడినట్లు, ఏడురకాల మనస్తత్వాలతో
వల్లంపాటి వెంకటసుబ్బయ్య
రూపొందించిన నవల ఇంద్రధనుస్సు
* చతుర ప్ర.జ.లో..
మనకు అనేక పక్షులుండగా అపరకర్మల్లో
కాకికే ఎందుకు ప్రాధాన్యమిస్తారు?
* చమత్'కారం'లో..
శ్రీకృష్ణుడికి శ్రీనాథుడి చురక!

ఇంకా మరెన్నో శీర్షికలు..

Raju

